అపరాధపరిశోధన అనుబంధం—168

# మూడు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## విచిత్ర వధ

రచన: వి. యస్. రావ్

## దేవుడే నా డిటెక్టివ్

రచన: వసుంధర

## గొప్పవాడు

రచన: గొట్టిపాటి నాగేశ్వరరావు

ఎడారి కోయిల — నాల్గవ భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్—168
డిసెంబరు, 1987
వెల: రు. 7-50
ఏడాది చందా: 90 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
ఏ. వి. మోహన్రావ్
బొమ్మిడి అచ్చారావు
వి. యస్. రావ్
సుంకరి రాంప్రసాద్
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# విచిత్ర వధ

ఏ. యస్. రావ్

హోటల్ గది కిటికీ ముందు అతను నిలబడ్డాడు.

చాలా శక్తివంతమైన బైనాక్యులర్స్ గుండా అతని కళ్ళు తీక్షణంగా చూస్తున్నాయి. రోడ్డుకి అటువైపున, దూరంగా వున్న హోటల్ ప్రెసిడెంట్ బాల్కనీ మీదికి బైనాక్యులర్స్ ఫోకస్ చేయబడ్డాయి. బైనాక్యులర్ లెన్స్ తనకి దగ్గరగా లాక్కొచ్చి చూపిస్తున్న ఇద్దరు వ్యక్తుల్ని అతను రెప్పవేయకుండా చూస్తున్నాడు.

చెరో ప్రత్యేక లోకానికి, ప్రత్యేక వర్గానికి, ప్రత్యేకమైన జాతికీ సంబంధించిన వ్యక్తుల్లా అవుపిస్తున్నారు వాళ్ళు అతనికి. ఒకతను ఖరీదైన సఫారీసూటులో హుందాగా వున్నాడు. గోల్డు రిమ్డ్ అద్దాలు అతని హోదానీ, ఐశ్వర్యాన్నీ స్పష్టంగా చూపిస్తున్నాయి. అతని ఎడం చేతిలో ఖరీదైన బ్రయర్ పైపు వుంది. లావుగా వున్న అతని ఎర్రటి పెదవులు కదుల్తున్నాయి. మాట్లాడిన ప్రతీసారీ అతను ముందుకి వొంగుతున్నాడు.

సన్నగా పొడుగ్గా వున్న రెండో వ్యక్తి చిటికీ మాటికీ పళ్ళు ఇకిలిస్తున్నాడు. గంగిరెద్దు తలలా అతని తల ముందుకీ వెనక్కీ అదేపనిగా ఊగుతోంది. జిడ్డుతో మెరుస్తున్న అతని మొహాన్నీ, చెమట బిందువులతో మెరుస్తున్న ఖరీదైన వ్యక్తి బట్టతలనీ బైనాక్యులర్స్ గుండా అతను చిరునవ్వుతో చూశాడు. రెండు వృత్తులకి, రెండు అంతస్థులకి చెందిన వ్యక్తులు ఏకాంతంలో ఊరికే కలుసుకోరు!

అతని వెనక తలుపు చిన్నగా చప్పుడు చేసింది. బైనాక్యులర్స్‌ని కిందికి దించి, మెల్లిగా వెనక్కి తిరిగాడు. అతని పెదవులు చిరునవ్వుతో విచ్చుకున్నాయి.

పింక్ కలర్ టర్కిష్ టవల్ అప్పుడే షవర్ కింది నుంచీ వచ్చిన ఆమె శరీరాన్ని తనలో దాచుకోడానికి వ్యర్థ ప్రయత్నం చేస్తోంది. బాబ్డ్ హెయిర్ ఫోటోకి అతికించిన నల్లటి ఫ్రేములా ఆమె కోల మొహానికి రెండు వైపులా అతుక్కుని వేళ్ళాడుతోంది.

అతను బైనాక్యులర్స్‌ని కళ్ళముందు పెట్టుకున్నాడు. నీటిముత్యాలతో నిండిన ఏదో దేవపుష్పంలా ఆమె మొహం అతని కళ్ళముందుకి దూసుకు వచ్చింది.

“దూరంలో వున్న వస్తువుల్ని దుర్భిణితో చూడాలి!” అందామె నవ్వుతూ.

నవ్వుతున్న అతని చేతిలోంచి బైనాక్యులర్స్ కిందికి జారింది.

“తలుపు గొళ్ళెం తీసేవుంచాను. నువ్వు బాత్‌రూమ్‌లోకి రాలేదు. ఆ బైనాక్యులర్స్‌తో ఎవర్ని చూస్తున్నావ్?” ఆమె నవ్వులో ఆక్షేపణ ధ్వనించింది.

“హోటల్ ప్రెసిడెంట్ బాల్కనీలో ఇద్దరు వ్యక్తులు–

మగవాళ్ళు—కూచున్నారు....”

“ఎవరు వాళ్ళు?” ఆమె అడ్డొస్తూ ప్రశ్నించింది.

“తెలీదు.”

“వాళ్ళని ఎందుకు చూశావ్?”

“తెలీదు.”

“ఎవర్ని చూస్తున్నావో, ఎందుకు చూస్తున్నావో తెలీనప్పుడు చూడ్డం దేనికి? వై వేస్టింగ్ టైమ్?” అందామె అద్దం ముందుకి కదులుతూ.

“కత్తిలాంటి బుర్ర వున్న వ్యక్తి కాలాన్ని వృధా చేయడు!” అన్నాడతను సగర్వంగా.

అద్దం ముందునుంచీ ఆమె గిరుక్కున అతనివైపు తిరిగింది. ఆమె విశాల నేత్రాలు అతనివైపు ఏవో ప్రశ్నల్ని రువ్వుతున్నాయి.

అతనామె కళ్ళల్లోకి చిరునవ్వుతో చూశాడు. “నువ్వు పంచతంత్రం చదివావా?”

ఆమె అర్థంకానట్టు చూసింది. “ఏం?”

“సింహం, నక్క ఒకచోట చేరి గుసగుసలాడుతుంటే ఏ ఎద్దో బలై పోతుంది....”

“డార్లింగ్........తెలుగులో మాట్లాడు!” ఆమె నవ్వుతూ అడ్డుతగిలింది.

“సింహంలాంటి ఘరానా వ్యక్తీ, జిత్తులమారి నక్కలాంటి మరో వ్యక్తీ యెదురుగా బాల్కనీలో గుసగుసలాడుతున్నారు!”

ఆమె కళ్ళు చిట్లించింది. అద్దంముందునుంచీ అప్రయత్నంగా అతనివైపు కదిలింది. అతను చెయ్యెత్తి ఆమెని వారించాడు. బైనాక్యులర్స్‌ని నిర్లక్ష్యంగా ఫోమ్ బెడ్ మీదికి గిరాటేసి, మంచంమీద కూచుని సిగరెట్

కలిగించాడు.

“వాసీ, త్వరగా తయారువా. అన్నీ సర్దేయ్. మనం హోటల్ ప్రెసిడెంట్ కి మారుతున్నాం ...”

“అది అల్లాటప్పా హోటల్ కాదు, అక్కడ అనుకున్నప్పుడల్లా గదులు దొరకవ్!” అందామె నవ్వుతూ.

అతను చిన్నగా నవ్వాడు. “అనుకున్నప్పుడల్లా అనుకున్నవన్నీ మనకి దొరుకుతాయ్!” అతని కంఠంలో గర్వం గంటలా ధ్వనించింది.

“గది ఖాళీ లేకుంటే ....”

“ఖాళీ అవుతుంది. మనకి కావాల్సిన గదిలో వున్న వ్యక్తికి వాళ్ళ ఊర్నుంచీ అర్జెంట్ ట్రంకాల్ వస్తుంది. ఎమర్జెన్సీ! అతను ఆదరాబాదరా గది ఖాళీచేసి పరుగు లంకించుకుంటాడు!”

“ఆ వ్యక్తికి ఊరూ, పేరూ.... డార్లింగ్ యెందు కొచ్చిన తంటా? ఇక్కడే హాయిగా....”

అతను తటాలున పైకిలేచి, నిటారుగా ధ్వజస్తంభంలా నించున్నాడు. పొగ ఊదుతూ సిగరెట్ నుసిని రాల్చాడు. ఆమెవైపు తీక్షణంగా చూశాడు.

“వాసీ, హోటల్ రిజిష్టర్ గురించి నువ్వు మరిచిపోతున్నావ్!”

ఆమె చిరునవ్వు నవ్వింది. “నువ్వింకా మారలేదు!”

అతను చిన్నగా నవ్వాడు. సిగరెట్ని గిరాటేసి, వజ్రాల్లా మెరుస్తున్న కళ్ళని ఆమె మొహంమీదే నిలిపాడు. ఆమె నవ్వు అతన్ని రెచ్చగొడ్తోంది.

“ఈ దేశంలోని కోర్టులూ, జైళ్ళూ నన్ను మార్చలేవు!” అన్నాడు సగర్వంగా శివరామ్....

# 2

రాత్రి పదకొండు దాటింది. మెయిన్ రోడ్డుమీంచీ అతను సన్నటి వీధిలోకి తిరిగాడు. కొంచెం దూరం నడిచి ఆగాడు. సిగరెట్ వెలిగించి, పక్కనే వున్న సందులోకి నడిచాడు. డార్క్ కలర్ సూటులో పొడుగ్గా వున్న అతన్ని చూసిన రెండు కుక్కలు పరుగు పందెం మానేసి, మొరగడం ప్రారంభించాయి.

అతను నిర్లక్ష్యంగా అడుగులేస్తున్నాడు. ఇరువైపులా వున్న చౌకబారు ఇళ్ళల్లోంచీ చౌకబారు అరుపులూ, చౌకబారు నవ్వులూ అడపాదడపా వినిపిస్తున్నాయి. కుడివైపున రెండు తెరిచిన గుమ్మాలముందు నిలబడ్డ ఇద్దరు ఆడాళ్ళు అతన్ని ఆశగా చూస్తున్నారు. తగ్గు స్వరంలో తనని ఆహ్వానిస్తున్న వాళ్ళ కంఠాల్ని అతను పట్టించుకోకుండా ముందుకు నడిచాడు. తనిప్పుడు హ్యూమన్ సర్వీస్ సెంటర్స్ వున్న ప్రదేశంలో వున్నాడని అతనికి తెలుసు.

సందు చివరున్న రెండంతస్థుల పాత ఇంటిముందు అతను ఆగాడు. రెండో అంతస్థు కిటికీగుండా ఇవతల చీకట్లోకి దూరుతున్న వెల్తుర్ని చిరునవ్వుతో చూశాడు. కటకటాలు లేని గేటుగుండా లోపలికి దూరి చీకటి వరండాలో వున్న మెట్లవేపు తిరిగాడు. పైకి తీసుకెళ్ళే మెట్లు ఎటువైపున వున్నాయో కూడా అతనికి తెలుసు.

చీకట్లో తడుముకోకుండా అతను మెట్లెక్కసాగేడు. కాస్సేపట్లో మేడమీదున్న గుమ్మంముందు నిలబడ్డాడు. ఆలోచిస్తూ, చివరిదమ్ములాగి సిగరెట్ పీకని వేలితో రోడ్డుమీదికి మీటాడు. ఎర్రటి గోళీలా సిగరెట్ పీక కిందికి దూసుకెళ్తోంది....

అతను తటాలున గుమ్మంవైపు తిరిగాడు. తను ఈ అర్ధరాత్రి సమయంలో కలుసుకోబోతున్న వ్యక్తి సామాన్యుడు కాడు. తను క్రూరమృగం వున్న గుహలోకి ప్రవేశిస్తున్నాడు. అయినా ఫరవాలేదు. క్రూరమృగాన్ని పిల్లిలా మార్చేసే ఆయుధం తన దగ్గరుంది! అతను నిర్భయంగా తలుపుని దబదబ బాదాడు.—

కాసేపు నిశ్శబ్దం అక్కడ తాండవించింది. మరోసారి తలుపు తట్టడానికి చెయ్యెత్తబోతూ అతను ఆగాడు.

"ఎవరు?" లోపల్నుంచీ బొంగురు కంఠం మొరిగింది. కోపంతో, విసుగుతో పదనుపెట్టబడిన ఆ కంఠం అతనికి చిరునవ్వు తెప్పించింది. కాస్సేపట్లో తన చిరునవ్వు లోపలివ్యక్తి కోపాన్ని మాయం చేసేస్తుందని అతనికి తెలుసు! జవాబుగా అతను మళ్ళీ తలుపుని బాదాడు.

లోపల్నుంచీ అడుగుల చప్పుడు అవలేదు. అయితే తలుపు తటాలున తెరవబడింది. హాల్లోంచి వెలుగు నడవమీదికి జారబడింది. గడకర్రలా నుంచున్న వ్యక్తిని అతను చిరునవ్వుతో చూశాడు. ఎర్రటి కళ్ళతో అతను ఎగాదిగా చూశాడు.

"ఎవరు?" అన్నాడతను మళ్ళీ - విస్కీ వాసన నడవలోకి చిమ్మింది.

"నువ్వే!"

అతను రౌద్రంగా చూశాడు. "నేను కాదు, నువ్వెవరు? ఇక్కడికెందుకొచ్చావ్?"

"అ రెండే కాదు, నీతో ఇంకా చాలా విషయాలు చెప్పాలి!" అన్నాడు శివరామ్, గుమ్మంవైపు జరుగుతూ.

అతని చెయ్యి తటాలున కదిలింది. ద్వారబంధాన్ని

అడ్డంగా పట్టుకుంది. "ముక్కూ మొహం తెలీనివాళ్ళు లోపలికిరారు!" అన్నాడతను బెదిరింపుగా.

"నేను లోపలికి వస్తాను. తరవాత ముక్కూ మొహం నీకు బాగా తెలుస్తాయి!" అతని చేతికి ఆనుకుంటూ అన్నాడు శివరామ్.

అతను ఆగ్రహంతో బుసకొట్టాడు. మళ్ళీ శివరామ్ని ఎగాదిగా చూశాడు. "నీకేం కావాలి?"

"రాజవర్మ నీతో బేరం చేసిన సంగతి నాకు తెలుసు. నేను కూడా నీతో బేరం చేయాలనుకుంటున్నాను...." శివరామ్ నవ్వుతూ అన్నాడు.

రాజవర్మ పేరు అతని మొహానికి కొత్తరంగు పులిమింది. ఏదో సందేహం, ఆశ్చర్యం అతని కళ్ళల్లోకి ప్రవేశించాయి.

"రా....జ....వ....ర్మ అతనెవరో నాకు తెలీదు. గెటౌట్!"

శివరామ్ కొద్దిగా వెనక్కి జరిగాడు. జేబులోంచీ సిగరెట్ తీసి వెలిగించాడు. పొగ ఊదుతూ అతన్ని తదేకంగా చూశాడు. "మంగారాం, హోటల్ ప్రెసిడెంట్. రూమ్ నంబర్ మూడూ మూడూ మూడూ. నీకోసం ఆ గదిని భరించిన వర్మా అండ్ కంపెనీ రాజవర్మ — తెలుసుగా?"

మంగారాం ఉలిక్కిపడ్డాడు. కళ్ళు చిట్లిస్తూ చూశాడు. అతను బుకాయించడానికి నోరు తెరిచేలోగా శివరామ్ మళ్ళీ ప్రారంభించాడు:

"మంగారాం, నీనుంచీ కాకమ్మ కబుర్లు వింటానికి ఇంత రాత్రివేళ పనికట్టుకురాలేదు; బేరం చేయడానికి వచ్చాను!"

మంగారాం చెయ్యి ద్వారబంధంనుంచీ కిందికి జారింది. లోపల్లోపల అతన్ని పీక్కుతింటున్న అనుమానం అతని పాము కళ్ళల్లో దోబోచులాడుతోంది.

"రాజవర్మ తెలుసా?" మెల్లగా ప్రశ్నించాడతను.

శివరామ్ చిన్నగా నవ్వాడు. "అతను నాకు తెలీక పోతే, నీ గురించి నాకు తెలిసేది కాదు!"

"నాతో బేరం చాలా ఖరీదైంది!" మంగారాం నిరుత్సాహపరిచే ధోరణిలో అన్నాడు.

"ఫైవ్ స్టార్ హోటల్‌కి వెళ్ళే వ్యక్తి అక్కడి రేట్లు తెలిసే వెళ్తాడు! పైగా నాకు ఖరీదైన బేరాలంటేనే ఇష్టం!" నవ్వుతూ శివరామ్ అతన్ని రాసుకుంటూ హాల్లోకి దూరాడు. వెనక్కి తిరిగి చూడకుండా హాలుమధ్య వున్న టేబుల్ ముందు కుర్చీలో ఠీవిగా కూచున్నాడు. వెనక్కి తిరిగిచూడకుండా మరో సిగరెట్ వెలిగించాడు. తలుపు మూసుకున్న శబ్దం అతనికి వినిపించింది. శివరామ్ ముఖంమీద చిరునవ్వు మెరిసింది. అడుగుల చప్పుడు అతన్ని సమీపించింది.

అతని ఎదురుగా కుర్చీలో కూచుని, మంగారాం చెప్పమన్నట్టు చూశాడు. శివరామ్ అతనివేపు ఒక సిగరెట్‌ని దొర్లించాడు. మంగారాం సిగరెట్‌ని ముట్టుకోలేదు. విసుగ్గా చూశాడు. అతను విసుగు నటిస్తున్నాడని శివరామ్‌కి తెలుసు.

"రాజవర్మ నీకు ఒక పని అప్పగించాడు. ఆ పని చేయడానికి నీకు రెండు లక్షలు ఫీజు."

"అదంతా అనవసరం. నీకేం కావాలో చెప్పు!" మంగారాం అడ్డొస్తూ కసిరాడు.

"సగం ఫీజు...." అతన్ని నిర్లక్ష్యం చేస్తూ శివరామ్

ప్రారంభించాడు.

మంగారాం తటాలున కుర్చీలోంచీ లేచాడు. తల వాల్చి తీక్షణంగా శివరామ్ వైపు చూశాడు.

"మిస్టర్, ఎవర్నువ్వు?"

"నీతో బేరం చేయడానికి వచ్చిన వ్యక్తిని!" శివరామ్ నవ్వుతూ అన్నాడు.

"ముక్కు మొహం తెలీని వాళ్ళతో మంగారాం బేరాలు చేయడు!" మంగారాం కంఠంలో గర్వం, కోపం జంటగా ధ్వనించాయి.

"నేను చెప్పేదంతా చెవులప్పగించి వింటే ముక్కు మొహమే కాదు. తోకా తొండమూ కూడా తెలుస్తాయి!" శివరామ్ నవ్వాడు.

మంగారాం కాసేపు తటపటాయించి, మెల్లిగా కుర్చీలో కూచున్నాడు తన దగ్గరగా టేబుల్ మీదున్న సిగరెట్ని అందుకుని ముట్టించాడు. శివరామ్ని అదోలా చూశాడు.

"ఆల్ రైట్; చకచకా చెప్పు. రెండు ముక్కల్లో అయిపోవాలి!"

"రాజవర్మ నీకు లక్షరూపాయలు అడ్వాన్సు ఇచ్చాడు. పనిపూర్తయ్యాక తతిమ్మా పైకం—లక్ష— ఇస్తాడు...." శివరామ్ ప్రారంభించాడు.

"నీ బేరం గురించి మాట్లాడు!" మంగారాం గర్జించాడు.

"మంగారాం, ఇప్పుడు నేను మాట్లాడుతోంది నా బేరం కాదని నువ్వెందుకు అనుకుంటున్నావ్?" శివరామ్ అతని కళ్ళల్లోకి తీక్షణంగా చూస్తూ ప్రశ్నించాడు.

మంగారాం కళ్ళు చిట్లించాడు.

"నీతో రాజవర్మ రహస్యంగా చేయిస్తున్న 'కార్యం' రహస్యంగానే వుండాలంటే అతను నీకిచ్చిన అడ్వాన్స్ లక్షరూపాయలు నువ్వు నాకు ఇచ్చుకోవాల్సి వుంటుంది" శివరామ్ తాపీగా అని, సిగరెట్‌ని టేబుల్ మీద నొక్కి ఆర్పేశాడు. మంగారాం ఊపిరి బిగబట్టడం అతనికి విని పించింది. తలెత్తి నవ్వుతూ చూశాడతను. మంగారాం పిడికిళ్ళు బిగుసుకున్నాయి.

"పిచ్చాసుపత్రినుండీ వస్తున్నావా?" మంగారాం కంఠం బొంగురుగా ధ్వనించింది.

"స్వార్థంకోసం, కట్టుకున్న భార్యని చంపడానికి హంతకుణ్ని నియమించే ధనవంతుడూ, డబ్బుకోసం అమాయకురాలైన ఆడదాన్ని నిర్దాక్షిణ్యంగా ఖూనీచేసే కసాయివాడూ వున్న పిచ్చిలోకంనుంచీ వస్తున్నా, మంగారాం!" శివరామ్ గంభీరంగా అన్నాడు.

మంగారాం వేళ్ళ సందులోంచీ సిగరెట్ టేబుల్ మీదికి జారిపడింది. ఎర్రటి కళ్ళతో అతను శివరామ్‌ని తీక్షణంగా చూశాడు.

"ఏమిటి నీ అర్థం?"

"ఏముంది? రాజవర్మ తన భార్యని నిర్మూలించాలను కున్నాడు. అతను చేతుల్తో ఆ పని చేయలేదు. రెండు లక్షల్తో నీ చేతుల్ని—ఆరితేరిన నీ చేతుల్ని—కొనుక్కు న్నాడు!" శివరామ్ నవ్వుతూ అన్నాడు.

మంగారాం తటాలున లేచి నిల్చున్నాడు. నిప్పులు కక్కుతూ చూశాడు. అతని చెయ్యి టేబుల్ సొరుగు వైపు జరిగింది.

"మంగారాం, చీటికీ మాటికీ ఉలిక్కిపడి లేచి నించుంటున్నావ్! రాజవర్మముందు కూచుని బేరం

పాగించినట్టు నాముందు శాంతిమయంగా కూచుని నేరం చెయ్! సిట్‌డౌన్!" శివరామ్ నవ్వుతూ అన్నాడు.

మంగారాం కూచోలేదు. అతని చెయ్యి టేబుల్ సొరుగుని ఇవతలికి లాగే ప్రయత్నంలో వుంది.

ఇంతసేపూ వొళ్ళో వున్న శివరామ్ ఎడమచెయ్యి తటాలున పైకి కదిలింది. తనముందు పడిన కార్డుసైజు ఫోటోని మంగారాం కంగారుగా చూశాడు.

"టేబుల్ సొరుగులో నువ్వు దాచుకున్న ఆయుధం కన్నా శక్తివంతమైన ఆయుధం నా దగ్గరుంది, మంగారాం!" శివరామ్ నవ్వుతూ అన్నాడు.

మంగారామ్ చెయ్యి మెల్లిగా ఫోటో దగ్గరగా జరిగింది. నవ్వు మొహంతో వందరూపాయ నోట్లకట్టల్ని అందిస్తున్న రాజవర్మనీ, నవ్వు మొహంతో అందుకుంటున్న తననీ చూపిస్తున్న ఆ ఫోటోని కంగారుగా చూశాడు మంగారామ్. మెల్లిగా అతని చూపులు శివరామ్‌వైపు లేచాయి.

"ఈ....ఫోటో....నీకెక్కడిది?" మంగారామ్ కంఠం కొద్దిగా వణికింది.

"ఫోటోలు ఎక్కణ్నుంచీ వస్తాయ్?" శివరామ్ చిరునవ్వుతో ఎదురు ప్రశ్న వేశాడు.

మంగారామ్ మెల్లిగా కుర్చీలో కూలబడ్డాడు. అతని దొంగ కళ్ళు శివరామ్‌నీ, ఫోటోనీ మార్చి మార్చి చూశాయి. టేబుల్ని కాలుస్తున్న సిగరెట్‌ని మెల్లగా పెదాలమధ్య ఇరికించాడతను. శివరామ్ రెప్పవేయకుండా అతన్నే చూస్తున్నాడు. మంగారామ్ లోపల సాగుతున్న ఆలోచనలు అతని మొహంమీద తెరమీద బొమ్మల్లా శివరామ్‌కి కనిపిస్తున్నాయి. మంగారాం పెద

వులు వంకరగా కదిలాయి. గారపళ్ళు తొంగిచూశాయి.

"ఒక వ్యక్తి మరో వ్యక్తికి డబ్బియ్యడం, ఒక వ్యక్తి నుండి మరో వ్యక్తి తీసుకోడం నేరం కాదు!"

జవాబుగా శివరామ్ చిన్నగా నవ్వాడు. "అఫ్‌కోర్స్ అయితే ఆ వ్యక్తి ఎందుకిచ్చాడనీ, నువ్వెందుకు పుచ్చుకున్నావనీ యెవరేనా-ముఖ్యంగా పోలీసులు—ప్రశ్నిస్తే సమాధానం చెప్పడం అంత సులభంకాదు! పైగా నీ గతంలో దాగిన యెన్నో శవాలు పైకిలేస్తాయి!"

మంగారామ్ కళ్ళు చిట్లించాడు. శివరామ్ మళ్ళీ నవ్వాడు. "తెగించిన నువ్వూ, తెగిస్తున్న రాజవర్మ లాంటి ఘరానా వ్యక్తీ ఏదో రోంకి బైటపడతారు. అది కూడా నేను ఆలోచించాను...." అంటూ అతను కుడిచేతిని కోటుజేబులోకి పోనిచ్చాడు. మంగారాం తెలబోయి కూచున్నాడు. జేబులోంచి తీసిన చిన్న టేప్ రికార్డర్ని శివరామ్ టేబిల్ మీద పెట్టాడు.

"మంగారాం, మీరిద్దరూ మూడు రోజులుగా ఏమేం మాట్లాడుకున్నారో విను!" శివరామ్ నవ్వుతూ బటన్ని వేలితో నొక్కాడు.

* * *

....శివరామ్ వేలు స్టాప్ బటన్ని నొక్కింది. చిరునవ్వు నవ్వుతూ అతను మంగారాంని చూశాడు. మంగారాం ఉక్కిరిబిక్కిరవుతూ చూస్తున్నాడు. అతని నోరూ, కళ్ళూ తెరుచుకునే వుండిపోయాయి. ఇరవై ఏళ్ళ అనుభవంలో తను యెంతో తెలివిగా యెన్నో నేరాలు ప్లాన్ చేశాడు. విజయవంతంగా అమలుజరిపాడు. తన అడ్వెంచర్స్‌ని ఈ విధంగా యెవ్వరూ ప్రారంభంలోనే పసికట్టలేదు....

"మంగారాం, నీ ప్రాణంతా ఈ గుప్పిట్లో వుంది!" మూసిన గుప్పిట చూపిస్తూ శివరామ్ గంభీరంగా అన్నాడు.

"నేను... నేను నమ్మలేకుండా వున్నాను...." మంగారాం పెదవులు తడబడుతూ కదిలాయి.

"మరోసారి వింటావా?" శివరామ్ ఎగతాళిగా అన్నాడు.

"అవసరంలేదు...." మంగారాం మెల్లిగా పైకి లేచాడు. శివరామ్‌వైపు ఒక్కరవ అయిష్టంగా చూశాడు "నీకు ఇవ్వాల్సింది ఇస్తాను...." అంటూ అతను టేబుల్ నుంచీ దూరంగా జరిగి, వెనకవైపున్న గుమ్మంవైపు తిరిగాడు.

"మంగారాం........."శివరామ్ మెల్లిగా పిలిచాడు. మంగారాం వెనక్కి తిరిగి అసహనంగా చూశాడు.

"మంగారాం, అంత తొందరేంలేదు. కూచో" శివరామ్ నవ్వుతూ అన్నాడు.

మంగారాం అర్థంకానట్టు చూశాడు. "ఇచ్చేది ఎప్పు డైనా ఇవ్వాలిగా?" అన్నాడతను నిర్లక్ష్యంగా.

"నువ్వు ఈ క్షణంలో యివ్వదల్చుకున్నదేమిటో నీ కళ్ళు నాకు చెప్తున్నాయ్!"

మంగారాం కళ్ళు చిట్లించాడు. మదతల్లో దాక్కుం టున్న అతని పాము కళ్ళల్లోకి శివరామ్ నవ్వుతూ చూశాడు.

"వెనకాముందూ చూసుకుని రాజవర్మ బేరం కుదుర్చు కుండా నిర్లక్ష్యంగా మూర్ఖంగా వ్యవహరించినట్టే ఇప్పుడూ నువ్వు మూర్ఖంగా వ్యవహరిస్తున్నావు. అమా యకుల్ని, బలహీనుల్ని హతమార్చేటప్పుడు నువ్వు చేతిలో ధరించే కత్తిలాగా బుర్రను కూడా నువ్వు పదనుగా

వుంచుకోవాలి!"

"ఏమిటీ వాగుడు?" మంగారాం గద్దించాడు.

"ఒక కాపీ ఫోటో, ఒక క్యాసెట్ మాత్రం పట్టుకుని నేనిక్కడికి వచ్చాను. నా గుండెలోకి తూటా దొక్కించి, లేదా బెదిరించి ఆ రెండింటినీ నువ్వు లాక్కుని తప్పించుకునే అవకాశం ఇచ్చేలా నీ దగ్గరకు నేను వచ్చానని ఎలా ఊహించావు, మంగారాం?" శివరామ్ నవ్వుతూ అడిగాడు.

"నువ్వనేదేమిటో నాకు అర్థంకాలేదు!"

"నేను ఎక్కడ్నుంచీ వచ్చానో అక్కడ ఇంకా ఫోటోలూ, క్యాసెట్లూ వున్నాయ్. పన్నెండూ పదిహేనుకి నేను సురక్షితంగా తిరిగి వెళ్ళకపోతే ఆ సరంజామా యెవరికంట పడకూడదని నువ్వు కోరుకుంటావో వాళ్ళకే అందించబడతాయి!"

మంగారాం నాలుకతో ఆరిపోయిన పెదాల్ని తడుపుకున్నాడు. శివరామ్ సిగరెట్ వెలిగించి, రిస్టువాచీ చూసుకున్నాడు. తలెత్తి మంగారాంవైపు సాభిప్రాయంగా చూశాడు. నేలకి పాదాలు తాపడం అయిపోయిన వ్యక్తిలా నిలబడ్డాడు మంగారాం.

"పదకొండూ నలభై అయిదు. మరో ముప్పైనిమిషాల్లో నేను అక్కడికి క్షేమంగా, లాభంతో చేరుకోవాలి. అంటే 'నీ సేఫ్టీ ఫిరియడ్' మరో అరగంట మాత్రమే! లోపలికి వెళ్ళు. పైకం పట్టుకొస్తావో, పిస్టల్ పట్టుకొస్తావో నీ ఇష్టం!" శివరామ్ నవ్వుతూ అన్నాడు.

మంగారాం శరీరం ఒకసారి ముందుకీ, వెనక్కీ ఊగింది.

"నాకు రెండు సందేహాలున్నాయి...." అంటూ

అగాడతను.

"నా దగ్గర మూడు సమాధానాలున్నాయ్!" శివ రామ్ నవ్వాడు.

"....ఇస్తే....ఫోటోలూ, నెగటివ్‌లూ, క్యాసెట్లూ ఇచ్చేస్తావా?"

"సంతోషంగా. నువ్వు నిద్రలేచేసరికి నీ గుమ్మం ముందు పార్శిల్ పడుంటుంది...."

"ఏమిటి గ్యారంటీ?" మంగారాం ప్రశ్నించాడు.

"వ్యాపారానికి నమ్మకం మూలం. గ్యారెంటీ వేరే లేదు. నువ్వున్న స్థితిలో నన్ను నచ్చినట్టు నమ్మాలి!"

మంగారాం క్షణకాలం తరవాత మెల్లిగా తల పంకించుకున్నాడు.

"రెండో సందేహం; నీ దారిన నువ్వు పోయాక అగ్రిమెంటు ప్రకారం పని పూర్తిచేసి నా ఫీజు వసూలు చేసుకోవచ్చుగా?" మంగారాం కంఠంలో ఆశ శేగంటలా ధ్వనించింది.

"నిరభ్యంతరంగా. ఎవడి పెళ్ళాన్నో, ఎవడో చంపితే నాకు నష్టంలేదు. లక్షరూపాయలిచ్చి లాభం కలిగిస్తున్నావుగా?"

మొదటిసారిగా మంగారాం మొహంలో కండరాలు వదులయ్యాయి. ధారాళంగా అతను చిరునవ్వు నవ్వుతాడేమో అనిపించింది శివరామ్‌కి. కానీ మంగారాం చిరునవ్వు నవ్వలేదు.

శివరామ్ చిన్నగా నవ్వాడు. "ఇంక మూడో సమాధానం, మంగారాం: చేతనైతే రాజవర్మ నుంచీ ఎంతో కొంత ఎక్కువగా గుంజుకుని నా లాభంవల్ల కలుగు

తున్న నష్టాన్ని పూడ్చుకో!''

మంగారాం కళ్ళు విచ్చుకున్నాయి. అతను ఆశ్చర్యంగా చూశాడు. ఆరితేరిన నక్కను చూస్తున్న మరో నక్కలా అతను తనని గమనిస్తున్నాడని శివరామ్ గ్రహించాడు. మంగారాం మెల్లిగా కదిలి, ఆగి, శివ వైపు అదోలా చూశాడు.

"నువ్వెవరు?''

"పేరు చెప్తాను. అయినా అది నీకు అర్థంకాదు! ఎందుకంటే ఆ పేరుమీద ఆధారపడి రేపు నువ్వు నన్ను పోల్చుకోలేవు. నువ్వు పైకి అనకపోయినా నేను దొంగాట ఆడుతున్న పోలీసు నేమోనని అనుమానం నిన్ను దొల్చుకు తింటోందని నాకు తెలుసు....'' శివరామ్ ఆగి నవ్వుతూ చూశాడు.

మంగారాం కళ్ళు ఇంకా విచ్చుకున్నాయి. శివరామ్ అన్నాడు. "మంగారాం, నీకున్న అనుభవంతో నువ్వు దొంగ ఎవరో, దొర ఎవరో వాసనపట్టి కనిపెట్టొచ్చు. పధ్నాలుగో తేదీన నువ్వు ఎవర్ని, ఎక్కడ, ఎలా అంతం చేయబోతున్నావో నాకు తెలుసు. నేను పోలీసునే అయితే ఇప్పుడు ఇక్కడ నిన్ను కలుసుకుని వుండను. పధ్నాలుగున నిన్ను 'అక్కడ' రెడ్‌హేండెడ్‌గా పట్టుకునే వాణ్ని. రెండు దశాబ్దాలుగా రకరకాల నేరాలు చేస్తూ పోలీసుల వలలో చిక్కకుండా గడసరి చేపలా తప్పించుకు తిరుగుతున్న మంగారాంని బంధించిన క్రెడిట్ కొట్టేసి వుండేవాణ్ని!''

మంగారాం నిట్టూర్పు పాము బుసలా ధ్వనించింది. అతను తలపంకిస్తూ లోపలికి నడిచాడు.

# 3

‘తలుపు తెరిచేముందు బెల్ నొక్కండి’—రోజ్ వుడ్ తలుపుమీద ఎర్ర రంగు అక్షరాల్లోని హెచ్చరికను పూర్తిగా నిర్లక్ష్యంచేస్తూ శివరామ్ హాండిల్ని తిప్పి, తలుపుని బార్లా లోపలికి తోస్తూ దురుసుగా లోపలికి దూరాడు. అతను వదిలేసిన తలుపు తటాలున మూసుకుంది. ఎయిర్ కండిషన్డ్ రూమ్.

గోడవారగా విశాలమైన వాల్‌నట్ టేబుల్ వెనక నెమలి సింహాసనంమీద కూచున్న చక్రవర్తిలా హుందాగా కూచున్న వ్యక్తి గోల్డ్ రిమ్డ్ అద్దాలగుండా తీక్షణంగా చూస్తున్నాడు. అతని దగ్గరగా షార్ట్‌హాండ్ నోట్ బుక్, పెన్సిల్ పట్టుకున్న యువతి ఆశ్చర్యంతో, డిక్టేషన్ తీసుకుంటున్న అజంతా శిల్పంలా చలనం లేకుండా నించుంది. ఆమె తల ఇటువైపుకి తిరిగింది. కళ్ళు విడ్డూరంగా విచ్చుకున్నాయి. తన రాక ఇద్దరికీ ఆశ్చర్యాన్నీ, అతనికి ఆగ్రహాన్నీ కలిగించిందని శివరామ్ చిటికెలో గ్రహించాడు.

“గుడ్ మార్నింగ్!” శివరామ్ ఉషారుగా అన్నాడు.

“గెటౌట్!” ఆ వ్యక్తి కంఠంలో ఆగ్రహం ధ్వనించింది.

శివరామ్ ఠీవిగా టేబుల్ వైపు, లోపలికి అడుగు వేశాడు.

“బుద్ధిబలాన్నీ, భుజబలాన్నీ ఉపయోగించి లోపలికి వస్తే, తోకముడుచుకుని బైటికి వెళ్ళడానికి కాదు!” అన్నాడు నవ్వుతూ.

టేబుల్ మీదున్న అతని ఎడమచెయ్యి పిడికిలిగా బిగుసుకుంది. ఎర్రబడుతున్న మొహం అతని ఆగ్రహాన్ని

చూపిస్తోంది.

"నిన్నెవరు లోపలికి రానిచ్చారు?"

"ఎవ్వరూ రానివ్వలేదు...."

"అయితే లోపలికెలా వచ్చావ్?" అతని ప్రశ్న పిస్టల్ షాట్‌లా ధ్వనించింది.

"ఈ లోకంలో డబ్బుంటే అనుకున్న పనులన్నీ చేయొచ్చు మిస్టర్ రాజవర్మా!" శివరామ్ అతని కళ్ళల్లోకి సూటిగా చూస్తూ అన్నాడు.

రాజవర్మ కళ్ళు వడగళ్ళలా అయ్యాయి. అతని పెదవులూ, దవడలూ అదిరాయి. "ఎవర్నువ్వు? ఎందుకొచ్చావ్?"

"బలహీనులైన మనుషుల్ని ఆధారంగా చేసుకుని బలవంతులు వాళ్ళనుండీ ధనరాసుల్ని సంపాయించుకుని, ఆ ధనంతో తమ చుట్టూ కోటలు కట్టుకుంటారు. ఆ మనుషుల్ని తమను కలుసుకోకుండా అటకాయిస్తారు! ఆ దుర్మార్గాన్ని ఎదిరిస్తూ కోటల్ని బద్దలుకొట్టి, లోపలికి జొరబడే వ్యక్తిని!" శివరామ్ గంభీరంగా అన్నాడు. అతని కంఠంలో గర్వం ధ్వనించింది.

"నీ ఉపన్యాసం నా ప్రశ్నకి సమాధానం చెప్పలేదు!" రాజవర్మ కోపంగా అన్నాడు.

"మీరొక్కరే వినడానికి ఇంకా చాలా ఉపన్యాసాలు తయారుచేసుకు వచ్చాను...."

రాజవర్మ మాట్లాడలేదు. శివరామ్ మోహాంమీంచీ చూపుల్ని తిప్పలేదు' అతని చెయ్యి టేబుల్ కిందున్న బటన్ని నొక్కింది. క్షణంలో తలుపు తెరుచుకుంది; మూసుకుంది.

"వరాహం, ఈ పిచ్చివాణ్ని బైటపడేయ్. గేటు

ముందూ, మూడు గుమ్మాల ముందూ ఎవరెవరున్నారో కనుక్కో. అందర్నీ డిస్మిస్ చెయ్!" రాజవర్మ చూపులు తిప్పకుండా అన్నాడు.

అతను తన వెనక ప్రత్యక్షమైన వరాహం అనబడే గార్డుకి ఉత్తరువిస్తున్నాడని శివరామ్‌కి అర్థమైంది. అతని భుజమ్మీద ఏదో చెయ్యి బరువుగా పడింది. శివరామ్ తల పక్కకి తిప్పాడు. పొట్టిగా, లావుగా వున్న బోడి గుండు వ్యక్తిని చిరునవ్వుతో చూశాడు. ఆ వ్యక్తి కళ్ళు మినుకు మినుకు మంటున్నాయి. శివరామ్ భుజమ్మీద ఒత్తిడి ఎక్కువైంది. అతని భుజం తటాలున స్ప్రింగులా కదిలింది. వరాహం చెయ్యి కిందికి జారింది.

శివరామ్ రెండడుగులు వేసి టేబుల్‌కి ఆనుకున్నాడు. రాజవర్మ కళ్ళల్లోకి ఛాలెంజ్ చేస్తున్నట్టు చూశాడు. "వెళ్ళమంటే వెళ్ళిపోతాను. తరవాత ఫోన్ చేసి ఎందుకు వచ్చానో టూకీగా చెప్తాను. ఆ తరవాత నన్ను కల్సుకోడానికి నువ్వు ఖచ్చితంగా ప్రయత్నిస్తావ్? అప్పుడు నా దర్శనానికి టిక్కెట్టు పెడ్తాను. ఆ టిక్కెట్టుని నువ్వు, బ్లాక్‌లో కొనాల్సి వుంటుంది!" అన్నాడు ఏకవచనం ప్రయోగిస్తూ

పక్కనే వున్న వరాహం ఊపిరి బిగబట్టడం శివరామ్‌కి స్పష్టంగా వినిపించింది.

"వరాహం!" రాజవర్మ గర్జించాడు. వరాహం చెయ్యి ఇంకొంచెం బరువుగా శివరామ్ భుజమ్మీద పడింది.

"మిష్టర్ రాజవర్మా. హోటల్ ప్రెసిడెంట్. రూమ్ నంబర్ మూడూ మూడూ మూడూ. అక్కడ నిన్ను కల్సుకున్న, లేదా నువ్వు కల్సుకున్న వ్యక్తి పేరు కూడా

చెప్పమంటావా?"

తనమాట రాజవర్మమీద బ్రహ్మాండంగా పనిచేసిందని శివరామ్ చిటికెలో గ్రహించాడు. రాజవర్మ మొహంలోకి ఇందాకా ఎగబాకిన రక్తం సర్రున కిందికి జారింది. మళ్ళీ అతని పెదాలూ, దవడలూ అదిరాయి. ఆ అదురుకి కారణం కోపం కాదని శివరామ్‌కి తెలుసు.

అతను యెలా సైగ చేశాడో శివరామ్‌కి తెలీదుకానీ, అతని భుజమ్మీంచి వరాహం చెయ్యి దూరంగా జరిగింది.

"శీలా, వెళ్ళు. మళ్ళీ పిలిచేదాకా మేడమీద గదిలో కూచో...." రాజవర్మ శివరామ్‌మీంచీ చూపులు తిప్పకుండా అన్నాడు.

అజంతా శిల్పానికి ప్రాణం వచ్చింది. ఆమె మొహం మీద ఆశ్చర్యం ఇంకా కాపరం చేస్తూనే వుంది. తడబడే అడుగుల్తో ఆమె గుమ్మంవైపు నడిచింది.

"వరాహం...." రాజవర్మ ముక్తసరిగా అన్నాడు. కాసేపట్లో రెండుసార్లు తెరుచుకుని, రెండుసార్లు మూసుకుంది తలుపు.

"ఎవర్నువ్వు? ఏమిటి నీ అర్థంలేని ప్రేలాపన?" రాజవర్మ గంభీరంగా ప్రశ్నించాడు.

శివరామ్ పక్కనే వున్న కుషన్డ్ కుర్చీలో కూచున్నాడు. కోటు జేబులోంచీ సిగరెట్ పాకెట్ తీశాడు. సిగరెట్‌ని పెదాలమధ్య ఇరికించి అగ్గిపెట్టె తీశాడు.

"డోంట్ స్మోక్!" రాజవర్మ హుంకరించాడు.

శివరామ్ మొహంమీద చిరునవ్వు మెరిసింది. అతని చెయ్యి మళ్ళీ జేబులోకి వెళ్ళింది. వేళ్ళమధ్య ఇరుక్కుని ఇవతలికి వచ్చిన ఫోటోని పేకముక్కలా రాజవర్మ ముందుకి రువ్వాడతను.

అప్రయత్నంగా రాజవర్మ కళ్ళు ఫోటోవైపు తిరిగాయి. తటాలున అతను శివరామ్‌వైపు చూశాడు. అతని కళ్ళు ఆశ్చర్యాన్ని విశ్వరూపంలో చూపిస్తున్నాయి.

“వాటీస్ దిస్?” అతని కంఠం వణికింది.

“శివరామ్ మాట్లాడకుండా, అగ్గిపుల్ల గీచాడు. పెదాల మధ్యనుంచీ ఏటవాలుగా వేళ్ళాడుతున్న సిగరెట్‌ని మంటలో గుచ్చాడు. అగ్గిపుల్లని తివాచీ మీదికి రువ్వి. పొగ ఊదుతూ సగర్వంగా రాజవర్మ మొహంలోకి చూశాడు. స్మోక్ చేయొద్దంటూ తనని ఆజ్ఞాపించే స్థితిలో అతను లేడని శివరామ్‌కి తెలుసు.

“నా ప్రేలాపనకి అర్థం వుందనీ, నా అర్థం నీకు అర్థమౌందనీ నాకు తెలుసు. అర్థంకాకుంటే నా బదులుగా వాళ్ళిద్దర్నీ బైటికి పంపవు!” శివరామ్ నవ్వుతూ అన్నాడు.

రాజవర్మ పొలమారినవాడిలా చూశాడు.

కిరాయి హంతకుడికి నువ్వొక ముఖ్యమైన పని అప్పగించావు. ఆ పనేమిటో, దాన్ని యెప్పుడు యెలా పూర్తి చేయాలో—ఈ క్యాసెట్ వింటే నీకు గుర్తువస్తుంది. లెఖ్ఖలేనన్ని బిజినెస్ ట్రాన్సాక్షన్స్‌లో పాపం, నువ్వు మరిచిపోయి వుంటావు!” శివరామ్ నవ్వుతూ చేతిలోని క్యాసెట్‌ని పాకెట్ టేప్‌రికార్డర్‌లో ఇరికించాడు.

* * *

పదిహేను నిమిషాలు రాజవర్మ వయసుని పాతికేళ్ళు పెంచేశాయి. టేబుల్ మీద పిడికిళ్ళుగా బిగుసుకున్న అతని చేతులు వణుకుతున్నాయి. వారం రోజులు వరసగా నిద్రలేనివాడి కళ్ళలా అతని కళ్ళు ఎర్రగా వున్నాయి. టేబుల్ మీదే వున్న సిల్క్ జేబు రుమాలు తీసుకుని

అతను నుదుర్ని అద్దుకున్నాడు. అద్దాలు తీసేసి, మొహ మాంతా తుడుచుకుని, అద్దాల్ని తుడిచి మళ్ళీ తగిలించాడు. క్షణం క్రితం కలలో కనిపించి, విచిత్రంగా తన ముందు ప్రత్యక్షమైన యువకుడో వ్యక్తిని చూస్తున్నట్టు శివరామ్‌ని చూశాడు.

"ఇంతకీ....ఎవరు నువ్వు....?" రాజవర్మ కంఠంలో ఇందాకటి దర్పం లేదు.

"నా గురించి ఆలోచిస్తూ బుర్ర పాడు చేసుకోవద్దు. నీ గురించి ఆలోచించు!" శివరాం నవ్వుతూ అన్నాడు.

"ఇదంతా....నీకు........నీకెలా తెలుసు?" రాజవర్మ పెదవులు కదిలీకదలకుండా ప్రశ్నించాడు.

"నాకు ఇంకా చాలా తెలుసు. పనిపూర్తయ్యాక, సమయం చూసి నువ్వు కోకిలాదేవిని భార్యగా స్వీకరిస్తావు. అలాగా అకాలంలో అకస్మాత్తుగా 'నిన్ను విడిచి స్వర్గం వెళ్ళిపోయిన' నీ ప్రియమైన ధర్మపత్ని సంస్మరణార్థం దేశంలోని పేపర్లు అన్నిటిలో ఫోటోలు ఫుల్ పేజ్—ప్రచురిస్తావు. అగ్నిసాక్షిగా పెళ్ళాడిన నీ అర్ధాంగికి నువ్వు సమర్పించే అశ్రుతర్పణంతో నెలరోజుల పాటు ఇండియాలోని న్యూస్ పేపర్లు అన్నీ తడిసి ముద్దయిపోతాయి...."

"స్టాపిట్!" రాజవర్మ కంగారుగా అరిచాడు.

"ఈ నాటకం పూర్తి అయ్యేసరికి కోకిల చేతా, నీ చేతా ఇన్‌ఫ్లుయెన్స్ చేయబడిన నీ శ్రేయోభిలాషులు నిన్ను అర్జెంటుగా పెళ్ళిచేసుకొమ్మని పట్టిగ్గా సతాయిస్తారు. వాళ్ళకోసం, మరణించిన నీ అర్ధాంగి ఆత్మశాంతికోసం నువ్వు....బలవంతంమీద కోకిలాదేవిని పెళ్ళాడతావు!"

నవ్వుతూ శివరాం మరో సిగరెట్ వెలిగించాడు.

"బాస్టర్డు....వాడు....ఆ మంగారాంగాడు తాగేసి అంతా చెప్పాడా?" రాజవర్మ పళ్ళు కొరుకుతూ అన్నాడు.

ప్రశ్నకాని ప్రశ్న విని శివరాం చిన్నగా నవ్వాడు. "నువ్వు డబ్బున్న దొంగ. మంగారాం డబ్బులేని దొంగ. ఎలాంటి వాళ్ళయినా దొంగలు తాము చేయబోయే నేరం గురించి చెప్పుకోరు!"

రాజవర్మ కళ్ళు చిట్లిస్తూ చూశాడు.

"రాజవర్మ డబ్బుతో హత్య చేస్తాడు. మంగారాం చేత్తో చేస్తాడు. ఇద్దరూ హత్య గురించి చెప్పుకోరు! అర్థమైందా?" శివరాం అతని కళ్ళల్లోకి చూస్తూ అన్నాడు.

కొద్దిగా తేరుకున్న రాజవర్మ కుర్చీలోంచీ లేచాడు. రెండు చేతుల్నీ టేబుల్ మీద ఆన్చి, శివరాం వైపు ముందుకి వంగాడు. అతని కళ్ళు సానపెట్టిన వజ్రాల్లా తళుక్కుమంటున్నాయి. అతని పెదవులు మెల్లిగా కదిలాయి.

"ఇంటలిజెంట్ రోగ్! నీ ఫోటో, నీ క్యాసెట్— అన్నీ ఫేబ్రికేటెడ్ సరంజామా అని చిటికలో నిరూపిస్తాను. పోలీసులు సన్నాయి మేళంతో నిన్ను ఊరేగింపు జరిపి, అత్తారింటికి తీసుకెళ్తారు!" సన్నటి రాజవర్మ కంఠం స్పష్టంగా, ధైర్యంగా ధ్వనించింది.

శివరాం లోపల్లోపల అతని ధైర్యాన్నీ, నక్క తెలివినీ మెచ్చుకున్నాడు. రాయిలా కనిపిస్తున్న ఆ ధైర్యం కింద, ఆ రాయిని కరిగించివేసే భయం కదుల్తోందని అతనికి తెలుసు. కనుబొమలు పైకెత్తి అతను

రాజవర్మను అబ్బురంగా చూశాడు.

"అవన్నీ ఇక్కడ పడేసి, తోక ఝాడించు! నీ గురించీ, పోలీసులకి ఫోన్ చేయడం గురించీ మరిచి పోతాను!" రాజవర్మలోని అరితేరిన బేరగాడు అన్నాడు.

టేబుల్ మీదున్న టేప్ రికార్డర్ లోంచీ క్యాసెట్ ని తీశాడు శివరాం. మెల్లిగా పైకిలేచాడు. క్యాసెట్ ని రాజవర్మ ముందున్న ఫోటో మీదికి గురిచూసి గిరాటేశాడు. టేప్ రికార్డర్ని కోటుజేబులో దోపుకున్నాడు. పూర్తిగా కాలిన సిగరెట్ ని వాల్ నట్ టేబుల్ మీద నొక్కేశాడు. కొత్త సిగరెట్ ని పెదాలమధ్య ఇరికించి, ముట్టించాడు. ఇంతసేపూ అతని కళ్ళు మాత్రం రాజవర్మ కళ్ళల్లోకే కత్తుల్లా చూస్తున్నాయి. అతని పెదవులమీద చిరునవ్వు నృత్యం చేసింది. రాజవర్మ రెప్పలు వేయకుండా అతన్నే చూస్తున్నాడు.

శివరాం నిర్లక్ష్యంగా వెనక్కి తిరిగాడు. హుందాగా తివాచీమీద నడుస్తూ తలుపు ముందు ఆగాడు. గిరుక్కున వెనక్కి తిరిగి విగ్రహంలా నిలబడ్డ రాజవర్మని తదేకంగా చూశాడు.

"రాజవర్మా, బానిసలా బతికే బంటులా తెలివి తక్కువగా మాట్లాడావు. తెలివితక్కువతనాన్ని నేను క్షమిస్తాను. ధనమదాన్నీ, అహంకారాన్నీ నేను క్షమించను! పోలీసుల పేరు చెప్పి నన్ను బెదిరించే ప్రయత్నం చేశావ్. నేనే వాళ్ళ దగ్గరకు వెళ్తాను. కానీ, ఇప్పుడు కాదు. న్యూస్ పేపర్స్ లో నీ భార్య సంస్మరణ అచ్చయినప్పుడు నేను కదుల్తాను. నా కస్టడీలో వున్న ఆ ఫోటో, క్యాసెట్ల కవలపిల్లలు రెక్కలొచ్చి పోలీసుల హస్తాల్లో, పేపర్ వాళ్ళ హస్తాల్లో అప్పుడు

"వాల్తాయి! గుడ్ బై!" శివరాం గిరుక్కున వెనక్కి తిరిగాడు. విసురుగా తలుపుని లాగాడు.

"ఆగు!" బొంగురుగా, బిగ్గరగా ధ్వనించిన రాజవర్మ కంఠం అతన్ని ఆపింది. లోపల్నుంచీ తన్నుకొస్తున్న నవ్వుని అపుకుని, శివరాం సావధానంగా వెనక్కి తిరిగాడు. కాబోయే మామగార్ని, బాగా కట్నం ఇచ్చే కాబోయే మామగార్ని—కాబోయే అల్లుడిలా నవ్వుతూ చూశాడు.

"ఇలా రా!" రాజవర్మ పిలిచాడు.

కోటు జేబుల్లోకి రెండు చేతులూ దోపి, మూసుకున్న తలుపుకి వీపుని ఆన్చి, శివరాం వాలుగా నిలబడ్డాడు. ఎగతాళిగా నవ్వుతున్న కళ్ళని రాజవర్మ మొహంమీదే నిలిపాడు.

"ఇస్తో అంటే పరిగెత్తడానికీ, ఈలవేస్తే వెనక్కి తిరిగి, తోకాడించుకుంటూ నీ కాళ్ళ ముందుకి పరుగెత్తుకు రాడానికీ నేను నీ పెంపుడు కుక్కను కాను!"

రాజవర్మ తన కోపాన్ని గుటకల రూపంలో దిగమింగాడు. పెదాలు బిగబట్టి క్షణకాలం శివరాంని చూసి, టేబుల్ వెనకనుంచీ ఇవతలికి కదిలాడు. టేబుల్ ముందు ఆగి, అదోలా చూశాడు.

"నువ్వెవరో నాకు తెలీదు........ పేరు చెప్పడానికి భయమా? ఊరూ పేరూ తెలీని వాళ్ళతో వ్యవహారం చేయడం నా తత్వానికి విరుద్ధం...."

శివరాం చిన్నగా నవ్వాడు. "నీలాంటి వ్యక్తుల ముందు భయపడ్డం నా తత్వానికి విరుద్ధం. పేరు శివరాం. ఊరు ప్రస్తుతానికి ఇదే. అడ్రసు కేరాఫ్ హోటల్ ప్రెసిడెంట్. చాలా?"

“శివరాం,, తీరిగ్గా కూచిని, శాంతిమయంగా డిస్కస్ చేద్దాం....” కుర్చీవైపు చూపిస్తూ అన్నాడు రాజవర్మ.

శివరాం నవ్వుతూ కదిలాడు. సావధానంగా అడుగులు వేస్తూ రాజవర్మముందు ఆగాడు. కోటుజేబుల్లో చేతుల్ని అలాగే వుంచుకుని ఎయిర్ కండిషన్డ్ రూమ్‌లో వున్నా చెమటలు కక్కుతున్న రాజవర్మ మొహాన్ని తృప్తికరంగా చూశాడు. రాయి కరుగుతోంది!

“చేతిలోని కత్తి విరిగిపోయి, డాలు ముక్కలు ముక్కలై పోయినప్పుడు తన ఆటకి తెరపడిందని మనిషి తెలుసుకోవాలి! కొద్దిగా ఆలస్యం అయినా, నువ్వు తెలుసుకున్నావ్! మెచ్చుకుంటున్నా........” శివరాం నవ్వుతూ అన్నాడు.

రాజవర్మ మాట్లాడలేదు. బరువుగా నిట్టూర్చి తన కుర్చీవైపు అడుగువేశాడు. కూచోబోతూ ఇంకా నిలబడే వున్న శివరాంని చూసి, ఆగాడు. నవ్వుతూ శివరాం కుర్చీలో కూచుని సిగరెట్ వెలిగించాడు.

“నువ్వన్నట్టు శాంతిమయంగా మాట్లాడ్డానికి నాకేం అభ్యంతరంలేదు. అయితే, ‘తీరిగ్గా’ కూచోడానికి వీల్లేదు. ఆలస్యం అయితే అక్కడ ‘వాటికి’ రెక్కలు మొలుస్తాయి. అది నీకే ప్రమాదం!”

రాజవర్మ దవడలు కదిలాయి. “శివరాం, వ్యాపారంలో యెంతో అనుభవం సంపాయించాను. ఎదటి వ్యక్తి యెప్పుడు, ఎందుకు, ఎలా మాట్లాడుతాడో నేను చిటికెలో పసిగట్టగలను. డబ్బుకోసం నువ్వీ దుర్మార్గం చేస్తున్నావు! పాతికవేలిచ్చేస్తాను. నీ దగ్గరున్నదంతా ఇచ్చేయ్. నీకు తెలిసిందంతా మరిచిపో!”

శివరాం చిన్నగా నవ్వాడు. తటాలున నవ్వు ఆపి

తీక్షణంగా రాజవర్మను చూశాడు. "ప్రారంభంలో నేనువ్వు రెండు పొరపాటు స్టేట్ మెంట్స్ ఇచ్చావ్. డబ్బుకోసం నేను దుర్మార్గం చేస్తున్నానన్నావ్. నీలాంటి ఘరానావాళ్ళ దుర్మార్గాలకి నేను శిక్ష విధిస్తున్నాను. డబ్బుకోసం దుర్మార్గం చేయడంలేదు; నీ దుర్మార్గాన్ని డబ్బు చేసుకుంటున్నా. రెండోది వ్యాపారంలో యింతో అనుభవం సంపాయించానన్నావ్. తగినంతగా నీ అనుభవం ఎదగలేదని నువ్వు ఆఫర్ చేసిన మొత్తం మొత్తుకుంటోంది!"

రాజవర్మ కోపంతో ఉక్కిరిబిక్కిరవుతూ చూశాడు. "పాతిక పైన పైసా కూడా ఇవ్వను! ఎవడో అనామకుడికి నేను యెందుకియ్యాలి?"

"అనామకుణ్ణి కాను; నీకు అనుమతి ఇచ్చేవాణ్ణి! నీ భార్యని కిరాయి ఖూనీకోరు చేత చంపించడానికి నా పర్మిషన్ని నువ్వు కొనుగోలు చేస్తున్నావ్! కాబట్టి ఇస్తావ్!!'

రాజవర్మ మొహంమీద చెంబుడు కప్పునీళ్ళు చల్లినట్టైంది. గాలానికి తగులుకున్న చేపలా విలవిల్లాడుతూ చూశాడతను.

"ఆల్ రైట్ .... యాభై వేలిస్తాను ...."

"రాజవర్మా, మంగారాంగాడికి యెంతిస్తున్నావ్?"

శివరాం అడ్డొస్తూ అడిగాడు.

"రెండు లక్షలు! నీక్కూడా ఇస్తాను; వాడు చేసే పని నువ్వే చేయి!" రాజవర్మ ఉక్రోషంతో అరిచాడు.

శివరాం పకపక నవ్వాడు. "అమాయకుల్ని, బలహీనుల్ని ఈ చేతులు చంపవు. డబ్బుతో ఈ లోకంలో ఏ పనైనా చేయొచ్చన్న ధీమాతో దుర్మార్గంగా ప్రవర్తించే

నీలాంటి వాళ్ళని నా పద్ధతిలో చిత్రవధ చేసి, అనుక్షణం చచ్చేలా చంపుతాను!”

రాజవర్మ పెదవులు గడగడ వణికాయి. ఏదో అనబోయి తమాయించుకుని, టేబుల్ మీదున్న తన చేతుల్ని అర్థంకానట్టు చూసుకున్నాడు. చిత్రవధ కాదు; ఇది విచిత్రమైన వధ: విచిత్రవధ! కసిగా అనుకున్నాడతను.

“సో, మంగారాంకి నువ్వు రెండు లక్షలిస్తున్నావ్. గొంతులుకోసే వాడికి ఇస్తున్న మొత్తాన్ని రెట్టింపు చేసి సభ్యమానవుడైన నాకు నువ్వు సమర్పిస్తావ్!” శివరాం గంభీరంగా అన్నాడు.

రాజవర్మ ఉలిక్కిపడ్డాడు. తన చెవుల్ని నమ్మలేనట్టు, అయోమయంగా శివరాంని చూశాడు. మొహం మీంచీ చెమట అతని మెడకిందికి కాలువగా సాగుతోంది. శివరాం మౌనంగా మరో సిగరెట్ వెలిగించాడు.

“ఈ సిగరెట్‌ని నేను ముగించేలోగా నైవేద్యం పెట్టాలి. సిగరెట్‌ని సగం మాత్రమే కాల్చిపారేస్తానని నువ్వు ఇందాకట్నుంచీ గమనించే వుంటావ్!” నవ్వుతూ అన్నాడతను.

రాజవర్మ మొహంమీద ముడతలు ప్రత్యక్షమయ్యాయి స్ట్రోక్ వచ్చి అతను కూలిపోతాడేమో అనిపించింది శివరాంకి. రాజవర్మ వణుకుతూ కుర్చీలోంచీ లేచాడు. ప్రాధేయపూర్వకంగా చూశాడు.

“శి....వ....రాం....లక్ష....లక్ష ఇచ్చేస్తాను.... నన్ను....వదిలేయ్....” రాజవర్మ కంఠం వణికింది.

శివరాం అర్థంకానట్టు చూశాడు. “ఎవరేనా నచ్చని విషయం చెప్తే, నా రెండు చెవులకీ బ్రహ్మచెవుడు వచ్చే

ఉంది. ఇప్పుడు చెవుడొచ్చినట్టే వుంది!" అన్నాడు నవ్వుతూ.

"రెం....డు...."

శివరాం తటాలున లేచాడు. రాజవర్మ కళ్ళల్లోకి తీక్షణంగా చూశాడు. "ఓకే. వెళ్తాను. ఒక్కో పత్రిక నుండీ రెండేసి లక్షలు తీసుకొని, డజను పత్రికలకి అన్ని హక్కుల్నీ అమ్మేస్తాను. దేశమంతా గుప్పుమంటుంది. పోలీసువాళ్ళు నీ కోటలోకి రాకపోవచ్చు. మంగారాం గాణ్ని గానుగా డేస్తాను. జరిగిందాన్ని కల్తీలేని నూనెలా వాడు కక్కేస్తాడు!"

"శివరాం...."

"వెళ్ళేముందు, ఈ కథంతా నిన్ను దేవుడిలా ఆరాధిస్తున్న నీ భార్యకి చెప్తాను. నువ్వు సలహా యిచ్చిన విధంగా పుట్టింటికి వెళ్ళొద్దని ఆమెకి చెప్తాను. ఆమె నుండీ పైసా తీసుకోను! గుడ్ బై!" శివరాం నిర్లక్ష్యంగా గుమ్మంవైపు తిరిగాడు.

"ఆగు. పారేస్తాను. బాస్టర్డ్!" రాజవర్మ అరిచాడు.

శివరాం వెనుదిరిగి నవ్వుతూ చూశాడు. "ఇంత సేపటికి నాకు నచ్చిన మాట అన్నావ్!"

"షటప్!" రాజవర్మ హుంకరించాడు. కుడివేపున, కర్టెన్ వెనుకనున్న గుమ్మంవేపు కదిలాడు.

"ఒక్క క్షణం...." శివరాం మెల్లిగా అన్నాడు.

రాజవర్మ విసురుగా తిరిగి, విసుగ్గా చూశాడు.

"సక్రమంగా ఎంచి, చక్కగా సూట్ కేసులో సర్ది నీట్ గా పట్టుకురా. అన్నట్టు తిక్క ఆలోచనలు చెయ్యొద్దు. ఈ సమయంలో నేను నీకు కవచం. నేను క్షేమంగా వుంటే నువ్వు క్షేమంగా వుంటావ్?"

"నీ బోడిసలహా అనవసరం! నేను ఏం చేయాలో, ఏం చేయగలనో నాకు తెలుసు!" రాజవర్మ హుంకరించాడు.

"గుడ్! డలున్నవాడు ముఖ్యమైన సందర్భాల్లో వెర్రి మొర్రి ఆలోచనలు చేస్తూవుంటాడు! అందుకని గుర్తు చేశాను" శివరామ్ నవ్వుతూ అన్నాడు.

రాజవర్మ పళ్ళు కొరుక్కుంటూ విసురుగా అటు తిరిగాడు. మళ్ళీ మెల్లిగా ఇటుతిరిగి శివరామ్‌ని సాలోచనగా చూశాడు.

"వాట్ కెన్ ఐ డూ ఫర్ యూ?" శివరామ్ నవ్వుతూ అన్నాడు.

"నువ్వడిగింది నీ దోసిట్లో పోశాక, నా కివ్వాల్సింది - అంతా - నాకు ఇస్తావన్న గ్యారంటీ యేమిటి?" రాజవర్మ శివరామ్ యెగతాళిని పట్టించుకోకుండా అడిగాడు....

"బెల్లం చేతికి వచ్చాక, అల్లంతో నాకు పని వుండదు!" శివరామ్ నవ్వుతూ అన్నాడు.

"ఏమిటి గ్యారంటీ?" రాజవర్మ రెట్టించాడు. "ఆ అల్లం అలాగే వుంచుకుని, అనుకున్నప్పుడంతా బెల్లం సంపాయించి మురబ్బా చేసుకు తింటూ వుండిపోవచ్చుగా?"

శివరామ్ పకపకా నవ్వాడు. "గుడ్ డైలాగ్! అయితే, నాకు మురబ్బా అంటే అంత ఇష్టంలేదు. అప్పుడప్పుడూ తియ్యగా, అప్పుడప్పుడూ కారంగా వుంటుంది. నాకు యెప్పుడూ తియ్యగానే వుండాలి!"

"ఏమిటి గ్యారంటీ?...." రాజవర్మ హుంకరించాడు.

"అప్పిచ్చే వ్యక్తి గ్యారెంటీ అడుగుతాడు. తీసుకునే వాడు అడగలేడు! నువ్వు కూడా అంతే. పంట కోసుకున్నాక, కొడవలిని పారేసే వ్యక్తిని నేను! ఇవాళ రాత్రి నీ కోకిల గూటికి వెళ్ళు. సరిగ్గా పన్నెండుగంటలా పన్నెండు నిమషాలకి వొంటరిగా ఆ ఇంటి పెరటి తలుపు తెరు. ఒక పార్సెల్ తలుపుకి సెలోటేప్ తో అతికించబడి వుంటుంది. రేపు ఫ్లయిట్ లో నేను న్యూయార్క్ వెళ్ళిపోతున్నా. తరువాత నా బెడద నీకు వుండదు!"

"నమ్మమంటావా....?" రాజవర్మ అడ్డొస్తూ అడిగాడు.

"నీ ఇష్టం! అనదర్ అడ్వైస్: నీ వరాహాన్నో, కూర్మాన్నో నన్ను వెంటాడి, వేటాడే పిచ్చిపనిలో నియమించవద్దు. పగ తీర్చుకోడానికి నువ్వు యే విధంగా ప్రయత్నించినా, ప్రయత్నిస్తున్నట్టు నాకు అనుమానం కలిగినా, నువ్విచ్చే 'బెల్లం'తో, నా దగ్గరున్న అల్లంతో మాయమైపోతాను. అల్లం కొద్ది కొద్దిగా మార్కెట్లో అమ్ముడయిపోతుంది!" శివరామ్ నవ్వుతూ అన్నాడు.

రాజవర్మ క్షణంలో ఏడ్చేసేవాడిలా చూశాడు. అతని పెదవులూ, దవడలూ అదిరాయి. అతను బరువుగా నిట్టూర్చాడు.

"రాత్రి పన్నెండింటికి ఆ పెరటితలుపు తెరుస్తాను.... శివరామ్, మాట తప్పకు!" రాజవర్మ వణికే కంఠంతో అన్నాడు.

శివరామ్ యేదో చెప్పబోయాడు. రాజవర్మ అతనికి అడ్డు తగిలాడు.

"రేపట్నుంచీ.... నువ్వు అంతా మరచిపోవాలి. నాకు

సంబంధించినంతవరకూ ఈ లోకంలో యేం జరిగినా పట్టించుకోకూడదు. నీ మౌనాన్ని యెంతో ఖరీదు పెట్టి నేను కొంటున్నా; పర్మనెంట్ గా!"

శివరామ్ రెప్పలు పైకెత్తి రాజవర్మని చూశాడు. మెల్లిగా చిరునవ్వు నవ్వాడు. "ఎవడో ఎవడికో ఎంతో యిచ్చి, తన పెళ్ళాన్ని చంపించుకుంటే నా కేమిటి సంబంధం?"

"హుఁ....సంబంధం లేకే నాలుగు లక్షలు మూసి వాళ్ళో పోసుకుంటున్నావ్! ఇంటలిజెంట్ బాస్టర్డ్!" రాజవర్మ కసిగా అన్నాడు.

"బాస్టర్డ్. రాస్కెల్. స్కౌండ్రల్. నాలుగు లక్షలు బహూకరిస్తున్నావ్. ఇంకా నాలుగు తిట్లు తిట్టడానికి నీకు అవకాశం వుంది. ఎంజాయ్!" శివరామ్ పకపక నవ్వుతూ వుండిపోయాడు....

## 4

తలుపు తెరిచిన లత అతన్ని చూసి ఉషారుగా ఆరిచింది. శివరామ్ లోపలికి దూరి, తలుపు మూసి తాళం వేశాడు.

"డార్లింగ్ ...."

"ఉష్! అలసిపోయాను. బుర్రకీ, నోటికీ, వొంటికీ రెప్పపాటు కాలం విశ్రాంతి కావాలి!" శివరామ్ నవ్వుతూ అన్నాడు. బుంగమూతి పెట్టి పక్కనే నడుస్తూన్న లత నెత్తిమీద సూట్ కేస్ పెట్టి హాండిల్ ని పట్టుకుని అడుగులు వేశాడు.

మంచం దగ్గరగా వచ్చేసరికి సూట్ కేస్ ని విసురుగా లాక్కుని, లత మంచంమీద పడేసింది. శివరామ్ అలసటగా మంచంమీద కూలబడి, రెండు చేతుల్నీ వెనక

అన్నాడని. ఏటవాలుగా వెనక్కి వాలాడు. కాళ్ళని పొడుగ్గా ముందుకి చాపాడు. అతని కాళ్ళ మధ్య నిలబడ్డ లత ఆతన్ని ఆక్షేపణగా చూసింది.

"సూట్ కేసు బరువుగా వుంది .... అందులో యేముంది?"

" 'ఏముంది' కాదు; 'ఎంతుంది?' అని అడుగు!" శివరామ్ నవ్వుతూ అన్నాడు.

లత విశాల నేత్రాలు ఇంకా విశాలంగా అయ్యాయి. ఎర్రటి పెదాల మధ్య పళ్ళు తళుక్కుమన్నాయి. "ఓహ్! ఎంతుంది?"

శివరామ్ మాట్లాడకుండా నిటారుగా కూచున్నాడు. కోటుని తీసి, మంచంమీద పడేశాడు. సిగరెట్ వెలిగించి పొగ ఊదుతూ రెప్ప వేయకుండా తననే చూస్తూన్న లతని రెప్ప వేయకుండా చూస్తూ వుండిపోయాడు. లేత గులాబిరంగు గార్డెన్ సిల్కు చీర. అదేరంగు జాకెట్. ఆమెని అలాగే కాసేపు చూస్తే కళ్ళు బైర్లు కమ్ముతాయనిపించింది శివరామ్‌కి. ఆ దుకూలంలోనే ఆమె చాలా సేపట్నుంచీ మంచం మీద దొర్లినట్టుంది....

"తీరిందా?" లత అసహనంగా ప్రశ్నించింది.

"ఏమిటి....? ఆశా?...." శివరామ్ నవ్వుతూ అన్నాడు.

"అలసట."

శివరామ్ టైని ఊడదీసి పక్కనే పడేశాడు ఆమె వైపు చిరునవ్వుతో చూశాడు. "అయిదు నిమిషాల పాటు నిన్ను చూస్తే అలసట ఆవిరై, అంతర్ధానమై పోతుంది!"

"అయితే యెంత?" లత ప్రశ్నించింది.

"ఏమిటిది?"

"అబ్బబ్బ...సూట్ కేస్ బరువు!" లత చిరాకు నటిస్తూ అంది.

శివరామ్ తన పక్కనే మంచంమీద చేత్తో కొట్టాడు. "ఇలా నా దగ్గరగా కూచో. చెవిలో చెప్తాను!"

లత అతని కాలిని దాటి, మంచంమీద చతికిలబడింది. తల తిప్పి అతన్ని అదోలా చూసింది.

"నాలుగు లక్షలు. రాత్రి తలగడకింద పడేసింది కలి పితే ఐదు!" శివరామ్ నవ్వుతూ అన్నాడు.

లత మొహం దివిటీలా వెలిగింది. "గుడ్ గాడ్! యెక్కడ దొంగిలించావ్?"

"దొంగిలించలేదు. దొరతనంగా దొరకపుచ్చు కున్నాను!"

"ఉపోద్ఘాతం, ఉపసంహారం లేకుండా కథ మాత్రం చెప్పెయ్!" లత ఉల్లాసంగా అంది.

"ఊహించు!"

ఉంగమూతి పెట్టబోయి లత సర్దుకుంది. "సింహం అన్నావు. గుంటనక్క అన్నావు. ఎద్దు బలైపోతుం దన్నావు. అంబాసిడర్ హోటల్నుంచీ ప్రెసిడెంట్ హోటల్ కి లాక్కొచ్చావు. ఇంతే నాకు తెలుసు!"

"సింహం నక్కతో బేరం చేసింది. గంగిగోవులాంటి తన భార్యను గొంతు కోసి చంపడానికి రెండు లక్షలకి కాంట్రాక్టు ఇచ్చి, లక్ష అడ్వాన్సు చెల్లించింది. అడ్వాన్సు చెల్లించే క్షణాల్లో ఇద్దర్నీ ఫోటోలు తీశాను. వాళ్ళ కాంట్రాక్టు సంప్రదింపుల్ని తెలివిగా రికార్డు చేశాను...." శివరామ్ ప్రారంభించాడు.

"సింహమూ, నక్కా — ఈ జంతువుల్ని మరిచిపోయి,

మనుషుల కథ చెప్పు!" లత చిరాగ్గా అంది.

"ఆ జంతువుల్ని మనుషులుగా మారిస్తే, సింహం రాజవర్మ అయ్యింది. నక్క మంగారాం అయ్యింది. రాజవర్మని మొదట నీడలా వెంటాడాను. వర్మా అండ్ కంపెనీ అనబడే పెద్ద వ్యాపారసంస్థకి అతను ప్రొప్రయిటర్. కోటలాంటి అతని బంగళాలో ధనలక్ష్మి అపఖండా సంగీత కచ్చేరీ చేస్తోంది. అతనికి భార్య వుంది. పిల్లలేరు.

"ఆ రోజు రాత్రి అతను, ఆలస్యంగా ఇంట్లోంచి బయలుదేరాడు. నాలుగు కార్లున్నా కూడా టాక్సీ యెక్కాడు. టూటౌన్‌లో వున్న ఒక చిన్న బంగళాకి వెళ్ళాడు. చుట్టూ తోట. మధ్యలో ఆకుల మధ్య బాగా మగ్గిన టొమోటాలా వున్న చక్కటి ఇల్లు. సినిమా డ్రీమ్ సీక్వెన్స్ సెట్టింగ్‌లా వుంది. ఆ సెట్టింగ్‌లో కోకిలాదేవి అనే కోమలి వుంది. చక్కని చుక్క. ఆమెతో రాజవర్మకి అక్రమసంబంధం వుంది...."

"నీ కెట్లా తెలుసు?" లత అడ్డు తగిలింది.

"కిటికీగుండా చూశాను; ఐమీన్ విన్నాను!" శివరామ్ నవ్వుతూ అన్నాడు. రాజవర్మ పట్టపురాణి కావాలన్న కోరిక కోకిలను కొంపలా పట్టుకుంది. పైగా ఆమెకి నెల తప్పింది. నెల తిరిగేలోగా భార్య పీడ విరగడ చేసేసుకుని,ఆమె స్థానంలో తనని భద్రంగా చట్టబద్ధంగా కూచోబెట్టమని కోకిల అతని చెవిలో కాకిగోల చేసింది. ఒకరి కుర్చీలో నువ్వు కూర్చోవాలంటే, కుర్చీని ఖాళీ చేయించాలి; పర్మనెంటుగా. ఈ ఐడియాని రాజవర్మ బుర్రలోకి తన వయ్యారంతో రంగరించి, వలపుతో సరఫరా చేసింది!"

"మైగాడ్! అన్యాయం!" లత అడ్డు తగిలింది.

శివరామ్ చిన్నగా నవ్వాడు. "ఆ 'అన్యాయం' లేక పోతే ఈ క్షణంలో నీ మంచంమీద అయిదు లక్షలు వుండేవికావు! నో కోకిల గానంతో పూర్తిగా మతిపోయిన రాజవర్మ తన భార్యను పైకి పార్సిల్ చేయడానికి నిశ్చయించుకున్నాడు. అందుకోసం అతను చాకచక్యంగా అద్దె హంతకుడు మంగారాంని పట్టాడు...." శివరామ్ ఆగి సిగరెట్ వెలిగించాడు.

"తరవాత?" లత హెచ్చరించింది.

"తరువాత, అతన్ని పరీక్షించినట్టే మంగారాంని పరీక్షించాను. అతని జాతకం అంతా కనిపెట్టాను. రెండు లక్షల కోసం నిండు ప్రాణాన్ని తీయడానికి ప్రస్తుతం తయారుగా వున్న కథానాయకుడికి యెంతో కొంత గతం వుండివుండాలి, ఇవాళ ఫ్రీగా తిరుగుతూ యెవర్నో చంపడానికి వాడు రెడీగా వున్నాడంటే, నిన్నటి నేరాల నుంచి తప్పించుకుని వుండాలి!

"అంచేత మంగారాంని తెలివిగా జాగ్రత్తగా హేండిల్ చేయాలి; చేశాను. వాడు రాజవర్మ నుండీ వసూలు చేసిన అడ్వాన్సు పైకం గుంజుకున్నాను. బదులుగా మూడు క్యాసెట్లూ రెండు ఫోటోలూ, ఒక నెగటివ్ వాడికి పారేశాను. వాటితోపాటే పుట్టిన మరికొన్ని క్యాసెట్లూ, ఫోటోలూ, నెగటివ్ లూ రాజవర్మకి అందించే షరతుమీద నాలుగు లక్షలు పుచ్చుకున్నాను!" శివరామ్ ముగించాడు.

"తరువాత?"

"ఏమీ లేదు."

"డార్లింగ్, కమాన్: చెప్పు! ఇప్పుడు వాళ్ళిద్దరూ

యేం చేస్తారు?"

"ఏం చేస్తారు?"

"వాళ్ళ పాపిష్టి ప్లాన్‌ని కనిపెట్టిన నిన్ను కాల్చేశారు; అయిదులక్షలు దక్కి నీ నోరు కట్టేశారు. ఇప్పుడు సింహం నక్కకి తతిమ్మా పైకం పడేస్తుంది. నక్క గంగి గోవు పీక కోరికేస్తుంది! అంతేగా?"

"అంతే కావచ్చుగా....?" శివరామ్ కులాసాగా నవ్వుతూ అన్నాడు.

"డార్లింగ్....ఐ డోంట్ లవ్ ది ఐడియా...." లత కంఠంలో విచారం ధ్వనించింది.

"డోంట్ లవ్ ది ఐడియా. లవ్ మీ హనీ!" శివరామ్ నవ్వుతూ అన్నాడు. లత నవ్వలేదు. తటాలున శివరామ్ చేతిని పట్టుకుంది.

"డార్లింగ్, ఐదులక్షల కోసం ఆ అమాయకురాల్ని బలి చేస్తావా?"

శివరామ్ తటాలున లేచి నించున్నాడు. లతవైపు చిరునవ్వుతో చూశాడు.

"శివరామ్ అమాయకుల్ని బలిచేయడు!" అన్నాడతను గంభీరంగా.

లత అర్థం కానట్టు చూసింది. "మరి రాజవర్మకీ, ఆ గూండాకీ పర్మిషన్ యిచ్చావుగా? ఒరిజినల్ ప్లాన్ ప్రకారం వాళ్ళిద్దరూ ఆమెని చంపుకోవచ్చుగా?"

శివరామ్ కళ్ళు లతని మెప్పుగా చూశాయి. "హనీ, ఇదే ప్రశ్నని వాళ్ళిద్దరూ అడిగారు. ఇద్దరికీ అందకుండా, పొందకుండా సమాధానం చెప్పాను. ఇప్పుడూ నువ్వూ అదే ప్రశ్నని అడుగుతున్నావ్. నీ ప్రశ్నకి సమాధానం 'అతనికి' చెప్తాను...."

శివరామ్ సిగరెట్ ముట్టించి సోఫామీద విశ్రాంతిగా కూచున్నాడు. టీపాయ్‌మీదున్న టెలిఫోన్ రిసీవర్ని అందుకుని తలకీ, భుజానికీ మధ్య ఇరికించాడు. కొద్దిగా వాలిన అతని తల రిసీవర్ని కదలకుండా పట్టుకుంది.

కాసేపట్లో హోటల్ ఆపరేటర్ కంఠం మర్యాదగు మామ్మలా పలికింది. ఒక నెంబర్ చెప్పి కనెక్టు చేయమన్నాడు శివరామ్. రిసీవర్‌ని అలాగే వుంచుకుని, ఎడమ చేతి చూపుడువేలితో హుక్‌మీది బటన్ని నొక్కి వుంచాడు. టెలిఫోన్ మోగింది.

"డబుల్ త్రీ డబుల్ ఫోర్ డబుల్ ఫైవ్!" అటు వైపు కంఠం నిర్లక్ష్యంగా అంది.

"రాజవర్మ కావాలి...." శివరామ్ కేర్లెస్‌గా అన్నాడు.

"ఆయన కాన్ఫరెన్స్‌లో వున్నారు. సాయంత్రం ఆపు తరవాత...."

"కాన్ఫరెన్స్ కట్టిపెట్టి రమ్మను!"

"వాటీస్ దిస్? హూ ఆర్ యూ? దట్?" అవతలి కంఠం ఆగ్రహంతో అరిచింది.

"అతని 'శేని కూతురుకి' 'కాని మొగుణ్ని' అని చెప్పు. నా పేరులో శివుడూ, రాముడూ విభేదాలు మరిచిపోయి వియ్యంకుల్లా కలిసివున్నారని చెప్పు!" శివరామ్ గంభీరంగా అన్నాడు.

"ప్రాక్టికల్ జోకర్స్ అంటే...." అవతలి కంఠం బొబ్బలెట్టసాగింది.

"నా దగ్గరున్న ఆల్లానికి సరికొత్త ఆఫర్ వచ్చిందని అతనికి చెప్పు. ఈసారి నాకు నీ కంఠం వినిపిస్తే, స్వయంగా అక్కడికొస్తాను, సంగతి తెలియగానే రాజ

వర్మ చేసే మొట్టమొదటిపని నిన్ను డిస్‌మిస్ చేయడమే! అర్థమయిందా?" శివరామ్ హుంకరించాడు. అతని ప్రశ్నకి సమాధానం లేదు....

"రాజవర్మ హియర్....!" రెండు నిమిషాల తర్వాత రాజవర్మ కంఠం శివరామ్ చెవిలో ప్రతిధ్వనించింది.

"రాజవర్మా, నేను: అల్లం మర్చెంట్ శివరామ్!...."

రాజవర్మ గబుక్కున ఊపిరి బిగబట్టడం శివరామ్‌కి స్పష్టంగా వినిపించింది. "ఏ....ఏమిటి?"

"అర్ధరాత్రిపూట, అర్ధాంగిని వదిలేసి ప్రియురాలి ఇంటికెళ్ళి పెరటితలుపు తీసే కష్టం నీకు లేకుండా చేశాను...." శివరామ్ ఆగి, తననే ప్రశ్నార్థకంగా చూస్తోన్న లతని చిరునవ్వుతో చూస్తూ కన్ను గీటాడు.

"ఏమిటి? అర్థమయ్యేలా చెప్పు!" రాజవర్మ కంఠం ఆత్రుతగా మారి, ధ్వనించింది.

"పొద్దుట నిన్ను కలుస్తున్నప్పుడే 'అల్లం' నా కోటు జేబులోనే వుంది. దాన్ని నీ గదిలోనే పెట్టేసి తిరిగొచ్చాను...."

"నిజంగా....? యెక్కడ....?" రాజవర్మ అరిచాడు.

"నీ సింహాసనం వెనక, గోడకి నువ్వూ నీ భార్యా పెళ్ళయినప్పుడు — అనుకుంటాను — తీయించుకున్న ఫోటో యేటవాలుగా వేళ్ళాడుతోంది. దాని వెనుక చూడు!"

"బుల్‌షిట్! నేను నమ్మను! గదిలో నువ్వున్నంతసేపూ నేను నీతోనే వున్నాను. డోంట్ ట్రై టూ ఫూల్ మీ!"

రాజవర్మ అరిచాడు.

"నువ్వు ఫూల్‌వే అని నీ మాటే చెప్తోంది. అల్లం కాంటానికి చెల్లించే బెల్లం కోసం నువ్వు నీ బొక్కాసంలోకి వెళ్ళావు. అప్పుడు నాతోపాటు గదిలో నీ 'రెండో రూపం' లేదు!...." శివరామ్ నవ్వుతూ అన్నాడు.

"గాడ్....యస్....అయితే...." రాజవర్మ నత్తి నత్తిగా ప్రారంభించాడు.

"రిసీవర్ని టేబుల్ మీద పెట్టు. వెళ్ళి చూసిరా! నీతో ముఖ్య విషయం చెప్పాలి...." శివరామ్ ఆజ్ఞాపిస్తున్నట్టు అన్నాడు. అతని చెవిలో ఫోన్ చిన్నగా చప్పుడు చేసింది. లత వైపు చూస్తూ శివరామ్ దమ్ము లాగాడు. లత ఉక్కిరిబిక్కిరవుతూ చూస్తూ యేదో అడగడానికి నోరు తెరిచింది.

"ఉందా?" శివరామ్ ఫోన్‌లోకి అరిచాడు.

"....యస్....నాలుగు క్యాసెట్లూ, నాలుగు...." ఉద్రేకంతో, ఉత్సాహంతో రాజవర్మ కంఠం వణకసాగింది.

"లెక్కలు అనవసరం....! సో, నీ వస్తువు నీకు చేరింది!...."

"య్యస్! థాంక్యూ....రేపు న్యూయార్క్ వెళ్ళిపోతున్నాననుకుంటాను....?" రాజవర్మ ఉషారుగా అన్నాడు.

"ఆఫ్‌కోర్స్; రేపు కాదు: ఇవాళే! అండ్ డోంట్ థాంక్ మీ, రాజవర్మా. ఎందుకంటే యింకో క్షణంలో ఆ ధన్యవాదాల్ని నువ్వు వాపసు తీసుకుంటావ్!"

"ఏమిటి? ఎందుకు....?" రాజవర్మ కంఠంలో ఆశ్చర్యం.

"అయిదు లక్షలు పారేసి, ఆడదాన్ని అంతం చేయడానికి అనుమతి సంపాయించానని నువ్వు అనుకోడం నాకు నచ్చదు...."

"అయిదు లక్షలా...." రాజవర్మ అడ్డొస్తూ అరిచాడు.

"యస్. అక్షరాలా అయిదు లక్షలు. నువ్వు మంగారాంకి అడ్వాన్సుగా ఇచ్చిన లక్షని అడ్వాన్సుగా నేను వసూలు చేసుకున్నాను...." శివరాం తాపీగా అన్నాడు.

"వాట్!?"

"అసలు విషయం విను: మీ ఇద్దరికీ ఇచ్చినవేకాకుండా మరో రెండు సెట్లు ఎవిడెన్స్ నా దగ్గర అట్టిపెట్టుకున్నాను. ఇందాకే నా ప్రాణమిత్రుడైన ఒక అడ్వొకేట్ని కలుసుకున్నాను. భద్రంగా సీల్ చేసిన కవర్లలో ఆ ఎవిడెన్స్ని అతని స్వాధీనం చేశాను. అతనికో డ్యూటీ అప్పగించాను. నీ పైకంలోంచే అతనికి ఫీజు చెల్లించాను. అతనికి నేను తగిలించిన డ్యూటీ యేమిటో తెలుసా?" శివరాం సీరియస్గా ప్రశ్నించాడు.

"....ఏ....మి....టి....?" రాజవర్మ కంఠంలో ఏదో బోదురుకప్ప అరిచింది.

"ఈ రోజునుంచీ, యే క్షణంలో అయినా, యే కారణంచేత అయినా నీ భార్య మరణిస్తే అతను పోలీసు ఆఫీసర్లని కలుసుకుంటాడు. నేనిచ్చిన సీల్డు కవర్లని వాళ్ళకి అప్పగిస్తాడు...."

"నో!" రాజవర్మ ఏడుస్తున్నట్టు అరిచాడు.

"యూ నో రాజవర్మా, ఈ క్షణంనుంచీ నువ్వు నీ

భార్యకు సెక్యూరిటీ గార్డుగా మారాలి! అనుక్షణం ఆమెని కంటికి రెప్పలా కాపాడాలి! నీకు దేముడిమీద నమ్మకం వుంటే, నీ భార్యను కలకాలం క్షేమంగా వుంచాలని రోజుకి ఇరవై నాలుగ్గంటలూ ప్రార్థిస్తూ వుండాలి! అర్థమైందా?" శివరాం గంభీరంగా అడిగాడు.

"నో! ఇది....ఇది....అన్యాయం! అక్రమం! నువ్వు... యూ బాస్టర్డు! స్కాండ్రల్! ట్రెయిటర్! యూ.... యూ ...యూ...." రాజశర్మ వెర్రివాడిలా బొబ్బలెడుతున్నాడు.

శివరాం తృప్తికరంగా నవ్వుకుంటూ రిసీవర్ని పెట్టేశాడు.

లత మంచంమీంచి లేడిలా గెంతేసింది. తనవైపు సుడిగాలిలా దూసుకొస్తున్న అతని చూస్తూ శివరాం సగం కాలిన సిగరెట్‌ని యాష్‌ట్రేలో కుక్కాడు. లత అతని పక్కనే సోఫామీద వాలింది. ఆమె చేతులు లతల్లా శివరాం మెడని చుట్టేశాయి.

"డార్లింగ్! డార్లింగ్! డార్లింగ్!" లత ఆనందంతో ఉద్రేకంతో మత్తుగా అంది. 'మత్తుపాట' పాడుతోన్న ఆశాభోస్లే కంఠంలా ధ్వనించిందామె కంఠం. పలవరిస్తున్న ఆమె పెదాల్ని తన చెంపతో అదిమి, నాగకన్యలాగా తనని పెనవేసుకుపోతున్న ఆమె శరీరాన్ని కొంచెం దూరంగా జరిపాడు శివరాం.

"ఓహ్! డార్లింగ్, యూ ఆర్ వండర్‌ఫుల్! అడ్వొకేట్ గురించి నాకు ముందే చెప్పలేదేం?" తేరుకున్న లత ప్రశ్నించింది.

శివరాం అర్థంకానట్టు చూశాడు. "ఏ అడ్వొకేట్?"

లత కనురెప్పలు తుమ్మెద రెక్కల్లా వేగంగా కది

లాయి. "రాజవర్మ ప్లాను ఎవిడెన్స్‌కి నువ్వు కస్టోడియన్‌గా నియమించిన అడ్వొకేట్!" కోపం నటిస్తూ అంది లత.

"ఎవరో నాకు తెలీదు!" శివరాం నవ్వుతూ అన్నాడు.

"డార్లింగ్ ...." విసుగ్గా ఏదో అనబోయిన లత అతన్ని కొత్త ఆశ్చర్యంతో చూసింది. అందంగా వున్న ఆమె కనుబొమలు కదిలి, కలిసి విల్లు ఆకారం ధరించాయి.

"అయితే .... ఇంక అడ్వొకేట్‌ని వెతికి ఆ ఎవిడెన్స్‌ని అప్పగిస్తావా?" లత సాలోచనగా ప్రశ్నించింది.

"అమ్మాయి వుండేగా, అప్పగింతలు చేయడానికి!" శివరాం నవ్వుతూ అన్నాడు.

లత నోరు ఆశ్చర్యంతో తెరుచుకుంది. ఆమె రెప్పలు టపటప కొట్టుకున్నాయి.

"డార్లింగ్ ...."

సిగరెట్ వెలిగించి శివరాం పకపకానవ్వాడు. నవ్వుతూ లతని తదేకంగా చూశాడు. "హనీ, ఊరికే బుర్ర పాడు చేసుకుంటున్నావ్! ఎవిడెన్సూ లేదు; కస్టోడియన్ అడ్వొకేటూ లేడు! రాజవర్మతో అలా బుకాయించాను. ఆ గొలుసుతో పటిష్టంగా బంధించకపోతే సింహం మళ్ళీ విజృంభిస్తుంది. గంగిగోవు బలిపశువై పోతుంది! ఈ క్షణం నుంచీ, రాజవర్మ తన భార్య క్షేమంకోసం తపస్సు ప్రారంభిస్తాడు. ఇంటిలోని హంతకుణ్ని కట్టేయడానికి యింతకన్నా మార్గం లేదు! ఇప్పుడప్పుడే తన భార్య కోసం రాజవర్మ చేస్తున్న దైవ ప్రార్థన నాకు వినిపిస్తోంది!"

"మైగాడ్!" లత ఆశ్చర్యంతో అరిచింది. మళ్ళీ కను

బొమలు ముడేస్తూ శివరామ్‌ని చూసింది. "డార్లింగ్ .... కోకిల యేమవుతుంది....? పాపం ఆమెకి నెల తప్పిం దిగా?!"

'అడ్డప్రశ్న' చేసిన లతని శివరామ్ చిరునవ్వుతో చూశాడు.

"కోకిల పెట్టే గుడ్డు కాకిగూడులో పిల్లగా మారి పెరిగి, ఎదిగి కూయడం ప్రారంభిస్తుంది! ఆల్ రైట్! త్వరగా మూటాముల్లే సర్దేయ్, ఊరు మారుతున్నాం. ఈ ఊరి గాలీ, నీళ్ళూ నాకు సరిపడేలా లేవు!"

"డార్లింగ్ ....ఒక సందేహం...." లత మెల్లిగా అంది.

"వ్హాట్! నీ సందేహం తీర్చేసి, మరొకరికి చిన్న సందేశం అందించేసి బండెక్కాలి!" శివరామ్ నవ్వుతూ అన్నాడు.

"రాజవర్మ పోలీసుల్ని కల్పుకోడుగా? నీ మీద పగతో...."

"వాళ్ళే పోలీసులు నన్ను వెతికి పట్టుకుంటారు. కథం తనీ టీకా తాత్పర్యాల్తో అప్పజెప్తాను. అప్పుడు పోలీ సులు నన్నేం చేస్తారో తెలీదుగానీ, రాజవర్మ మురికి రాజమార్గాలంతా నిండి, గుప్పుమంటుంది. హోదా, పలుకుబడీ, సంఘంలో గౌరవం ఐశ్వర్యం వగైరాల్ని ఖరీదయిన సెంటులా తనకి పట్టించుకున్న రాజవర్మ తన అట్టడుగున వున్న మురికి పైకి రావడం సహించడు! అర్థ మైందా?" శివరామ్ వివరించాడు.

లత తేలిగ్గా నిట్టూర్చి, సోఫాలో వెనక్కి వాలింది. శివరామ్ సాలోచనగా సిగరెట్‌ని ఆర్పేసి టెలిఫోన్

రిసీవర్ అందుకుని, ఆపరేటర్‌తో తనకి కావాల్సిన నంబరు చెప్పాడు.

లత విసురుగా అతని వొళ్ళో పడింది. సోఫామీద వెల్లకిలా పడుకుంది. శివరామ్ నవ్వుతూ ఆమె మొహం లోకి చూశాడు. పైనున్న సూర్యుణ్ణి ఆశగా చూస్తున్న తామరపువ్వులా వుందామె మొహం. ఆమె నుదురు మీదున్న వెంట్రుకల్ని శివరామ్ ప్రేమగా సవరించాడు. టెలిఫోన్ మోగింది.

"మిస్టర్, టెంపో!...." శివరామ్ మెల్లిగా అన్నాడు.

లత ఉలిక్కిపడి, ఠిటాలున లేచి కూచుంది. నిశ్వాస పాటుతో శివరామ్ మొహంలోకి చూసింది. ప్రశ్నార్థకంగా మారిపోయిన ఆమె మొహంలోకి శివరామ్ కులాసాగా చిరునవ్వు నవ్వుతూ చూశాడు. లత కంగారుగా అతని చేతిని పట్టుకుంది.

"స్పీకింగ్!" డిటెక్టివ్ టెంపో కంఠం స్పష్టంగా అంది.

శివరామ్ కళ్ళు యెందుకో నవ్వుతున్నాయి. సిగరెట్‌ని పెదాలమధ్య ఇరికించి, అగ్గిపుల్ల గీచి వెలిగించాడు. పొగ ఊదుతూ క్షణకాలం మౌనంగా వుండిపోయాడు.

"ఎవరు?" టెంపో కంఠం విసుగ్గా అంది. అగ్గిపుల్ల గీచిన శబ్దం అతనికి వినిపించినట్టుంది.

"మిస్టర్ టెంపో....శివరామ్" శివరామ్ క్లుప్తంగా అన్నాడు.

"....శివరామ్...." టెంపో కంఠధ్వనిలోని భావం శివరామ్ పెదాలకి చిరునవ్వుని పులుముతోంది.

"మీరు తొందరపడి నన్ను పోలీసులకి పట్టిచ్చారు. పోలీసు హస్తాలూ, కోర్టు సాక్ష్యాలూ నన్ను అట్టేకాలం పట్టివుంచలేకపోయాయి, మిస్టర్ టెంపో. నా అయామ్ అన్ ది లూన్ డిటెక్టివ్ టెంపో!" శివరామ్ సగర్వంగా అన్నాడు.

"శివరామ్...."

"చెప్పకండి; వినండి: మీరు అతి తెలివితో నన్ను అఫెండ్ చేశారు. అతితెలివిని నేను సహించను! మానసికంగా మీరు నన్ను దెబ్బతీశారు. దెబ్బకు దెబ్బ— మానసికంగానే — తీస్తున్నాను. మిస్టర్ టెంపో! లోకంలో తప్పు చేసినా, చేయకపోయినా దొరికినవాడే దొంగ! దొరకనివాడు, దొంగ అయినా సరే, దొరే! అందుకే ఈసారి దొరికినా మీరు పట్టుకోలేని 'దొరతనం' చేశాను. దాన్ని మీలాంటి ఆశేశపరులు 'దొంగతనం' అంటారు!" శివరామ్ చిన్నగా నవ్వాడు. మళ్ళీ ప్రారంభించాడు:

"మిస్టర్ టెంపో, ఫేమస్ బిజినెస్ మాగ్నెట్ రాజవర్మకి టోపీ వేసి అయిదు లక్షలు సంపాయించాను...."

"శివరామ్ .."

"అయినా కూడా మీరు నన్ను పట్టుకోలేరు! ఎందుకంటే, మీరూ మీ పోలీసులూ ఒక నాజీ కాన్సెన్ట్రేషన్ క్యాంప్ తయారుచేసి అతన్ని కైమా చేసినా కూడా రాజవర్మ శివరామ్ గురించి చెప్పడు!" శివరామ్ టెంపోకి మాట్లాడే అవకాశం యివ్వకుండా అన్నాడు. అతని కంఠంలో గర్వం జేగంటలా ధ్వనించింది.

"నీకు తెలీదు...." టెంపో తాపీగా అన్నాడు.

"నాకు తెలుసు మిస్టర్ టెంపో! మీరు నా వైపు వేలెత్తి చూపలేరు. కన్నెత్తి చూడలేరు! ఇది పనికి మాలిన ప్రగల్భం కాదు. ఇది శివరామ్ సవాలు మిస్టర్ టెంపో" శివరామ్ సగర్వంగా అన్నాడు.

గుడ్లప్పగించి విడ్డూరంగా చూస్తోన్న లతని చిరునవ్వుతో చూశాడు. అతని చెవిలో డిటెక్టివ్ టెంపో కంఠం ప్రతిధ్వనించింది.

"గుడ్ బై మిస్టర్ టెంపో!" అంటూ శివరామ్ రిసీవర్ని పడేశాడు.

లోకంలోని ఆశ్చర్యాన్నంతా ఒకచోట రాశిపోస్తే తయారైన విగ్రహంలా తన పక్కనే కూచున్న లతని దగ్గరకి లాక్కున్నాడు.

"డార్లింగ్ అనవసరంగా డిటెక్టివ్ టెంపోని రెచ్చగొట్టావు.... రేపు...."

"రేపు మనం కొడైకెనాల్లో వుండాలి. గెటప్! డ్రెసప్! హోటల్ బిల్లుకూడా ఇందాకే చెల్లించేశాను!" శివరామ్ ఆమె అదుర్దాని పూర్తిగా నిర్లక్ష్యం చేస్తూ అన్నాడు.

లత అయిష్టంగానే లేచింది. తటపటాయిస్తూ అతన్ని చూసింది. "డార్లింగ్....డిటెక్టివ్ టెంపో...."

శివరామ్ చివాల్న సోఫాలోంచీ లేచాడు. తాపీగా సిగరెట్ వెలిగించాడు. లతవైపు తిరిగి తీక్షణంగా ఆమె కళ్ళల్లోకి చూశాడు. లత కళ్ళల్లోని కంగారు అతనికి నవ్వు తెప్పిస్తోంది.

## 50

"డిటెక్టివుల్నీ, పోలీసుల్నీ మరిచిపో. నన్ను మాత్రం ఎప్పుడూ గుర్తుంచుకో. నువ్వు ఆనందంగా వుంటావ్!" శివరామ్ సగర్వంగా అన్నాడు.

('శివరామ్ అడ్వెంచర్స్' సీరీస్‌లో

ఇది మొదటి నవల.)

# దేవుడే నా డిటెక్టివ్

## వసుంధర

ఆఫీసుకు రాగానే కళ్యాణరావును పలకరించాడు గణపతి—"నిన్న మా యింట్లో అంతా నీ కోసం ఎంతో సేపెదురు చూశాం—"

"అయాం సారీ—" అన్నాడు కళ్యాణరావు.

"వస్తానని చెప్పి రాలేదు. అంత ర్జెంటు పనేం వొచ్చింది?"

"నా ఆరోగ్యం ఉన్నపళంగా పాడయింది. ప్రాణం పోతుందేమో ననిపించేలాంటి పోట్లు. కడుపు పట్టుకుని చాలా సేపు గిలగిల లాడిపోయాను. డాక్టరు దగ్గరికి వెళ్ళే అవకాశం లేదు. ఎప్పుడో నిద్ర పట్టింది. నిద్రలోనే తగ్గిపోయాయా పోట్లు—" అన్నాడు కళ్యాణరావు.

"సరే-నీ సీట్లోకి వెళ్ళు. తర్వాత మాట్లాడుకుందాం" అన్నాడు గణపతి.

ఆ తర్వాత లంచవర్లో యిద్దరూ కలుసుకున్నారు. కాంటీన్లో కోడిపులా వార్డరిచ్చాడు కళ్యాణరావు.

"భోజనం లైటుగా చేయి. రాత్రికి మళ్ళీ కడుపులో పోట్లు రాగలవు—" అన్నాడు గణపతి.

"వయసులో వున్నవాళ్ళం. అనారోగ్యానికి భయ పడకూడదు. పోట్లు మళ్ళీ రానీ—అప్పుడు చూస్తాను—" అన్నాడు కళ్యాణరావు.

"వయసందరిచేతా ఒకేలా ప్రవర్తించనివ్వదు. ఉదాహరణకు వయసు నీచేత అబద్ధాలు చెప్పిస్తోంది. నేనలా చెప్పలేను—...."

"అంటే?" అన్నాడు కళ్యాణరావాశ్చర్యంగా.

"అరింటికల్లా వస్తానన్నావు. ఎనిమిదింటిదాకా చూసి నీ యింటికొచ్చాను. తాళం పెట్టివుంది—"

కళ్యాణరావు దెబ్బతిని—"అసలేమయిందంటే?" అని యేదో చెప్పబోయాడు.

"రాత్రి పదింటికి అన్నయ్యా వదినా సినిమాకెళ్ళి తిరిగొచ్చారు. హాల్లో వాళ్ళు నిన్ను చూశారుట...."

"అర్ధం—చూస్తే వాళ్ళు నన్నెందుకు పలకరించలేదు?"

"పలకరించినా వినిపించుకునే స్థితిలో లేవుట. అసలు నువ్వీ లోకంలో లేవుట...."

"అంటే?"

"నీ పక్కనో అమ్మాయుందిట...."

కళ్యాణరావు మాట్లాడకుండా భోంచేయసాగాడు.

"అమ్మ యెంతో బాధపడింది. తనకు నువ్వెంతో మంచివాడివని నమ్మకం—" అన్నాడు గణపతి.

"ఓ అమ్మాయితో కలిసి సినిమా చూస్తే నా మంచితనం మంటగలిసిపోతుందా?" అసహనంగా అన్నాడు కళ్యాణరావు.

"ఏమో — నువ్వు బద్ధమెందుకు చెప్పావో తెలియక నీ మంచితనం మంటగలిసిందనే అనుకున్నాను—"

"సాయంత్రం నీ కన్నీ చెబుతాను—" అన్నాడు కళ్యాణ్రావు.

మళ్ళీ యిద్దరూ ఆఫీసు పనిలో నిమగ్నులై పోయారు.

ఆ తర్వాత సాయంత్రం తిన్నగా ఆఫీసు నుంచి బీచికి వెళ్ళారిద్దరూ.

"నేను ప్రేమలో పడ్డాను. అది తప్పుకాదు కదా!" అన్నాడు కళ్యాణ్రావు ఉపోద్ఘాతంగా.

"మనిషి దాచిపెట్టాలనుకునే ప్రతి విషయమూ తప్పే అవుతుంది—" అన్నాడు గణపతి.

"అది నిజం కాదు...." అన్నాడు కళ్యాణ్రావు.

అతడు శ్యామలను ప్రేమించాడు. ఒకరోజున శ్యామల నిస్సహాయ పరిస్థితిలో ఒంటరిగా వుండగా అతడామెకు స్కూటరుమీద లిఫ్టిచ్చాడు. అలా ప్రారంభమయిన పరిచయం వారం రోజుల్లో ప్రేమగా మారింది. తన ప్రేమ గురించి కళ్యాణ్రావు గర్వంగా స్నేహితులకు చెప్పుకోవాలనే అనుకున్నాడు—కానీ....

"శ్యామల కోటీశ్వరుడి కూతురు. ఆమె కట్టే బట్టలు విలువ చేయదు నా జీవితం. శ్యామల నన్ను నిజంగా ప్రేమిస్తోందా అని అనుమానం కలుగుతూంటుంది. కోటీశ్వరుడి కూతురు. అందంగా వుంటుంది. తాత్కాలికంగా పరిచయమైనంత మాత్రాన ఆమె నా భార్య కావడం నిజమవుతుందా? నా కంత అదృష్టమా? నేను ధృవపర్చుకునేదాకా యెవరికీ యీ విషయం చెప్పకూడదనుకున్నాను. ముందే చెబితే నవ్వులపాలవుతాను కదా!"

"అలాంటప్పుడు నువ్వామెను పదిమందిలో సినిమా

వాళ్ళలో కాక రహస్యంగా కలుసుకోవలసింది...."

"ఏం చేయను? ఆమె యెక్కడికి రమ్మంటే అక్కడికి వెళ్ళిపోతాను. ఆమె ముందు నా బుర్ర పనిచేయదు. నా ఆలోచనలు స్తంభించిపోతాయి— ...."

"ఇంతకీ శ్యామల తండ్రి ఎవరు?"

కళ్యాణ్రావు వివరాలు చెప్పాడు.

"కనకరాజా కోటీశ్వరుడా?" అన్నా డాశ్చర్యంగా గణపతి.

అతడికి కనకరాజు తెలుసు.

ఊళ్ళో కనకరాజుకో బంగళా వుంది. అది ప్రత్యేకంగా అందంగా వుంటుంది. కానీ ఖరీదైనది కాదు. అతడికి రెండు కార్లున్నాయి. పేరున్న కొన్ని కంపెనీ వస్తువుల కతడు హోల్ సేల్ డీలరని తెలుసు. ప్రత్యేకించి కనకరాజు వ్యాపారాలేమిటో గణపతికి తెలియదు.

"అవును. నేను వాళ్ళింటికి వెళ్ళాను. అక్కడ వజ్రాలు పొదిగిన వస్తువులెన్నో వున్నాయి...." అంటూ కళ్యాణ్రావు కనకరాజు వైభవాన్ని వర్ణించి చెప్పాడు.

"కనకరాజు సామాన్యమైన లక్షాధికారి అయుండాలి. కోటీశ్వరుడయితే ఊళ్ళో చాలా పెద్ద పేరుండాలి...." అన్నాడు గణపతి.

"ఆయన సైలెంటు మనిషి. వైభవం స్వసుఖానికే కానీ ప్రదర్శనకు కాకూడదంటాడాయన. ఇంట్లో కూడా తన వైభవా న్నాయన అందరి ముందూ ప్రదర్శించడు— ...."

"నువ్వాయనతో మాట్లేదేవా?"

"లేదు...."

"ఎందుకైనా మంచిది. ముందుగా ఆయన్ని కలుసు

కని మాట్లాడు—"
"ఏం?"
"సైలెంటుగా డబ్బు సంపాయించేవాళ్ళు—సైలెంటుగా యేమయినా చేయగలరు. తన కూతురు నీతో తిరుగుతోందని తెలిస్తే ఆయన సైలెంటుగానే నిన్ను సఫా కట్టించేయగలడు. మీ ప్రేమ గురించి ఆయన తెలుసుకోవడం మంచిది...."
"శ్యామల ఆయనకన్నీ చెప్పేసింది. తండ్రికి మా ప్రేమ యిష్టమేనని ఆమె చెప్పింది నాతో. తన ఇష్టాన్ని తండ్రి కాదనడుట. ఆయనకు నన్ను పరిచయం చేస్తానని శ్యామల చెప్పింది. నేనే వెళ్ళడానికి భయపడుతున్నాను. చిన్నతనం నుంచీ పేదరికంలో పుట్టి పెరిగాను. భాగ్యవంతుణ్ని కలుసుకుని మాట్లాడాలంటే భయంగా వుంది...."
"ఆయన కూతుర్ని ప్రేమించగలిగినప్పుడు — ఆ విషయం ఆయనకు చెప్పడానికి భయమెందుకు?" అన్నాడు గణపతి.
"ఏమో?"
"శ్యామల నిన్ను నిజంగా ప్రేమిస్తుంటే నీకా భయం కలిగుండదు."
"శ్యామల ప్రేమ గురించి నీ కెలా చెప్పేది? ఆమె కారు డ్రైవ్ చేస్తూండగా ఇంజన్ కరాబై నిర్మానుష్య ప్రాంతంలో ఇరుక్కుపోయినప్పుడు మొదటిసారి మా యిద్దరికీ పరిచయమైంది. రెండు రోజుల్లో శ్యామల నాకు డ్రైవింగ్ నేర్పుతానంది. ఎందుకని నేనంటే—గొప్ప వాళ్ళు కాబోయే వాళ్ళందరికీ డ్రైవింగ్ రావడం అవసరమంది. ఒక ఆడపిల్ల పక్కనే కూర్చుని కారు డ్రైవింగ్

నేర్పాడమంటే ఆ అదృష్టం మాటల్లో చెప్పలేం. నాకు డ్రైవింగ్ వచ్చేసరికి మేమిద్దరం ప్రేమికుల మైపోయాం. ఇప్పుడు నాకు కారు డ్రైవింగ్ లైసెన్సు కూడా వచ్చేసింది. అదీ శ్యామల పలుకుబడివల్లనే!" అన్నాడు కళ్యాణ్రావు.

"పరిచయమైన రెండురోజుల్లో నీకు కారు డ్రైవింగ్ నేర్పుతానందంటే ఆమె నీనుంచి ఏదో ప్రయోజనాన్ని ఆశిస్తోందేమో!"

"నావల్ల ఆమెకు ప్రయోజన ముందనుకుంటే అది నా అహంకారమవుతుంది—" అన్నాడు కళ్యాణ్రావు.

"మన ప్రయోజనం మనకు తెలియకనే మనమిలా వుండిపోయాం. మన ప్రయోజనం నువ్వూహించలేవు. మనవల్లనే రాజీవ్ గాంధి ప్రధానమంత్రి అయ్యాడు. ఎన్టీఆర్ ముఖ్యమంత్రి అయ్యాడు. కృష్ణ సినీనటుడయ్యాడు. యండమూరి రచయిత అయ్యాడు. అంతా మనవల్ల పేరు, డబ్బు సంపాయించుకుంటూంటే — మనం మాత్రం ఎప్పుడూ యిలాగే వుండిపోతున్నాం. నీ ప్రయోజనం శ్యామలకు తెలిసినట్లు నీకు తెలిస్తే—నీ గొప్పతన మేముంది?"

"అయితే ఏమంటావ్?"

"నా మాట విని ఆలస్యం చేయకుండా కనకరాజును కలుసుకో. మీ ప్రేమ గురించి ఆయన అభిప్రాయం తెలుసుకో. నువ్వు తక్కువవాడినని అనుకోకు. నీవల్ల ఎందరికో ప్రయోజనముందని గుర్తుంచుకో. నీ వల్ల కనకరాజుకేలాంటి ప్రయోజనముందో తెలుసుకుందుకు ప్రయత్నిస్తూండు...."

"అనుమానం మనిషిని అదృష్టానికి దూరం చేస్తుంది.

శ్యామల ప్రేమ నా అదృష్టం...."

"అది అదృష్టమే కావచ్చు. అదృష్టం సహజంగా వుండాలి. నువ్వు చెప్పింది వింటూంటే ఇందులో కృత్రిమ ముందనిపిస్తోంది...."

"థాంక్యూ గణపతీ—నువ్వు చెప్పిన విషయాలు గుర్తుంచుకుంటాను. మనమిక విడిపోవాలి—" అన్నాడు కళ్యాణ్రావు.

గణపతి లేచి నిలబడి—"నన్ను మా యింటి దగ్గర డ్రాప్ చేస్తావా?" అన్నాడు.

"సారీ గణపతీ! ఇప్పుడిక్కడికి శ్యామల వస్తుంది. మే మిద్దరం మాట్లాడుకోవాల్సిన విషయాలెన్నో వున్నాయి-" అన్నాడు కళ్యాణ్రావు.

గణపతి నిట్టూర్చి—"సెలవు—" అన్నాడు.

## 2

శ్యామల తన సుకుమారమైన వేళ్ళతో ఇసుకలో యేవో అక్షరాలు రాస్తూ—"అతడెవరు?" అంది.

"నా స్నేహితుడు. పేరు గణపతి ..."

"అతణ్నిక్కడి కెందుకు రానిచ్చావు? పానకంలో పుడకలా గా— .."

"నువ్వొచ్చే సమయానికి పంపేశానుగా...."

"కళ్యాణ్....నీకు నా ప్రేమ యెప్పటికీ అర్థంకాదు. మనం ఆరున్నరకు కలుసుకుందామని నేనన్నాను కానీ నా మనసురకలు వేస్తూంటే ఆపుకోలేక ఆయిదున్నరకల్లా వచ్చేశాను. నీ స్నేహితుడి కళ్ళబడ్డం ఇష్టంలేక దూరంగా ఉన్నాను. ఎప్పటికీ అతడు వెళ్ళకపోతూంటే విసిగి పోయి చివరకు నీ కళ్ళబడ్డాను...."

"అవును-నిన్ను చూసే అతణ్ని పంపేశాను. అయాం

సారీ శ్యామలా...." అన్నాడు కళ్యాణ్రావు.

"శ్యామల కాదు, శ్యామూ అను...."

"సారీ శ్యామూ —" అన్నాడు కళ్యాణ్రావు వెంటనే.

"నిన్న కూడా అంతే! వాళ్ళింటికి భోజనానికి వెళ్ళా అన్నావు. నిన్ను సినిమాకు కదలేయడానికి నేను చాలా అవస్థపడాల్సి వచ్చింది. ఇతగాడు మన ప్రేమకు మధ్య విలన్‌లా దాపురించాడు. బీచిదగ్గర నీతో ఏం పనిట?"

"అతడినేమీ అనొద్దు శ్యామలా...."

"శ్యామల కాదు—శ్యామూ...."

కళ్యాణ్రావు నాలిక్కొరుక్కుని—"శ్యామూ! అతడు నా ప్రాణమిత్రుడు. నాకెవరూ లేని కష్టసమయంలో వారి కుటుంబమే నన్నాదుకుంది. నా కెప్పుడూ మోరల్ సపోర్టిస్తాడు గణపతి. అతడు నా శ్రేయోభిలాషి...." అన్నాడు.

"మన ప్రేమ కథ అతడికి తెలుసా?"

"ఇప్పుడే చెప్పాను—"

"ఏమన్నాడు?"

"శ్యామలా.... సారీ, శ్యామూ.....నిజం చెప్పేస్తున్నాను .... అతడు జరుగుతున్నదంతా కృత్రిమంగా వుందన్నాడు...."

శ్యామల ముఖం ఎర్రబడింది—"నువ్వు నమ్మావా?"

"నేను నమ్ముతానా...?"

"నమ్మకపోతే ఏం చేశావు? అతడి అభిప్రాయం విని ఊరుకున్నావా?"

కళ్యాణ్రావు మాట్లాడలేదు.

"కళ్యాణ్ ....నీ ప్రేమలో ఆవేశంలేదు. నేను నిన్ను

కళ్యాణ్ అని ముద్దుగా పిల్చుకుంటున్నాను. అలా పిలిచినప్పుడే మనమిద్దరమూ ఒకటేనన్న భావం నాలో కలుగుతుంది. ఆ భావం యెంతో బాగుంటుంది. కానీ నీలో ప్రేమకుమించి సంకోచం యెక్కువగా ఉంది. నన్ను నోరారా శ్యామా అని పిలవలేవు. మన ప్రేమ కృత్రిమమని నీ స్నేహితుడంటే ఆవేశంతో సాచి లెంపకాయ కొట్టలేవు..."

"శ్యామా....అన్నాడు కళ్యాణ్రావు ఆవేదనగా.

"నేను పిలవమన్నాను. పలిచావు. ఆవేదనపడమన్నానని ఆవేదనపడుతున్నావు. నీలో సహజంగా ప్రేమలేదు. నీ స్నేహితుడన్నమాట నిజం. మన ప్రేమలో యేదో కృత్రిమ ముంది..." అంది శ్యామల

"అలా అనొద్దు శ్యామా—మన అంతస్తులు వేరు. నా సంకోచం సహజం "

"నీ సంకోచాన్ని పోగొట్టలేని నా ప్రేమలో యేదో కృత్రిమముండి ఉండాలి. నీ స్నేహితుడు నిజమే చెప్పాడనుకోవాలి...." అంది శ్యామల.

"ప్లీజ్ శ్యామా—అలా అనొద్దు. అనవసరంగా నువ్వు నన్నపార్థం చేసుకుంటున్నావు...." అన్నాడు కళ్యాణ్రావు.

"నిన్న నా స్నేహితురాలికి మన ప్రేమ గురించి చెప్పాను. నీ వివరాలు విని—దరిద్రులతో స్నేహం చేయడమే తప్పు—నువ్వు ప్రేమదాకా కూడా వెళ్ళావా అని వెటాకోళం చేసింది...." ఆగింది శ్యామల.

"అది సహజమే! మన ప్రేమ గురించి అంతా అలాగే అంటారు...." అన్నాడు కళ్యాణరావు చిన్నబుచ్చుకుని.

"నీలో ఆవేశంలేదు. అందుకే నా స్నేహితురాలి

మాటలు నీకు సహజంగా అనిపించాయి. కానీ అప్పుడు నేనేం చేశానో తెలుసా?"

"ఏం చేశావు?" కుతూహలంగా అన్నాడు కళ్యాణ రావు.

"దాన్ని సాచి లెంపకాయ కొట్టాను. ఆవేశం నాకెంతటి బలాన్నిచ్చిందో ఏమో — నా చేతిముద్ర స్పష్టంగా దాని బుగ్గలమీద పడింది...."

"సారీ శ్యామా...." అన్నాడు కళ్యాణరావు.

"సారీ చెప్పడం కాదు. ఇప్పుడైనా వెళ్ళి నీ స్నేహితుణ్ని చెంపదెబ్బ కొట్టిరాస్తావా?"

"నా స్నేహితుడు నిన్నేమీ అనలేదు శ్యామా— వెంటనే మన ప్రేమ విషయం మీ నాన్నగారికి చెప్పడం మంచిదన్నాడు."

"ఈజిట్....అయితే ఈరోజే రాకూడదూ? నాన్న ఫ్రీగా యింట్లో ఉన్నాడు...." అంది శ్యామల.

"వస్తాను...."

"నువ్వు నువ్వేనా? నీకు నాకంటే నీ స్నేహితుడి మాటలమీదే గురి ఎక్కువలా వుంది. ఏమైతేనేం— హేట్సాఫ్ టూ యువర్ ఫ్రెండ్! నా కోరిక త్వరగా తీర్చేలా చేశాడు...." అంది శ్యామల.

ఇద్దరూ ఆక్రమించి లేచారు.

## 3

అందమైన సోఫాల్లో ఒకరికొకరెదురుగా కూర్చున్నారు కనకరాజు, కళ్యాణరావు.

"నీ గురించి అమ్మాయి చాలా గొప్పగా చెప్పింది. నిన్ను చూస్తుంటే అది అతిశయోక్తులేం చెప్పలేదనిపిస్తోంది—" అన్నాడు కనకరాజు.

కళ్యాణరావు మొహమాటంగా నవ్వాడు.

"నువ్వు నా గురించేమనుకుంటున్నావో తెలియదు. పేదవాళ్ళకీ, మధ్య తరగతి వాళ్ళకీ—డబ్బున్నవాళ్ళంటే కొన్ని దురభిప్రాయాలుంటాయి. వాళ్ళు మనుషులే కాని వాళ్ళనుకోరు. నువ్వూ అలాంటివాడివే అయితే నేనాశ్చర్యపోను...." అన్నాడు కనకరాజు.

"నాకు మీరంటే గౌరవం—" అన్నాడు కళ్యాణరావు.

"గౌరవించడానికి నా గురించి నీకేం తెలుసు? నీ వినయం నీ చేత అలా అనిపిస్తోంది. చాలామంది నన్ను డబ్బు చూసి గౌరవిస్తూంటారు. డబ్బుకుమించి గౌరవాన్ని పొందే మరే అర్హత నాకు లేదని నాకు తెలుసు. నువ్వు మాత్రం నన్ను శ్యామల తండ్రిగా గౌరవిస్తున్నావు. అవునా?" అన్నాడు కనకరాజు.

కళ్యాణరావు కాయన ధోరణి దేనికి దారితీస్తుందో తెలియక ఆయోమయంగా చూశాడు.

కనకరాజు నవ్వి—"నాకు హిపోక్రసీ తెలియదు. నా కూతురిష్టమే నా యిష్టం. నువ్వు నాకు నచ్చావు. మీరిద్దరూ యిష్టపడితే మీ పెళ్ళి జరుగుతుంది. కానీ.." అని ఆగాడు.

ఆ "కానీ" ఎన్నో ప్రేమ కథలమధ్య అడ్డుగోడగా నిలిచిందని కళ్యాణరావుకు తెలియకపోలేదు. అతడి శరీరంలో ఉన్నట్లుండి రక్తపు పోటు హెచ్చయింది.

"కంగారుపడకు. నేను నీ గురించి చెప్పడానికి ప్రయత్నించడంలేదు. శ్యామల గతం గురించి నువ్వు కొంత తెలుసుకోవాలి...."

"శ్యామల గతమా?" అన్నాడు కళ్యాణరావాశ్చ

ర్యంగా.

కనకరాజతడి ఆశ్చర్యాన్ని పట్టించుకోకుండా చెప్పుకు పోసాగాడు.

శివరాం డేరింగ్, డాషింగ్ యంగ్ మాన్. అతడు కనకరాజుకు దూరపు బంధువు కూడా!

మూడేళ్ళ క్రితం శివరాం ఈ ఊరొచ్చాడు. వచ్చినపుడు కూడా పాతిక వేలు తెచ్చుకొచ్చాడు. కనకరాజింట్లో ఓ గదిలో మకాం పెట్టాడు.

ఇప్పుడు శివరాం ఉంటున్న బంగళా ఖరీదు అయిదు లక్షలు. ఆదతడి స్వంతం. అప్పుడప్పుడు కనకరాజుని పలకరించడానికి వస్తూంటాడు. అతడికి తీరుబడి చాలా తక్కువ.

అలాంటి శివరాం శ్యామలవంటి ఆధునిక యువతినాకర్షించడంలో ఆశ్చర్యం లేదు. శ్యామల అతడి ప్రేమలో పడింది. అతణ్ణి గాఢంగా ప్రేమించింది. పూర్తిగా నమ్మింది.

శివరాం ఆమె అమాయకత్వాన్ని ఆసరాగా తీసుకుని—లోబర్చుకోవాలనుకున్నాడు. పవిత్రతకు ప్రాధాన్యతనిచ్చే శ్యామల ముందతడి ఆటలు సాగలేదు. చివరికతడు శ్యామలను పెళ్ళిచేసుకోవాలనుకున్నాడు.

అప్పుడు తెలిసింది శ్యామలకు — శివరాం అసలు స్వరూపం!

శివరాంకు లేని దురలవాటు లేదు.

రాత్రిళ్ళు క్లబ్బులో అదుపులేకుండా తాగుతాడు శివరాం. అతడికి చాలామంది స్త్రీలతో పరిచయముంది. డబ్బిచ్చి స్త్రీ సుఖాన్ని కొనుక్కుంటాడతడు.

శ్యామల అతణ్ణి నిలదీసి అడిగింది.

"డబ్బు సంపాదించడం విషయంలో ఆడదానికీ మగాడికీ పెద్ద తేడా లేదు. పవిత్రతను పక్కన పెట్టి నీతిని వదిలి పెట్టినప్పుడే అందమైన ఆడపిల్ల లక్షలకు లక్షలార్జించగలుగుతుంది. డబ్బు సంపాదించాలంటే మగాడూ అంతే! నువ్వు నా బయటి జీవితం గురించి పట్టించుకోకు. ఇంట్లో రాముయ్యలా ఉంటాను. నువ్వు మహారాణిలా జీవించగలవు—" అన్నాడు శివరాం.

"నీ గతాన్ని మరిచిపోతాను. నీ పద్ధతి మార్చుకో" అంది శ్యామల తన ప్రేమను మరిచిపోలేక.

"నా పద్ధతి మార్చుకోలేను. మోసం నాకు గిట్టదు. లేకుంటే నా విషయాలన్నీ నీకు తెలియకుండా రహస్యంగా ఉంచేవాణ్ణి. నీకు అనుభవం తక్కువ. అందుకే నా పద్ధతి తప్పనుకుంటున్నావు...." అన్నాడు శివరాం.

శ్యామల అతడికెంతగానో నచ్చచెప్పాలని చూసింది. ఫలించలేదు. అప్పుడామె అతడికి దూరంగా ఉండనారంభించింది.

"స్త్రీ ఒకరినే ప్రేమిస్తుంది. ఎట్టి పరిస్థితుల్లోనూ ఆ ప్రేమను చంపుకోలేదు. మరిచిపోలేదు. నన్ను కాదని వేరొకడితో నువ్వు సుఖపడలేవు...." అని శివరాం శ్యామలను హెచ్చరించాడు.

"నేను నిన్ను ప్రేమించానని భ్రమపడ్డాను. నేనింకా నిన్ను ప్రేమిస్తున్నాననుకుంటే అది నీ భ్రమ. గుడ్‌బై" అంది శ్యామల.

"అలా శ్యామల శివరాంకి గుడ్‌బై కొట్టినా—ఆమె అప్పట్నించీ అన్యమనస్కంగా ఉండేది. అది నాకెంతో అసంతృప్తిగా ఉండేది. నీతో పరిచయమైన తర్వాత శ్యామలలో మళ్ళీ కొత్త ఉత్సాహం చూశాను. నువ్వు

యోగ్యుడివైతే బాగుండుననుకున్నాను. అయితే నీకు శ్యామల గురించిన నిజం కూడా తెలియాలి. చెప్పేయమన్నాను. తను చెప్పలేనంది. అయితే నేనే చెబుతున్నాను. నువ్వు రానంటున్నావంది. ఈ రోజు వచ్చావు. అంతా నీకు చెప్పాను. ఏదీ నేను దాచడంలేదు. శ్యామల వివాహం చేసుకుంటానంటే కోటిమంది వరులు వచ్చి క్యూలో నిలబడతారు. ఆమె వివాహం నాకో సమస్య కాదు. కానీ తల్లిలేని బిడ్డ శ్యామల. చదువుకున్న ఆధునిక యువతి శ్యామల. అందుకే అన్నీ ఆమెకు వదిలిపెట్టాను. తానెన్నుకున్న వరుడికే యిచ్చి ఆమెకు పెళ్ళిచేయాలనుకుంటున్నాను. నువ్వు నీ నిర్ణయాన్నిప్పుడే చెప్పేయక్కర్లేదు. శ్యామలను పెళ్ళిచేసుకునేముందు నువ్వోసారి శివరాంని కలుసుకోవడం మంచిది....”

“ఎందుకని?”

“శివరాం తత్వం నాకు తెలుసు. అతడికి శ్యామలంటే ఆశ ఉంది. ధనగర్వముంది. శ్యామల పెళ్ళిచేసుకుంటే నిన్ను వేటాడతాడు. ఆమె గురించి నీకు లేనిపోనివి చెప్పి నమ్మిస్తాడు. పెళ్ళయ్యాక మీ దంపతులమధ్య అపార్థాలు రేగడం నాకిష్టంలేదు....” అన్నాడు కనకరాజు.

కళ్యాణ్రావు శివరాం వివరాలు తెలుసుకుని—
“నేనతణ్ణి కలుసుకుంటాను. అయితే నిర్ణయం తీసుకునేందుకు కాదు. నా నిర్ణయం యెప్పుడో అయిపోయింది. నేను శ్యామలను పెళ్ళి చేసుకుంటాను—” అన్నాడు.

“మరి శివరాంను కలుసుకోవడం దేనికి?”

“అలాంటి వాళ్ళకు బుద్ధిచెప్పడం నా కర్తవ్యం-” అంటూ లేచాడతడు.

శ్యామల వచ్చి అతణ్ణి గేటుదాకా దిగబెట్టింది—

"నువ్వు శివరాంని కలుసుకోవద్దు—" అందామె.

"ఏం?"

"లేనిపోని విశేషాలు సృష్టించడంలో అతడికతడే సాటి. అతడు నీకలాంటి విశేషాలు చెబుతాడేమోనని నా భయం...."

"శ్యామా—నీమీద నీకు నమ్మకముందా?"

"ఉంది—"

"నాకూ నీమీద నమ్మకముంది.... ...." అన్నాడు కళ్యాణ్రావు.

"థాంక్యూ కళ్యాణ్—" అంది శ్యామల.

గేటుదాకా వచ్చేక—"ఒకవేళ నీ గతం చెడ్డదే అయినా కూడా నాకు బాధలేదు. వర్తమానంలో నువ్వు వచ్చావు. భవిష్యత్తులో మనం సుఖపడతాం. అంతే నాక్కావలసింది. కంటికన్పించని గతం నన్ను బాధించదు. అది నాకు లేనట్లే లెక్క!" అన్నాడు కళ్యాణ్రావు.

"అయితే నువ్వింక శివరాంని కలుసుకోవడమెందుకు?"

"శ్యామా—కాబోయే భర్తగా నాకు కొన్ని బాధ్యతలున్నాయి. అందులో ముఖ్యమైనది శివరాంవంటి వాడికి బుద్ధి చెప్పడం—" అన్నాడు కళ్యాణ్రావు అమితావేశంగా.

అతడి ఆవేశాన్ని కనిపెట్టిన శ్యామల—"ఇతడు నన్ను నిజంగా మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నాడు—"అనుకుంది.

## 4

కళ్యాణ్రావు అప్పుడు తిన్నగా శివరాం బంగళాకు వెళ్ళాడు. బంగళాలో పెద్ద హాలుంది. అతడక్కడకు

వెళ్ళేసరికి హాల్లో శివరాంకాక యొనమండుగురు పెద్ద మనుషులున్నారు.

"ఏమిటి నీకు నాతో పని?" అన్నాడు శివరాం.

శివరాంముందు కళ్యాణ్రావు పిట్టలా ఉన్నాడు.

చెయ్యెత్తు మనిషతడు. పెర్సనాలిటీలో సినీ నటుడు ధర్మేంద్రలా ఉన్నాడు. అందంలో దేవానంద్ ను మించి పోయాడు.

"నీతో ప్రయివేటుగా మాట్లాడాలి...."

"అయితే ఓ గంటైనా ఆగాలి."

"ఎందుకు?"

"ఇప్పుడు నేను, నా స్నేహితులు కాసేపు ఎంజాయ్ చేయాలి...."

"అంతవరకూ నేనేం చేయాలి?"

"కావాలంటే నువ్వూ యిక్కడ కూర్చోవచ్చు...."

కళ్యాణ్రావు అక్కడే కూర్చున్నాడు.

శివరాం చప్పట్లు కొట్టాడు.

హాల్లో యిద్దరు యువతులు ప్రవేశించారు. వారు పలుచని దుస్తులు వేసుకున్నారు. లో దుస్తులు లేవు. ఇద్దరూ పచ్చని బంగారుఛాయలో మెరిసిపోతున్నారు. లేతవయసులో ఉన్నారు.

ఉన్నట్టుండి హాల్లో సంగీతం వినిపించ సాగింది.

యువతులిద్దరూ నృత్యం ప్రారంభించారు. నృత్యం కొనసాగిస్తూ వారు—శివరాం స్నేహితుల వద్దకు వెడుతున్నారు. వాళ్ళు వారి దుస్తులు తొలగించే ప్రయత్నాలు చేస్తున్నారు.

పావు గంటలో యువతులిద్దరూ నగ్నంగా తయారయ్యారు.

ఆ తర్వాత ఆ నృత్యం పోకడ మారింది.

యువతులలో ఒకామె పురుషుడిగా, మరొకామె ప్రియురాలిగా నటన ప్రారంభించారు.

జుగుప్సాకరంగా ఉందా ప్రదర్శన.

కళ్యాణ్రావుకు కళ్ళు వేడెక్కింది. శివరాం అతడి భుజంమీద చేయివేసి — "కనకరాజు నిన్నిక్కడకు పంపాడా?" అన్నాడు.

"నీకెలా తెలుసు."

"నాకు చాలా తెలుసు. నువ్వు కానీ శ్యామల వలలో పడలేదు కదా!" అన్నాడు శివరాం.

"వలేమిటి?"

"ప్రదర్శన చూస్తున్నావుగదా—కొన్నాళ్ళ క్రితం ఇలాంటి ప్రదర్శనే ఇక్కడ శ్యామలచేత ఇప్పించాను-" అన్నాడు శివరాం.

కళ్యాణ్రావు వంటిమీద రోమాలు నిక్కబొడుచుకున్నాయి. కానీ అతడు మాట్లాడలేదు. శివరాం చెప్పుకుని పోతున్నాడు.

"నా స్నేహితులు సామాన్యులు. వాళ్ళ అభిరుచులు కనిపెట్టి నా ఇంట్లో ఇలాంటి అద్భుత ప్రదర్శనలేర్పాటు చేస్తూంటాను. అందుకే వాళ్ళు నా స్నేహాన్ని వదులుకోలేరు. ఈ ప్రదర్శన చూసి వాళ్ళ శరీరాలు, మనసు ఆవేశంలో ఉంటాయి. ఆ ఆవేశం చల్లారడానికి ఇంట్లో యేర్పాట్లున్నాయి. కావాలంటే నీకూ అలాంటి ఏర్పాటు చేయగలను. అయినా సరే—నువ్వు నాతో నే మాట్లాడాలనుకుంటే—ఆ ఏర్పాటు సంగతి మరిచిపోయి నాతో రా—" అంటూ లేచాడు శివరాం.

కళ్యాణరావతణ్ని అనుసరించాడు.

శివరాం నవ్వుతూనే—"అయితే ఏర్పాటక్కర్లేదన్న మాట నీకు—" అన్నాడు.

కళ్యాణ్రావు జవాబివ్వలేదు.

ఇద్దరూ ఓ గదిలో ప్రవేశించారు. వాళ్ళడుగు పెట్టిన వెంటనే గది తలుపులు మూసుకున్నాయి.

గదిని చూసి కళ్యాణ్రావు ఆశ్చర్యపోయాడు. అది శోభనం గదిలా ఉంది. గదిలో పూలపాన్పుపైన ఓ యువతికూడా కూర్చుని ఉంది.

"కంగారు పడకు. ఏర్పాటు నీక్కాదు. నాకు. నీ గురించి నా సమయం వృధాచేసుకోలేనుకదా. నా కోర్కెలను వాయిదా వేసుకోలేనుకదా! ఏం చెబుతావో చెప్పు...." అంటూ అతడు మంచం సమీపించాడు. అతణ్ని చూస్తూనే మంచంమీది యువతి లేచి నిలబడి—అతణ్ణి బలంగా కౌగలించుకుని ముద్దు పెట్టుకుంది. ఆమె కక్కడ కళ్యాణ్రావున్నాడన్న ధ్యాసే ఉన్నట్లులేదు.

కళ్యాణ్రావు ఇబ్బందిగా ఫీలయ్యాడు. అతడు వెనక్కు తిరిగి—"నేను నీతో మరోసారి మాట్లాడతాను—" అన్నాడు.

"వెళ్ళిపోకు. నువ్వు మాట్లాడ్డం అయ్యేదాకా గది తలుపులు తెరుచుకోవు—" అన్నాడు శివరాం.

కళ్యాణ్రావుకు తప్పలేదు. అతడు శివరాం శృంగార చేష్టలను చూస్తూనే తన్నుతాను సంబాళించుకుంటూ—"నేను శ్యామలను పెళ్ళిచేసుకుంటున్నాను-" అన్నాడు.

శివరాం నవ్వి—"నువ్వు చాలా మంచి వాడిలా గున్నావు. శ్యామలవంటి కులటను చేసుకోకు—" అన్నాడు.

"శ్యామల కులట కాదు—" అన్నాడు కళ్యాణ్రావు

ఆవేశంగా.

"మనిషి ముఖం చూస్తే కలట అవునో కాదో తెలి యదు. శ్యామల యెలాంటిదో తెలుసుకోవాలంటే నీకు ఋజువులు చూపిస్తాను—" అంటూ అతడు మంచం మీద తలగడా యెత్తి ఓ కవరు తీసి అందించాడు.

కళ్యాణ్రావు ఫొటోలు తీశాడు కవర్లోంచి.

అన్ని ఫొటోల్లోనూ శ్యామల ఉంది. మొత్తం పన్నెండు ఫొటోలున్నాయి.

ఆ ఫోటోలు చూశాక అతడికి శ్యామల శరీరంలో తెలుసుకోవాల్సిన రహస్యాలేమీ లేవు.

"శ్యామల నన్ను పెళ్ళి చేసుకుంటానంది. నేనెలా చెబితే అలా వింటానంది. పెళ్ళి కభ్యంతరం పెట్టానని కోపగించుకుని నాతో మాట్లాడ్డం మానేసింది .."

"అబద్ధం—...." అన్నాడు కళ్యాణ్రావు ఆవే శంగా.

"ఏమిటి—నీ చేతిలోని ఫొటోలా?"

"ఈ ఫోటోలతో నాకు నిమిత్తంలేదు—" అంటూ కళ్యాణ్రావవి శివరామ్మీదకు విసిరాడు.

"నిజమైన ప్రేమికుడివి. శ్యామల సుఖపడుతుంది. నువ్వు కష్టపడతావు—" అని నవ్వాడు శివరామ్.

"నిజమైన ప్రేమికుడేం చేస్తాడో తెలుసుకోవాల నుందా?" అన్నాడు కళ్యాణ్రావు.

"ఊఁ చెప్పు...."

"శ్యామలను పెళ్ళిచేసుకుంటాడు. నువ్వెంత ప్రయ త్నించాక కూడా—"

"అంతేనా—యింకా యేమైనా చెప్పగలవా?"

"నేను వెడతాను...." అన్నాడు కళ్యాణ్రావు.

"సరే—వెళ్ళు. కానీ నిజమైన ప్రేమికుడింకా యేమైనా చేయగలడేమో తోస్తే—నువ్వు నాకు టెలిఫోన్ చేసి చెప్పు.... తెలుసుకుంటాను—" అన్నాడు శివరామ్ వెటకారంగా.

కళ్యాణ్రావు అక్కణ్ణుంచి సులభంగానే బైటకు వెళ్ళిపోయాడు. ఆవేశంలో అతడికి పరిసరాలు తెలియడంలేదు.

తను చూసిన అసభ్య నృత్యం...

శివరాం మాటలు ....

శ్యామల ఫొటోలు ....

శివరాం,అతడి ప్రియురాలు తన కళ్ళెదుటే శృంగార చేష్టలు ....

రెండురకాల ఆవేశాలు కళ్యాణ్రావును బాధిస్తున్నాయి.

ఒకటి శివరాం అంటే కోపం. రెండు శరీరంలో తాపం.

ఎలాగో అతడిల్లు చేరుకునేసరికి గుమ్మం దగ్గరే అతడి ఆవేశం పూర్తిగా చల్లారిపోయింది.

అక్కడ కూర్చొని ఉన్న ఓ వృద్ధురాలిని చూసి—"అమ్మా—నువ్వెప్పుడొచ్చావ్?" అన్నాడతను.

"వచ్చి గంటయింది. ఎదురింట్లో చాలాసేపు కూర్చున్నాను. వాళ్ళెక్కడికో బైటికి వెడుతున్నారు. తాళాలు నాకిచ్చి వెడతామన్నారు. వద్దన్నాను—...." అంది కళ్యాణ్రావు తల్లి రుక్మిణమ్మ.

కళ్యాణ్రావు తలుపు తాళం తీస్తూ—"ఏమిటి విశేషం?" అన్నాడు.

"నీకు మంచి సంబంధం వచ్చిందిరా! పిల్ల చిదిమిదీపం

పెట్టుకు నేలాగుంటుంది. మంచి సంప్రదాయమయిన కుటుంబం..." అంది రుక్మిణమ్మ.

## 5

మర్నాడుదయం పెందరాళే బయల్దేరి కనకరాజింటికి వెళ్ళాడు కళ్యాణ్రావు. ఇంట్లో కనకరాజు లేడు. శ్యామల ఉంది.

జరిగిందంతా శ్యామలకు చెప్పాడతడు.

శ్యామల అంతా విని—"శివరాంకు ట్రిక్ ఫొటోగ్రఫీ తెలుసు. మహా పతివ్రతలకూ కూడా అతడు నగ్న చిత్రాలు తీయగలడు—" అంది.

"అదే నేనూ అనుకున్నాను...."

"యూ ఆర్ రియల్ లవర్—అయ్ లైక్యూ వెరీ మచ్...."

కళ్యాణ్రావు చటుక్కున ఆమెను కౌగలించుకుని ముద్దు పెట్టుకున్నాడు. శ్యామల తెల్లబోయి అతణ్ని విడిపించుకుని—"ఏమటిది?" అంది.

"అయాం సారీ—శ్యామూ! శివరాం యింటి నుంచి బైటపడినప్పుడు నే నెలాంటి ఆవేశంలో ఉన్నానో ఊహించలేవు. మీ యింటికి వచ్చి నీ కౌగిలిలో వాలిపోవాలనిపించింది. నిన్ను కలుసుకోవడం కుదరకపోతే—తప్పు చేసయినా సరే నా కోరిక తీర్చుకోవాలనిపించింది. అదృష్టంకొద్దీ యింటికి వెళ్ళేసరికి అమ్మ ఉంది. లేకుంటే పతనమైపోయేవాణ్ని. అమ్మ నన్ను చిన్నప్పటెన్నోసార్లు తప్పు చేయకుండా ఆపింది. ఇప్పుడూ అదే జరిగింది—" అన్నాడు కళ్యాణ్రావు.

శ్యామల ఆశ్చర్యపడి రుక్మిణమ్మ రాకకు కారణమడిగింది. తల్లి పెళ్ళి సంబంధం తెచ్చిన విశేషం చెప్పా

డతడు.

"అయితే నీ పెళ్ళి దగ్గర పడిందన్న మాట—యేం నిర్ణయం తీసుకుంటావ్?" అంది శ్యామల.

"నా నిర్ణయం యెప్పుడో అయిపోయింది. అమ్మను కూడా ఒప్పిస్తాను. వెంటనే మనం పెళ్ళి చేసుకుందాం" అన్నాడు కళ్యాణ్రావు.

"అది చెప్పడానికేనా యిప్పుడొచ్చావు?" అంది శ్యామల.

"కాదు—ఒక విషయంలో నిన్ను సలహా అడుగుదామని వచ్చాను...."

"ఏమిటది?"

"నిజమయిన ప్రేమికులేం చేస్తాడో తెలియబర్చమని సవాలు చేశాడు శివరాం.అతగాడికి బుద్ధివచ్చే పనేదైనా చేయాలనుంది...."

"వెరీగుడ్ అయిడియా....నా మనసులోని మాట చెప్పావు...."

"నాకేమీ స్ఫురించలేదు...."

"చాలా సింపుల్..శివరాం ఎప్పుడెప్పుడెక్కడెక్కడ తిరుగుతూంటాడో నాకు తెలుసు. ఈ రోజు సాయంత్రం అతడు ఎగ్జిబిషన్కు వెడతాడు. అక్కడ నువ్వు పదిమందిలో అతడి చేయిపట్టుకుని—'రాస్కెల్—పెద్దమనిషిలా వేషం వేసుకుని వచ్చి నా పర్సు కొట్టేస్తావుట్రా—బ్లడీ—పిక్ పాకెట్....' అను....అంతే—జనం అతణ్ని చావదంతారు...."

"చాలా బాగుంది అయిడియా—" అన్నాడు కళ్యాణ్రావు.

"వెంటనే వెళ్ళు. ఆఫీసులో రిహార్సల్సు వేసుకో—"

అంది శ్యామల.

అక్కణ్ణించి ఉత్సాహంగా వెళ్ళిపోయాడు కళ్యాణ్రావు.

# 6

శివరాంకది విచిత్ర పరిస్థితి. అలా జరుగుతుందని అతడనుకోలేదు. సమీపంలో అతడి అనుచరులెవ్వరూ లేరు.

జనం చుట్టూ చేరి అతణ్ణి చావబాదుతున్నారు.

ఓ ప్రెస్ ఫోటోగ్రాఫర్ ఉత్సాహంగా ఫోటోలు తీస్తున్నాడా దృశ్యాన్ని.

ఆ సమయంలో శ్యామల అక్కడ అడుగుపెట్టి—

"ఆగండి!" అంటూ గట్టిగా అరిచింది.

శివరాంపై దాడి ఆగిపోయింది.

"ఇతడు నాకు బాగా తెలుసు. ఊళ్ళో బాగా పేరున్న పెద్దమనిషి. పేరు శివరాం....ఎవరో పొరపాటు పడ్డారు...." అంది శ్యామల.

"ఈ అమ్మాయి కూడా గ్యాంగ్‌లో మనిషయ్యుంటుంది...." అన్నాడు గుంపులో ఒకడు.

అక్కడే ఉన్న కళ్యాణ్రావు వెంటనే—"ఈమె గ్యాంగ్‌లో మనిషి కాదు. ప్రముఖ హోల్ సేల్ వ్యాపారస్థుడు కనకరాజుగారమ్మాయి శ్యామల. నాకు తెలుసు" అన్నాడు.

"అరే—కళ్యాణ్-నువ్వా? నువ్వు చూస్తూ శివరాం గారిని దెబ్బలు తిననిచ్చావా? నీకీయన తెలియదూ?" అంది శ్యామల.

"తెలియదు...." అన్నాడు కళ్యాణ్రావు.

"ఇతడే—ఈయన్ను దొంగన్నది...." అన్నాడు గుంపులో ఒకడు. అతడి గొంతుతో చాలా గొంతులు

కలిశాయి.

"ఇప్పుడూ నేనామాట అంటాను. ఈయన నా జేబులో చేయిపెట్టి పర్సు తీశాడు........"అన్నాడు కళ్యాణ్రావు.

"ఒరేయ్-లక్షలకు లక్షలు సంపాదిస్తున్నాను. నాకు నీ బోడి పర్సెందుకురా?" అంటూ నీరసంగా అరిచాడు శివరాం.

"ఆవేశపడకు. పొరపాట్లెవరికైనా వస్తాయి. పద-యింటికి పోదాం—" అంటూ శ్యామల శివరాం నక్కణ్ణించి తీసుకని వెళ్ళిపోయింది.

గుంపులో జనం ఆమెకభ్యంతరం పెట్టలేదు.

"నిజంగా ఆమె నీకు తెలుసా? లేక ఆడపిల్ల అడ్డొచ్చింది కదా అని అయిసైపోయి అబద్ధం చెప్పావా?" అన్నాడు గుంపులో ఒకడు కళ్యాణ్రావుతో.

"అనుమానముంటే ఆమెతో వెళ్ళండి...." అన్నాడు కళ్యాణ్రావు.

ప్రెస్ ఫోటోగ్రాఫరు వెంటనే అక్కణ్ణించి పరుగెత్తాడు. అతడికి మంచి కథ దొరుకుతుందని నమ్మకంగా ఉంది.

## 7

"ఇంతాలస్యంగా వచ్చావేంరా?" అంది రుక్మిణమ్మ.

"ఎగ్జిబిషన్కు వెళ్ళానమ్మా!" అన్నాడు కళ్యాణ్రావు.

"ఎగ్జిబిషన్కు వెళ్ళాలనుకుంటే ఇంటికొచ్చి వెళ్ళాల్సింది. నేనూ వచ్చేదాన్నిగా."

కళ్యాణ్రావు మాట్లాడలేదు.

"నీ పద్ధతి నాకు నచ్చలేదు. తొందరగా పెళ్ళి చేసుకో. ఒకప్పుడయితే ఇలా అడ్డమైన తిరుగుళ్లూ అల

వాటు లేవు నీకు. ఇప్పుడు నీకు వేళాపాళా లేకుండా పోయింది—" అంది రుక్మిణమ్మ.

కళ్యాణ్రావు మౌనంగా ఊరుకున్నాడు.

"ఆలోచించి చెబుతానన్నావు. నేను చెప్పిన సంబంధం గురించి ఏమంటావు?" అంది రుక్మిణమ్మ.

శ్యామల గురించి చెప్పాలని నోటి చివరిదాకా వచ్చింది కళ్యాణ్రావుకు. ఎందుకో వెంటనే చెప్పలేక పోయాడు.

"ఇంకో రోజు టైము కావాలమ్మా—నాకు!" అన్నాడతడు.

"నేనిక్కడెన్నాళ్ళో ఉండలేను. నాన్నగారేమో బొత్తిగా సర్దుకుపోలేరు. చెల్లాయే చేతులు కాల్చుకో వాలి. దానికింకా వండి వార్చిపెట్టే వయసేదీ—అంతా నీకే తెలుసు—" అంది రుక్మిణమ్మ.

"ఈ పురాణమంతా ఎందుకు? ఒక్కరోజు మాత్రమే కదా నేనడిగిన టైము?" అన్నాడు కళ్యాణ్రావు.

"ఒకోసారి ఒక్కరోజు చాలు—చరిత్ర తలకిందు లయ్యేందుకు. నీకిప్పుడా ఒక్కరోజు మాత్రం టయి మెందుకు?" అంది రుక్మిణమ్మ.

"అది కూడా ఒకరోజు తర్వాతే తెలుసుకుంటావు-" అన్నాడు కళ్యాణ్రావు.

"ఏం తెలుసుకుంటానో!" అని నిట్టూర్చింది రుక్మిణమ్మ.

రాత్రి భోజనానికి క్యారియర్ తెప్పించాడు కళ్యాణ్రావు. ఇద్దరి భోజనాలూ అయ్యేసరికి తొమ్మిదయింది.

అప్పుడో చిన్న కుర్రాడు వాళ్ళింటికొచ్చి ఓ చీటీ యిచ్చాడు కళ్యాణ్రావుకి. అది శ్యామల పిలుపు.

చదివేసి చించి అవతల పారేయమందామె.

అనుకోకుండా కనకరాజు ప్రయాణంమీద ఊరి కెళ్ళాట. తనేమో ప్రస్తుతం ఓ స్నేహితురాలింట్లో ఉందిట. తను వచ్చేసరికి పదిన్నర కావచ్చుననీ అంతకు బాగా ముందుగానే వచ్చి యింట్లో ఉండమనీ చాలా ముఖ్యమైన విశేషాలు మాట్లాడాలనీ రాసిందామె. ముఖ్యంగా సాయంత్రం అతడు చేసినదానికి మంచి బహుమతి నిస్తానంది.

కళ్యాణ్రావు శరీరం పులకరించింది.

శ్యామల తను చేసిందానికి కృతజ్ఞతగా తన్ను పిలుస్తోంది.

ఇంట్లో తండ్రిలేడు.

రాత్రి సమయంలో దర్వాన్ గేటుదగ్గర, ఓ పనివాడు మాత్రం యింట్లోనూ ఉంటారు. వాడైనా పిలిచినప్పుడే ప్రత్యక్షమవుతాడు.

శ్యామల తనకు కాబోయే భార్య. ఆమె తను సాధించిన దానికంత సంతోషించిందంటే — ఏకాంతంలో తన్ను దగ్గరకు రమ్మంది.

"థాంక్యూ శ్యామలా!" అనుకున్నాడతడు మనసులో.

"అమ్మా అర్జంటు పనిమీద బయటకు వెళ్ళాలి. కాస్త ఆలస్యంగా వస్తే కంగారుపడకు. నా గురించి ఆలోచించకుండా నిద్రపో! అన్నీ తెల్లవారుజామున చెబుతాను—" అంటూ అతడింట్లోంచి బైటపడ్డాడు.

దారిలో శ్యామల పంపిన చీటీ ముక్కలు చేసి అవతల పారేశాడు.

ఆటోలో కనకరాజిల్లు చేరుకున్నాడు.

దర్వాన్ అతడికి సెల్యూట్ చేసి—"ఇంట్లో చిన్నమ్మ

గారు లేరు. అయ్యగారూ ఊళ్ళో లేరు—" అన్నాడు.

"ఆ విషయం నాకు తెలుసు. ఇంట్లో అసలెవరైనా ఉన్నారా?" అన్నాడు కళ్యాణ్రావు యథాలాపంగా.

"ఆc భూషయ్యున్నాడు సర్....శివరాం బాబు కూడా ఉన్నాడు" అన్నాడు దర్వాన్.

కళ్యాణ్రావు ఆశ్చర్యపడి — "శివరామా? అతడేం చేస్తున్నాడిక్కడ?" అన్నాడు.

"ఆ బాబు బాగా గాయపడ్డాడు. చిన్నమ్మగారు డాక్టర్ని పిలిపించారు. ఆయనింకా లేచి తిరిగేలా లేడు" అన్నాడు దర్వాన్.

కళ్యాణ్రావు కొద్దిగా నిరుత్సాహపడ్డాడు.

శ్యామల ఉద్దేశ్యమేమిటి? శివరాం ఉండగా తన నెందుకు పిలిచిందామె?

ఆలోచిస్తూనే అతడు లోపల అడుగుపెట్టాడు.

హాల్లో అతడికి భూషయ్య కనిపించి నమస్కరించాడు.

"చిన్నమ్మగారింకా రాలేదా?" అడిగాడతడు.

"లేదండి...."

"సరే—యిక్కడ కూర్చుంటాను...."

"శివరాం బాబును కలుసుకోరా?"

"ఎందుకు?"

"ఆ బాబుకు బాగా దెబ్బలు తగిలాయి. తమరు చూడ్డానికి రావచ్చునని అమ్మగారు చెప్పారు...."

శివరాం కదలలేని స్థితిలో ఉండగా తను చూడాలని శ్యామల అభిమతం కావచ్చు.

"ఎక్కడున్నాడు శివరాం?"

భూషయ్య ఓ గదివైపు చూపించాడు.

"అమ్మగారు బయటకు వెళ్ళి ఎంత సేపయింది?"

"రెండుగంటలవుతుందండి...."

"నువ్వూరా—ఆ బాబును చూద్దాం...."

"ఆ గదిలోకింకెవర్నీ రావద్దని చిన్నమ్మగారు చెప్పారు. శివరాం బాబు ఈ స్థితిలో మావంటి వారి కళ్ళబడ్డానికి చిన్నబుచ్చుకుంటాట్ట...."

కళ్యాణ్రావు తనలో తాను నవ్వుకుని ఆ గదిలో ప్రవేశించి ఆశ్చర్యపడ్డాడు.

ఆ గది శోభనం గదిలా అలంకరించబడింది.

గదిలో వేరే మనుషులెవ్వరూ లేరు.

మల్లెల వాసన గుబాళిస్తున్న మంచాన్ని సమీపించాడు కళ్యాణ్రావు. మంచంమీద మధ్యగా నాలుగు మల్లెపూలు ఒత్తుగా ఆపబడిన ఓ చీటీ....

"డియర్ కళ్యాణ్! కాసేపట్లో నేను వస్తాను. నా ఏర్పాట్లెలాగున్నాయి? అన్నీ వచ్చేక మాట్లాడుకుందాం. నువ్వు కాసేపు మంచంమీద విశ్రాంతి తీసుకో. చదవగానే ఈ చీటీ ముక్కలు ముక్కలుచేసి టాయ్లెట్లో—కొట్టేసేయ్...."

శ్యామల ఆహ్వాన మనవి!

కళ్యాణ్రావు తనువు మరోసారి నిలువెల్లా పులకరించింది.

"శ్యామా డియర్....నీ మేలు మరిచిపోలేను. నీ పరిచయం నా అదృష్టం—" అనుకున్నాడతడు.

నిజమైన ప్రేమికుడేం చేస్తాడో తను చేస్తే—నిజమైన ప్రేమ ఏం చేస్తుందో—ఆమె చూపించమంది.

గదికి అటాచ్డ్ బాతుంది. కళ్యాణ్రావు ఆమె చెప్పినట్టే చీటీ చింపిపారేసి టాయ్లెట్లో వేసి కొట్టేశాడు. తర్వాత వచ్చి మంచంమీద పడుకున్నాడు.

హాయిగా ఉందతడికి మంచంమీద!

అలాంటి పడక సుఖం అతడెన్నడూ ఎరగడు.

అటువంటి మంచంమీద పడుకోవడమే ఒక అదృష్టం.
ఆ అదృష్టానికి శ్యామల తోడవుతానంటోంది.

అందుకే ఈ గదిలో శివరాం ఉన్నాడనన్న భ్రమ కలిగించింది!

శివరాం ఏమయ్యాడు?

కళ్యాణ్రావుకంతా విచిత్రంగా ఉంది. అయితే అతడి మెదడు జరగబోయే దానిగురించే యెక్కువగా ఆలోచిస్తోంది.

అలా యెంతసేపు గడిచిందో తెలియలేదు.

ఉన్నట్లుండి మంచం పక్కనే టీపాయ్మీదున్న టెలిఫోన్ గణగణ మ్రోగింది. కళ్యాణ్రావు ఫోనందుకున్నాడు.

"కళ్యాణ్! నేను శ్యామలను మాట్లాడుతున్నాను.."
అంది ఫోన్లో గొంతు.

"శ్యామూ! ఇంకా ఎంతసేపు నే నెదురుచూడాలి?"
అన్నాడు కళ్యాణరావు.

"గదిలో తలగడ క్రింద కారు తాళాలున్నాయి. అటాచ్డ్ బాత్రూంలోంచి గ్యారేజిలోకి దారి ఉంది. కారు స్టార్టుచేస్తే గ్యారేజి తలుపులు వాటంతటవే తెరుచుకుంటాయి. నువ్వు వెంటనే బయల్దేరి వీణా థియేటర్ మీదుగా సఫారీ హోటల్ దగ్గరకు రా-చాలా అర్జంటు ...."

"ఏమిటిదంతా?" అన్నాడు కళ్యాణ్రావు.

"అంతా నిన్ను కలుసుకున్నాక చెబుతాను. ఫోన్లో ప్రశ్నలేమీ అడక్కు—వెంటనే బయల్దేరి రా—మన

కోసం నేను ముందనుకున్నకంటే మంచి ఏర్పాట్లు చేశాను...."

కళ్యాణరావు ఫోన్ పెట్టేశాడు.

"ఏమిటో అంతా చాలా సస్పెన్సుగా ఉంది—" అనుకున్నా డతడు. అయితే అతురాలా శ్యామల చెప్పి నట్లే చేశాడు.

గేటు దగ్గర దర్వాన్ అతణ్ని అడ్డగించలేదు.

కారు శరవేగంతో వీణా థియేటర్ దాటి సందు తిరిగేసరికి—అక్కడ పోలీసులతణ్ని ఆపారు.

కళ్యాణరావు ఆశ్చర్యపడ్డాడు.

"ఈ దారిలో కొందరు స్మగ్లర్సు హెరాయిన్ తీసుకుని వెడతారని కబురు తెలిసింది—" అన్నాడు పోలీసిన స్పెక్టర్.

వాళ్ళు కారంతా వెదికారు. ఏమీ దొరకలేదు. కళ్యాణరావును శోధించారు. ఏమీ దొరకలేదు.

అన్యమనస్కంగానే కారు డిక్కీని తెరిచారు.

అందులో ఉందో శవం.

కళ్యాణరావు తెల్లబోయాడు.

"వాటీస్ దిస్!" అన్నాడినస్పెక్టర్.

కళ్యాణరావుకు నోటమాటరాలేదు కానీ శవాన్నతడు గుర్తుపట్టాడు. అది శివరామది!

"వాటీజ్ దిస్!" ఇన్స్పెక్టర్ గద్దించాడు.

కళ్యాణరావుకంతా అయోమయంగా ఉంది. ఊహించని సంఘటన జరిగిపోవడంలో—అతడికి మతిపోయి నట్లుగా ఉంది.

ఎవరో శివరాంని చంపి—ఆ కేసులో తననిరికిం చాలని తెలివిగా పథకం వేశారు. ఆ ఎవరో ఎవరో

కాదు.

తను పెళ్ళాడబోతున్నాననుకున్న శ్యామల!

అతడు తేరుకుని క్లుప్తంగా జరిగింది చెప్పాడు.

“పట్టుబడ్డ ప్రతి హంతకుడూ ఇలాంటి కట్టుకథలే చెబుతాడు. అయినా నీకో అవకాశమిస్తాను. సఫారీ హోటలుకు వెడదాం పద—” అన్నాడినస్పెక్టర్.

సఫారీ హోటలు దగ్గర శ్యామల లేదు. ఆమెపైన అంతవరకూ యేమాత్రమైనా నమ్మకముంటే అప్పటితో పూర్తిగా పోయింది కళ్యాణరావుకి.

“సర్—శ్యామల నన్నింతగా నమ్మించి ద్రోహం చేస్తుందనుకోలేదు. నాకిప్పుడెవర్ని నమ్మాలో ఎవర్ని నమ్మకూడదో తెలియకుండా ఉంది. మా ఇంటి అడ్రసు చెబుతాను. అమ్మ ఉందక్కడ. ఆమెను పిలిపించండి—ప్లీజ్...” అన్నాడు కళ్యాణరావు.

ఇన్‌స్పెక్టర్ కతడి ముఖంచూస్తే జాలేసింది.

## 8

రాత్రికి రాత్రి రుక్మిణమ్మ కళ్యాణరావును కలుసుకుంది. ఆమెకు మొత్తం కథంతా వివరించి చెప్పి—

“అమ్మా! నేనమాయకుణ్ని. నన్ను నువ్వు తప్ప ఎవరూ రక్షించలేరు—” అన్నాడతడు.

జరిగింది తెలుసుకుని రుక్మిణమ్మ ముందు భోరున ఏడ్చింది. తర్వాత గుండె దిటవు చేసుకుంది.

“ఈ ఊళ్ళో నీకు మంచి స్నేహితులుంటే చెప్పు. వాళ్ళద్వారా ఏమైనా చేద్దాం—” అంది రుక్మిణమ్మ.

కళ్యాణరావు ఆమెకు గణపతి పేరు చెప్పాడు.

రుక్మిణమ్మ గణపతి యింటికి వెళ్ళి విషయం చెప్పింది.

గణపతి కంగారుపడి—"ఎక్కడో యేదో మోసం జరిగింది. ఒక ఆడపిల్ల కళ్యాణరావునింతలా మోసంచేయదు. మనం ముందామెను కలుసుకోవాలి—" అన్నాడు.

ఇద్దరూ కనకరాజింటికి వెళ్ళేసరికి అక్కడ శ్యామల ఉంది. ఆమె మెలకువగానే ఉంది.

"ఇప్పుడే పోలీసులు నన్ను ప్రశ్నించి వెళ్ళారు. ఓ గంట క్రితమే నేను పెళ్ళికి వెళ్ళి తిరిగొచ్చాను. కళ్యాణ్ అలా యెందుకు చేశాడో నాకర్థంకావడంలేదు—" అందామె విచారంగా.

ఆమె చెప్పిన ప్రకారం శివరాం కదలలేని స్థితిలో ఉన్నాడు. తండ్రి ఊళ్ళోలేడు. ఆమెకు ఎలిబీ ఉంది.

"కళ్యాణరావు హత్యలుచేసే మనిషి అనుకుంటావా నువ్వు?" అనడిగాడు గణపతి.

"లేదు. నన్నడిగితే యెవరో తెలివిగా అతడిచేత ఈ హత్య చేయించి ఉంటారని నా నమ్మకం—" అందామె.

"అలాంటవకాశం ఎవరికుంది?"

"పోలీసులు పరిశోధిస్తున్నారు. వాళ్ళే తెలుసుకుంటారు...."

"నువ్వు కళ్యాణ్‌ని మోసగించావని నేనంటాను—" అన్నాడు గణపతి.

"కళ్యాణ్ ఎగ్జిబిషన్‌లో శివరాంని కొట్టాడు. అందుకెందరో సాక్షులున్నారు. నేను శివరాంనింటికి తీసుకొచ్చాక ఓ ప్రెస్ ఫోటోగ్రాఫర్ మమ్మల్నిద్దర్నీ కలుసుకున్నాడు. శివరాం అతడితో — "నాకాస్త బలం చేకూరాలి—అప్పుడు నేనో ఆ కళ్యాణరావో ఒక్కరే మిగలాలి...." అన్నాడు. వాళ్ళిద్దరి మధ్యా యేవో గొడవలున్నాయి. బహుశా నేను కూడా ఓ కారణం

కావచ్చును. నేను శివరామ్‌ని పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాను. శివరాం ప్రవర్తన సరైనది కాదు. అతడిలో మార్పు తీసుకుని రావాలని నేను కళ్యాణ్‌ని ప్రేమిస్తున్నట్లు నటించాను. అది నా తప్పు. నా ప్రేమను సీరియస్‌గా తీసుకోవడం కళ్యాణ్ తప్పు...."

"అయితే ఏం జరిగిందంటావ్?"

"లభిస్తున్న సాక్ష్యాలను బట్టి మా యింట్లో నేనిచ్చిన చనువును కళ్యాణ్ దుర్వినియోగం చేసుకున్నాడు. నాకు సాక్ష్యాలను నమ్మాలనిపించడం లేదు. ఎవరైనా కళ్యాణ్‌ని నిరపరాధిగా నిరూపిస్తే—అతణ్ని నేను వివాహం చేసుకునేందుకు సిద్ధంగా ఉన్నాను—" అంది శ్యామల.

రుక్మిణమ్మ, గణపతి అక్కణ్ణించి కదిలారు.

"ఇప్పుడేం చేద్దాం?" అంది రుక్మిణమ్మ.

"అది మీరే చెప్పాలి—" అన్నాడు గణపతి.

"నేనేం చెబుతాను?" అంది రుక్మిణమ్మ నిస్పృహగా.

"సాక్ష్యాలన్నీ కళ్యాణరావుకు వ్యతిరేకంగా ఉన్నాయి. శ్యామల శివరాంని ముందే చంపి కారు డిక్కీలోకి మార్చేసి—ఆ విషయం యింట్లో వారెవరికీ తెలియకుండా చేసింది. అంతా శివరాం ఇంట్లోనే ఉన్నాడనుకుంటున్నారు. అయితే ఒక్కటే ఆశ ఉంది. అది హత్యా సమయం. డాక్టర్లు శవాన్ని పరీక్షించి ప్రాణం యెప్పుడు పోయిందో చెప్పగలరు. ఆ సమయంలో కళ్యాణరావుకు మంచి ఎలిబీ ఉంటే బాగుంటుంది—" అన్నాడు గణపతి.

"ఎగ్జిబిషన్నుంచి తిన్నగా యింటికొచ్చేశాడు మా

వాడు. హత్య అప్పుడే జరిగి ఉంటుంది. అంటే మా వాడు నాతోనే ఉన్నాడు. వాడి నిర్దోషిత్వానికి నేనే సాక్ష్యం—" అంది రుక్మిణమ్మ సంతోషంగా.

"మీ సాక్ష్యం చాలదు. ఇంకెవరైనా ఉంటే చెప్పండి...."

రుక్మిణమ్మ పెదవి విరిచినా సంతోషంగానే ఉంది—"హత్యాకాలం నిర్ణయమైతే మావాడు నిర్దోషిత్వం బుజువవుతుంది. కనీసం నాకు తృప్తిగా ఉంటుంది. అప్పుడు దేవుడే వాణ్ని రక్షిస్తాడు...." అని—"మీ యింట్లో శ్రీనివాసుడి విగ్రహముందా?" అందామె.

"పూజామందిరంలో ఉంది—" అన్నాడు గణపతి ఎందుకన్నట్లు.

"నేరస్థుల్ని కాపాడమని కన్నతల్లిగా కూడా నేనెవర్నీ వేడుకోను. నా కొడుకు నిర్దోషిత్వంపై నాకు నమ్మకముంది. పద—మీ యింటికి పోదాం! నా కొడుకు నిర్దోషి అయితే కాపాడమని ఆ శ్రీనివాసుణ్ని వేడుకుంటాను. ఇలాంటి పరిస్థితుల్లో నిర్దోషుల్ని ఆయనొక్కడే రక్షించగలడు...." అంది రుక్మిణమ్మ ఆవేదనంగా.

"ఎలా?" అన్నాడు గణపతి ఆశ్చర్యంగా.

"ఎలాగేమిటి? డిటెక్టివులు కేసులు పరిశోధించరూ? ఈ కేసులో ఆ శ్రీనివాసుడే నా డిటెక్టివ్—" అంది రుక్మిణమ్మ.

గణపతి ఏమీ మాట్లాడలేదు. ఆ పరిస్థితిలో ఆ కన్నతల్లి కా నమ్మకమే ఊరటగా పనిచేయగలదని అతడనుకుని ఆమెను ఇంటికి తీసుకుని వెళ్లాడు.

ఇంట్లో వాళ్ళంతా ఏం జరిగిందని కుతూహలంగా అడిగారు.

"పరిస్థితి బాగోలేదు. అంతా మన అదృష్టం—" అన్నాడు గణపతి.

"అంటే?" అనడిగింది గణపతి తల్లి.

"మనవాడి అదృష్టమంతా పోస్టుమార్టం రిపోర్టుమీద ఆధారపడి వుంది. సమయానికి పోలీసు డాక్టరులేడు. ఉదయం ఏడింటికి పోస్టుమార్టం చేస్తారు—" అన్నాడు గణపతి.

రుక్మిణమ్మ యెవరితోనూ యెక్కువగా మాట్లాడలేదు. ఎవరూ ఆమె నెక్కువగా మాట్లాడించలేదు.

ఆమె స్నానం చేసింది. గణపతి తల్లి యిచ్చిన పట్టు బట్టలు కట్టుకుని పూజామందిరంలోకి వెళ్ళింది.

"పూజ అయ్యాక పోలీసుస్టేషనుకు మరోసారి వెడదాం—" అన్నాడు గణపతి ఆమెతో.

"మావాడు విడుదలై యింటికొచ్చి నన్ను పలకరించేదాకా నా పూజ పూర్తికాదు" అంది రుక్మిణమ్మ.

దుఃఖావేశంలో ఉన్నదని ఆమెను గణపతి డిస్టర్బ్ చేయలేదు.

ఆమె పూజగదిలో పూజా మందిరంముందు ధ్యాన నిమగ్నురాలై కూర్చుని ఉంది.

గంటలు గడిచిపోతున్నాయి.

ఆమె కదలడంలేదు.

ఆమెను పలకరించాలంటే గణపతి భయపడ్డాడు. నిశ్చల సమాధిలో సర్జీవురాలిగా కనబడుతోందామె.

సరిగ్గా ఎనిమిదిగంటలకామె కళ్ళు తెరిచి-"వచ్చేవా

కళ్యాణ్ !" అంది. అదే సమయానికి కళ్యాణరావింట్లో ప్రవేశించి—"అమ్మా!" అన్నాడు.

గణపతి యింట్లో వారికి కలిగిన ఆశ్చర్యమింతా అంతా కాదు.

• • •

శివరాం కనకరాజును బ్లాక్ మెయిల్ చేస్తూ శ్యామల జీవితం నాశనం చేశాడు. తండ్రీకూతుళ్ళు కలిసి అతడి పీడ వదిలించుకోవాలనుకుని పథకం వేసి కళ్యాణరావు నిరికించారు. అయితే హత్యచేసిన శ్యామల అతి తెలివికి పోయింది. ప్రతిఘటించలేని స్థితిలో ఉన్న శివరాంనామె సునాయాసంగా కత్తిపోటుకు గురి వేసింది. కానీ వెంటనే ప్రాణం పోకుండా—అతడు కొస ప్రాణంతో ఉండేలా గాయపర్చి కారు డిక్కీలోకి తోసేసింది. ఆ ప్రక్రియ నామె ఓ ఇంగ్లీషు క్రైమ్ నవల్లో చదివింది. ఆమె ఆశించిన ప్రకారం శివరాం పదిన్నర ప్రాంతాల మరణించాలి. కానీ అతడిదెంత గట్టిప్రాణమో—పోస్టు మార్టం టైముకు కూడా అతడు పూర్తిగా చావలేదు. ఆ సమయంలో అతడి వంట్లో ఓపికెలా వచ్చిందో తెలియదు. చచ్చినవాడితో సమానమై కోమాలో ఉన్న వ్యక్తి అసాధారణ శక్తితో—జరిగిందంతా చెప్పి కన్నుమూశాడు. అతడి మరణ వాఙ్మూలం లేకపోతే—ఈ ప్రపంచంలోని యే శక్తీ కూడా కళ్యాణరావుని రక్షించ గలిగేదికాదు. పోలీసులు వెంటనే కళాణరావుని వదిలి పెట్టేశారు.

కొడుకు తిరిగి వచ్చేడని రుక్మిణమ్మ ఉప్పొంగి పోతోంది.

అద్భుతం జరిగి తను తప్పించుకున్నానని కళ్యాణరావు సంతోషపడుతున్నాడు.

"శ్రీనివాసుడా! కలకాలం నీ డిటెక్షన్ ఇలాగే కొనసాగించి—అమాయకులను రక్షిస్తూండు—" అని మనసులో భక్తిశ్రద్ధలతో ప్రార్థించుకున్నాడు గణపతి.

—: అ యి పో యిం ది :—

# గొప్పవాడు

## గొట్టిపాటి నాగేశ్వరరావు

శ్రావణ్ జైలు సూపరింటెండెంట్ గది నుండి బయటకు వచ్చాడు.

శ్రావణ్ స్నేహితుడు సత్యాపతిపై హత్యానేరం మోపబడి జైల్లో ఉన్నాడు. సత్యాపతిని చూసి, మాట్లాడి పోదామని శ్రావణ్ వచ్చాడు. శ్రావణ్ సూపరింటెండెంట్ గారి వద్దనుండి పర్మిషన్ తీసుకొన్నాడు. ఓ పోలీసు శ్రావణ్‌ను సత్యాపతి ఉన్న సెల్ వద్దకు తీసుకువచ్చి వెళ్ళిపోయాడు.

శ్రావణ్‌ను చూసేపాటికి సత్యాపతికి ప్రాణం లేచి వచ్చింది. శ్రావణ్ తనకున్న ఆప్తమిత్రులలో ఒకడు. తన బాధను అర్థం చేసుకుంటాడనే నమ్మకం వుంది. తన ఆవేదన శ్రావణ్‌తో చెప్పుకోవాలి. తనను అందరూ నేరస్తుడిగా చూస్తున్నారు.

"ఈ హత్య నేను చేయలేదురా శ్రావణ్! అందరూ

నన్ను దోషి అంటున్నారు. నాకు చావాలనిపిస్తూంది. అవమానం భరించలేక" కళ్ళనీళ్ళు పెట్టుకొని అన్నాడు సత్యాపతి.

"నాకు తెలుసురా సత్యా! నీ వీ హత్య చేయలేదు. ఈ హత్య చేసింది వేరే వ్యక్తి!"

సత్యాపతి అదిరిపడ్డాడు. మిత్రుని మాటలు అతన్ని ఆశ్చర్యంలో ముంచాయి. ఇంతవరకు ఒక్కరు కూడ తాను నిర్దోషి అని అన్నవారు లేరు. చివరకు తన అన్నా, వదినలు కూడ తనను హంతకుడనే అంటు న్నారు. తనపై వ్యతిరేకంగా కోర్టులో సాక్ష్యం చెప్ప టానికి చుట్టుప్రక్కలవారు. తన స్నేహితులైన వారే సంసిద్ధంగా ఉన్నారు. తనకు కేసులో శిక్షపడటం ఖాయం అని తన లాయర్ భుజగోవిందం అన్నాడు. అలాంటిది శ్రావణ్ వేరే వ్యక్తి అనటం వింతగా వుంది.

"వేరే వ్యక్తా ఎవరు? నీ కెలా తెలుసు?"

"నాకు తెలుసు! అంతే!"

"అదే ఎలా?"

"తెలుసుకునే మార్గం నాకు తెలుసు. అలా తెలుసు కున్నాను."

"అదేమిటో చెప్పు! నేనెంతో బాధపడుతున్నాను."

"చెప్తాను. నీకు అర్థంకాకపోవచ్చు!"

"అర్థం చేసుకోటానికి ప్రయత్నిస్తాను."

"సరే! చెపుతాను. జాగ్రత్తగా అర్థంచేసుకోటానికి ప్రయత్నించు. నాకు మెడిటేషన్ చేయటం చిన్నప్ప నుండి అలవాటు. ప్రతిరోజూ అర్థరాత్రి 2 గంటలపాటు

మెడిటేషన్ చేస్తుంటాను. మెడిటేషన్ వలన వాళ్లో కొంత మార్పు వచ్చింది. ప్రతి మనిషిలోను సెవెన్ బాడీస్ ఉంటాయని మన ప్రాచీన యోగశాస్త్రం చెపుతున్నది. అవి—

1. ఫిజికల్ బాడి 2. ఈథరిక్ బాడి 3. ఆస్ట్రల్ బాడి 4. మెంటల్ బాడి 5. స్పిరిచువల్ బాడి 6. కాస్మిక్ బాడి 7. నిర్వానిక్ బాడి.

వీటిని ధ్యానంలో ట్రాన్స్ సెండింగ్ చేయగలిగితే, అలా చేయగలిగినవారు అన్నీ తెలుసుకోగలరు. మొదటి శరీరం తప్ప మిగిలిన శరీరాలు అన్ని సూక్ష్మ శరీరాలు.

మనిషి నుండి ఆస్ట్రల్ బాడి శరీరం నుండి విడబడి బయటకు వెళ్ళి జరిగిన సంఘటనలను తెలుసుకుంటుంది. ఆ సమయంలో ధ్యానం చేస్తుండాలి. జరిగిన సంఘటనలు కలలో కనిపిస్తున్నట్లు కనిపిస్తుంటాయి. అయితే కలలో చూసిన దృశ్యాలను వెంటనే మర్చిపోతుంటాము. మెడిటేషన్‌లో చూసిన దృశ్యాలను మర్చిపోలేము.

ఇదంతా నీకు నమ్మశక్యంగా లేదు కదూ! అందుకే ఈ న్యూస్ పేపర్ కూడ తెచ్చాను; ఈ న్యూస్ పేపర్ వారం రోజుల క్రిందటిది.

ఇందులో నీకు చెప్పిన విషయం గురించే ప్రొఫెసర్ చార్లెస్ మెక్రిరే రీసెర్చి చేస్తూ కొన్ని విషయాలు వెల్లడించారు. ఆక్స్‌ఫర్డ్ యూనివర్శిటీలోని 'యిన్‌స్టిట్యూట్ ఆఫ్ సైకో ఫిజికల్ రిసెర్చి'లో పనిచేస్తున్నారు చార్లెస్ మెక్రిరే. వారు కూడ సూక్ష్మ శరీరం గురించి కొంత అనుభూతి పొందారు.

చరిత్ర కొన్ని నగ్న సత్యాలు చెపుతున్నది. జూలియస్ సీజర్ రేపు చనిపోతాడనగా ఆ రాత్రి అతని సతీమణికి రేపు సీజర్‌కు అపకారం జరబోతున్నదన్నట్లు కల వచ్చింది. మరు రోజు ఆమె సీజర్‌ను కోర్టుకు వెళ్ళకుండా ఆగమన్నది. కాని ఆయన ఆమె మాటలను కొట్టి పారవేశాడు. క్రూరంగా హత్యచేయబడ్డాడు. ఆమెకు కలలో జరగబోయేది కనిపించింది.

అలాగే ప్రముఖ సైంటిస్టు ఐన్‌స్టీన్ యాటమ్స్‌ను ఎలా కనుగొనగలిగాడంటావు? అతనికి కలలో కొన్ని పాములు తోకను నోటితో పట్టుకొని గుండ్రటి ఆకారంలో దొర్లుతున్నట్లు కలవచ్చింది. వెంటనే యాటమ్స్ మోలిక్యూల్లో తిరుగుతుంటాయనే సత్యం లోకానికి చెప్పాడు.

వారికి ఈ సూపర్ సెక్‌సేషనల్ పవర్ యెలా వచ్చింది? వారు ఒకవిధంగా ఆయా విషయాలపై ఒక విధంగా ధ్యానంచేశారు. వారికి ఫ్యూచర్ తెలిసింది. కాని నాకు పాస్టుమాత్రమే తెలుస్తుంది.

ఓ అర్థరాత్రి ధ్యానంలో వుండగా క్రిందపడిపోయాను. రెండు గంటలకు మెలకువవచ్చింది. నాలో యేదో మార్పు వచ్చినట్లపినిపించింది. శరీరం అకులా వణకసాగింది. నాలో నుండి ఓ తేజస్సు కళ్ళముందు నిలిచినట్లు ఫీలింగ్ కలిగింది. నా ప్రేరణతో ఆ తేజస్సు సుదూర తీరాలకు ప్రయాణిస్తున్నట్లూ, నాకు అంతా కళ్ళకు కట్టినట్లుందేది.

నాలో మానవాతీత శక్తులు వచ్చినట్లు గుర్తించాను. నా శక్తిని టెస్టు చేయాలనుకున్నాను.

సుమతి అన్నయ్య లోకేశ్వరరావు ఓ రోజు యింటికి వచ్చాడు. తన కుమార్తె సీత వివాహం నిశ్చయమైనట్లు చెప్పాడు. పెళ్ళికుమారుడు సూర్యారావుకి ఓ.యన్.జి. సి.లో ఉద్యోగమట, లక్షరూపాయల కట్నం యివ్వబోతున్నట్లు చెప్పాడు.

ఆ రాత్రి ధ్యానంలో కూర్చున్నాను. సూర్యారావు ఆకారం కలలో చూస్తున్నట్లు కనిపించింది. అప్పుడు అతని ప్రక్కన లత అనే యువతికూడ కనిపించింది. ఈ లక్షరూపాయలు తీసుకుని సూర్యారావు, లత బొంబాయి వెళ్ళాలని ప్లాన్ వేస్తున్నట్లు నాకు అనిపించింది. నిజమో! కాదో తెలుసుకోమన్నాను. లోకేశ్వరరావు మద్రాసు వెళ్ళాడు. నేను చెప్పింది నిజమేనన్నాడు. పెద్ద గండం నుండి రక్షించావని చెప్పాడు."

సత్యాపతి శ్రావణ్ చెప్పేది విచిత్రంగా విన్నాడు. కాని వెంటనే నిస్పృహాతో పెదవి విరిచాడు.

"ఏమోరా! నీవు చెప్పేది నమ్మశక్యంగాలేదు."

"అరే పతి! నీకు నా మాటలమీద నమ్మకం కలగ లేదనుకుంటాను. నీ ఎదుట ఓ చిన్న తమాషా చేయను?"

"ఏమిటది?"

"అలా చూడు! మనకు దూరంగా ఓ సెంట్రీ కాపలా కాస్తూ అటు యిటు తిరుగుతున్నాడు. అతను మనల్నే చూస్తున్నాడు. అతను నాకు యిచ్చిన టైం అయిపోయింది, బయటకు వెళ్ళమని చెప్పాలని వస్తున్నాడు. అతన్ని నీ కళ్ళ ఎదుటే ఓ ఆట పట్టిస్తాను. అప్పుడైనా నమ్మకం కలుగుతుంది" అన్నాడు.

వారికి పదిగజాల దూరంలో ఓ సెంట్రీ తుపాకి భుజాన పెట్టుకొని వారివైపు వస్తున్నాడు.

శ్రావణ్ తన కుడిచేయి చూపుడు వేలును భృకుటి (కనుబొమ్మల) మధ్యభాగమున పెట్టుకొని, కన్నులు సగం మూసి ధ్యానం చేయటం మొదలు పెట్టాడు. అలా మొదలుపెట్టిన అరనిమిషంలోనే అతని శరీరం శిలలా ఎక్కడా చలనంలేకుండా అయింది.

వారినే చూస్తూ వారివైపు వస్తున్న సెంట్రీ కొద్ది దూరంలో ఆగిపోయాడు. అతని కళ్ళు శ్రావణ్ మీద కేంద్రీకరింపబడ్డాయి. అతను విస్మయంతో నోరు వెళ్ళ బెట్టాడు. రెండు నిముషాలు గడిచాయి.

"బాబోయ్! మంటలు......మం......టలు,..........

అతను మండిపోతున్నాడు" అని అతను అరవసాగాడు.

చేతుల మీదుగా తుపాకి జారిపోయింది. సెంట్రీ పిచ్చిపట్టినట్లు చిందులు వేయసాగాడు. అతని అరుపులు విన్న సూపరింటెండెంట్, మరికొందరు పోలీసులు కంగారుగా బయటకు పరుగున వచ్చారు.

"ఎక్కడ మంటలు?" ఓ పోలీసు సెంట్రీని అడిగాడు.

శ్రావణ్ మామూలు స్థితికి వచ్చాడు.

"పలకవేం? మంటలేవి?" పోలీసు మరలా అన్నాడు.

శ్రావణ్ సత్యాపతితో నవ్వుతూ మాట్లాడు తున్నాడు.

పిచ్చిపట్టినట్లు చిందులు వేస్తున్న సెంట్రీ ఆగిపో యాడు. కొన్ని సెకండ్ల క్రితం శ్రావణ్ అతని కళ్ళకు మండుతున్నట్లు మంటలలో కనిపించాడు. ఆశ్చర్యం!

ఇప్పుడా మంటలు మాయమైనాయి. మామూలు మనిషిగా ఉన్నాడు. కళ్ళు నలుపుకొని మరోసారి శ్రావణిని ఎగాదిగా చూశాడు. ఎప్పటిలాగే ఉన్నాడు. మంటలు లేవు.

“ఏమిటి నీకేమయింది? పిచ్చిగాని పట్టలేదు కదా? మంటలని అరిచావు కదా? ఎక్కడ చెప్పు?” గద్దించాడు సూపరింటెండెంట్ గారు సెంట్రీని.

సెంట్రీ బిక్కముఖం చేశాడు.

“సార్! మంటలు యిప్పుడు లేవు?” చిన్నగా గొణగసాగాడు.

“లేవా? ఏమైనట్లు? నీ బాబు వచ్చి నీళ్ళు చల్లి ఆర్పివేశాడా?” సహజమైన కోపంతో అరిచాడు.

“ఏమో సార్! అంతా మాయగా వుంది. ముద్దాయితో మాట్లాడుతున్న ఆ సార్ క్షణం ముందు మంటలలో తగులబడి పోతున్నట్లు కనిపించాడు. ఇప్పుడు మామూలుగానే ఉన్నాడు.”

“ఛా....నోర్మూయ్! ఆ సార్ మండటమేమిటి? అంతలోనే మామూలుగా కనిపించటమేమిటి? ఈమధ్య నీవు తిక్కతిక్కగా మాట్లాడుతున్నావు. సెలవు యివ్వటం లేదని నామీద గుర్రుగా వున్నావు. కేర్ లెస్ గా ప్రవర్తిస్తున్నావు. బి హేవ్ యువర్ సెల్ఫ్! యిలాంటి తిక్క చేష్టలు మరోసారి చేశావంటే ఉద్యోగం ఊడగొట్టి విశాఖపట్టణం పిచ్చాసుపత్రిలో చేర్పిస్తాను.”

“సారీ సార్!” సెంట్రీ దిగులుగా శాల్యూట్ చేశాడు. ఆయన లోపలకు వెళ్లాడు.

అంతా సినిమా చూస్తున్నట్లు చూస్తున్న సత్యాపతికి అంతటి విషాదంలోను ఓ దరహాసం పెదవులమీద మొలకెత్తింది.

"రియల్లీ ఫెంటాస్టిక్! అవునా యిదెలా సాధ్యం?"

"ఇది చాలా సింపుల్. మెడిటేషన్ ద్వారా అతని మైండ్‌ని ముందట కంట్రోల్ చేయగలను. తర్వాత నేను మందుతున్నట్లు అతని మైండ్‌కు సజెషన్ యిస్తాను. ఇదంతా యిక్కడనుండే చేస్తాను. అయితే యిది అంతా భ్రమ మాత్రమే!

ఇంకా నీకు నమ్మకం కలగలేదనుకుంటాను. నీలో యిన్నాళ్ళు తిరిగినవాడు, వున్నట్టుండి ఒక్కసారిగా గొప్ప శక్తులు సంపాదించాడంటే నీకే కాదు ఎవ్వరికీ నమ్మబుద్ధి కాదు" అన్నాడు శ్రావణ్.

"ఇప్పటివరకూ నీవు చెప్పేది యేదోలా వున్నా ప్రత్యక్షంగా యిప్పుడు జరిగిన సంఘటనలన నమ్మకం కలగసాగింది. అది సరే శ్రావణ్! నేను యిప్పుడు నడిసముద్రంలో చిల్లిపడిన నావలో కొట్టుకులాడుతున్నాను. నన్ను నీవు ఎలా రక్షించగలవు?" అడిగాడు సత్యాపతి.

"నన్ను నీవు నీ తరఫు సాక్షిగా కోర్టులో నీ లాయర్‌ను ప్రవేశపెట్టమను! సాక్ష్యం చెపుతాను. హత్య ఎలా జరిగింది చెపుతాను. నిన్ను రక్షిస్తాను."

"ఇంతకూ హత్యచేసిన వ్యక్తి ఎవరు?"

"అతనెవరో నాకూ తెలియదు. కాని నేను అతన్ని చూడగలను."

మరలా డీలా పడిపోయాడు సత్యాపతి.

"అలా నీరు కారిపోకు! వాడి ముఖాన వాడి పేరు లేదు. వుంటే చెప్పగలిగే వాడినే! వాడిని మాత్రం నిన్ను యిప్పుడు చూస్తున్నట్లు చూడగలను మరలా."

"వాడిని పట్టుకురాగలవా?"

"అదీ అసాధ్యమే! ఎందుకంటే వాడు ఒకచోట ఉండడు. నేను మంచి చిత్రకారుడిని. నేను వాడి బొమ్మ గీస్తాను. కోర్టులో సాక్ష్యం చెపుతూ గీసిన బొమ్మ కోర్టువారి ముందుంచుతాను. పోలీసులు బొమ్మ సహాయంతో వాడిని పట్టుకోగలరు నేరం బయట పడవచ్చు!"

"సరే! మరో రెండు రోజులలో కేసు ట్రయల్ బిగిన్ కాబోతున్నది. నా లాయర్ భుజగోవిందంతో నీ గురించి చెపుతాను. నీ సాక్ష్యం చెప్పించమని ప్రాధేయ పడతాను."

"అలాగే! నిన్ను కోర్టులో కలుసుకుంటాను."

"థాంక్యూ రా! యిన్నిరోజులు నిద్రకూడ పోలేదు. ఈ రోజు హాయిగా పడుకుంటాను."

"యస్! హాయిగా గుండెలమీద చేయి వేసుకొని నిద్రపో! వెళ్ళివస్తా!"

శ్రావణ్ వెళ్ళిపోతుంటే సత్యాపతి ఆరాధనగా చూస్తుండిపోయాడు.

గొప్పవాళ్ళు యుగానికి ఒక్కరో, ఇద్దరో పుడుతుంటారు. వారిలో లెక్కింపదగినవాడు శ్రావణ్ అనుకున్నాడు సత్యాపతి.

టైం పదిన్నర అయింది. కోర్టు హాలు జనంతో క్రిక్కిరిసి వుంది. జడ్జిగారు ఆ రోజు సత్యాపతి కేసు విచారణకు తీసుకోబోతున్నారు.

న్యాయమూర్తి వచ్చి తన సీటులో ఆశీనులయ్యారు. అందరూ వినయంగా లేచి నిలబడ్డారు. న్యాయమూర్తి కోర్టుకు నమస్కరించి కూర్చున్నారు. వారితోపాటు అందరూ కూర్చున్నారు.

కోర్టు హాలు నిశ్శబ్దంగా ఉంది.

మొదటి సాక్షిగా పబ్లిక్ ప్రాసిక్యూటర్ సురేంద్ర కోమలిని ప్రవేశపెట్టారు.

కోమలి ప్రమాణం చేసి చెప్పసాగింది:

"చనిపోయిన పుణ్యవతి, సత్యాపతి భార్యాభర్తలు. వారి ప్రక్క యింటిలోనే నేను, నా భర్త పిల్లలు వుంటున్నాము. పుణ్యవతి నా స్నేహితురాలు. ఎంతో మంచిది. వారి పెళ్ళయి మూడు సంవత్సరాలే అయింది.

పెళ్ళయిన నాటినుండి భార్యాభర్తలు తగవులాడు కుంటుండేవారు. సత్యాపతికి పుణ్యవతికి పెళ్ళిచేసు కోవటం యిష్టంలేదు. కట్నం యింకా యెక్కువ తీసు కోవాలని సత్యాపతిగారి అభిప్రాయం. కాని సత్యాపతి గారి తల్లి ముత్యాలమ్మ పుణ్యవతినే చేసుకోమని పట్టు బట్టింది. పుణ్యవతి తండ్రిగారు ధర్మారావుగారు సత్యా పతికి యాభైవేల కన్నా యెక్కువ యివ్వలేనన్నాడు. పెళ్ళిచేసుకోక తప్పలేదు సత్యాపతిగారికి.

పుణ్యవతి తండ్రి యీ మూడు సంవత్సరాలలో మంచి

మంచి సెంటర్స్‌లో ఎపార్టుమెంట్స్ కట్టించి లక్షలు గడించారు. అది సత్యాపతిగారికి భార్యపై కక్ష పెరగటానికి కారణమైంది. రోజూ పుణ్యవతిని హింసిస్తూండేవాడు. అప్పుడప్పుడు చేయి కూడ చేసుకునేవాడు.

ఒకటి రెండుసార్లు 'మీ నాన్నగారివద్దనుండి రెండు లక్షలు తీసుకొనిరా! లేకపోతే బ్రిడ్జిమీదనుండి నీటిలోకి తోయటం ఖాయం!' అని అంటుండేవాడని పుణ్యవతి చెప్పింది.

ప్రక్క యింటిలో వున్న మాకు వారి మాటలు స్పష్టంగా వినిపించేవి—పుణ్యవతి నాతో—'మా నాన్నగారు పిసినారి, నా భర్త మొండిఘటం. మా నాన్నకు నేను ఒక్కతినే సంతానం కదా! అంత డబ్బు వుంది. రెండు లక్షలు యిస్తే ఏం పోయింది? మావారు కూడ ఏదోక బిజినెస్ చేసుకుంటారు కదా? తనకు వచ్చే పదిహేను వందల రూపాయలతో సంసారం లాగటం కష్టం అంటున్నారు. వారిద్దరి మధ్యా నేను నలిగిపోతున్నాను. వదలమంటే పాముకు కోపం కరవమంటే కప్పకు కోపం. ఎలా బ్రతకాలో? ఏమిటో?' అనేది.

అడగ్గా అడగ్గా చివరకు ఒక లక్షరూపాయలకు నగలు కొనిపెట్టటానికి తన అంగీకారాన్ని తెలిపాడు పుణ్యవతి నాన్నగారు. అంత డబ్బు క్యాష్ రూపంలో యివ్వటం అతనికి యిష్టంలేదు. సత్యాపతి యెక్కడ ఆ డబ్బు ఖర్చుచేస్తాడోనని భయం ఆయనకు.

అన్నట్లుగానే ధర్మారావుగారు లక్షరూపాయల నగలు కొనిపెట్టారు. చనిపోయిన రాత్రి యిద్దరూ ఒకే గదిలో పడుకున్నారు. తెల్లవారుజామున పనిమనిషి

'గదిలో పుణ్యవతి చనిపోయింది' అని కేకలు పెట్టింది. లేచి చూశాము.

ఆమె చచ్చిపడి వుంది. శరీరం నిండా కత్తిపోట్లు. నగలు అపహరింపబడ్డాయి. ఆమె భర్త సత్యాపతి రక్తపు బొట్టులతో చేతిలో కత్తితో ఉన్నాడు. ఆయనకు మినహా మరొకరి అవకాశం లేదు" అని ముగించింది.

తర్వాత ధర్మారావుని బోను ఎక్కించారు సురేంద్రనాథ్.

ధర్మారావు కూతురు చనిపోయిందనే దుఃఖంతో కొద్దిసేపు మాట్లాడలేక పోయాడు. తర్వాత బావురుమని ఏడ్చాడు.

"నాకు కూతురు పుణ్యవతి ఎలాగో అల్లుడు సత్యాపతి అలాగే ననుకున్నాను. డబ్బుకోసం భార్యను యింత ఘోరంగా చంపుతాడని ఊహించలేదు. నన్ను పుణ్యవతి పెళ్ళయిన నాటినుండి డబ్బు అడుగుతూనే ఉండేది. అప్పటికి అప్పుడప్పుడు పంపేవాడిని.

ఓ రోజు వచ్చి రెండు లక్షలు యివ్వండి! అల్లుడు గారు వ్యాపారం చేస్తారట అని అన్నది. నాకు అతనికి అంత డబ్బు యివ్వాలనిపించలేదు. వ్యాపారంలో డబ్బు పోగొట్టుకొని మరలా అడుగుతుంటాడు. వ్యాపారం చేయటం నాకు యిష్టంలేదు. అందుకే డబ్బు నా అల్లునికి యివ్వదలుచుకోలేదు.

పుణ్యవతికి లక్ష రూపాయలు పెట్టి నగలు చేయించి నగలను అల్లునికి యివ్వవద్దని జాగ్రత్త చెప్పాను. జీవితంలో యెప్పుడూ వాటిని తీయనని, ఎవ్వరికీ యివ్వనని

ఆమె చేత పట్టు కూడ వేయించుకున్నాను. ఆ నగలే ఆమె ప్రాణాలు తీశాయి. నగలకోరకు ఆమెను చంపాడు. నగలను దాచాడు దుర్మార్గుడు—"

మూడవ సాక్షి లక్ష్మీనారాయణను ఎక్కించాడు పబ్లిక్ ప్రాసిక్యూటర్ గారు.

"సత్యాపతి నా స్నేహితుడు. సత్యాపతి యింటి వెనుక యింటిలో నేను ఉంటున్నాను. సత్యాపతికి నేను రెండువేల రూపాయలు యివ్వాలి. అంతకు ముందు రోజు అంటే పుణ్యవతి చనిపోయిన ముందు రోజు డబ్బు యివ్వమన్నాడు. నేను ఆ రాత్రికి ఇస్తానన్నాను.

నేను మరు రోజు ఆరు గంటలకే కేంపుకు వెళ్ళాలి. అందుకే ఆ రాత్రి పదిగంటల సమయంలో సత్యాపతి ఇంటికి వచ్చాను. ఆ సమయంలో ఇద్దరూ ఘర్షణ పడుతున్నారు.

సత్యాపతి ఆమె నగలను ఇవ్వమంటున్నాడు. మంచి వ్యాపారం ఒకటున్నది, అందులో భాగం కలవమని సత్యాపతి స్నేహితుడు అడుగుతున్నట్లు చెప్పాడు. ఆమె ససేమిరా ఇవ్వనంటున్నది. ఇలాంటి అవకాశం మరోసారి రాదు. నగలు యెప్పుడైనా కొనవచ్చు అంటున్నాడు. ఆమె అంగీకరించటంలేదు. నేను అతనికి డబ్బు ఇచ్చి వెంటనే వచ్చాను" అన్నాడు.

తర్వాత పనిమనిషి లక్ష్మిని విచారించాడు పబ్లిక్ ప్రాసిక్యూటర్ గారు.

"నా పేరు లక్ష్మి. పుణ్యవతమ్మగారి ఇంటిలో రెండు సంవత్సరాలనుండి పనిచేస్తున్నాను. తెల్లవారుజాము

నాలుగున్నర ఐదుగంటల సమయంలో ఆరియింటికి వెళ్ళాను. అప్పుడు తలుపులు దగ్గరకు వేసి వున్నాయి. సత్యపతి అయ్యగారి చొక్కా నిండా నెత్తురు, చేతుల నిండా నెత్తురు. నేను భయపడిపోయాను. అమ్మగారు గదిలో ఒక మూలన కత్తిపోట్లతో చచ్చి పడివున్నారు. నేను కేకలు పెట్టాను. ప్రక్క ఇళ్ళలోనివారు వచ్చారు. పోలీసులకు చెప్పాను."

పబ్లిక్ ప్రాసిక్యూటర్ గారు మరో సాక్షికి ఎగ్జామినేషన్ చేశారు. వారి ఫ్యామిలీ డాక్టర్ వీరభద్రరావు డాక్టర్ తన సాక్ష్యంలో ఇలా చెప్పారు:

"సత్యాపతి స్వతహాగా చాలా మంచివాడు. భార్యతో చాలాసార్లు తన హాస్పిటల్ కు వచ్చాడు. పుణ్యవతి, అతను క్షణం కూడ సఖ్యతగా వుండేవారు కాదు. పుణ్యవతి చెప్పేది సత్యాపతి రాత్రిపూట వున్మాదిగా ప్రవర్తిస్తుంటాడని. అతనికి నిద్రలో నడిచే అలవాటు కూడా వుందని చెప్పింది. నేను అతని మైండ్ ప్రశాంతంగా వుండటానికి టాబ్ లెట్స్ కూడ యిచ్చేవాడిని. ఆ బిళ్ళలు వాడిన తర్వాత అతను బాగానే వుంటున్నాడని అన్నది."

"అంటే వున్మాదం మగలా రావటానికి అవకాశం వున్నదా?" పబ్లిక్ ప్రాసిక్యూటర్ గారి ప్రశ్న.

"మైండ్ బాగా డిస్టర్బ్ అయితే అతను అలాగే ప్రవర్తించవచ్చు! ఒక సమస్యను గురించి తీవ్రంగా ఆలోచించటం మెంటల్ షాక్ తగిలినప్పుడు ఈ లక్షణాలు రావచ్చు! అప్పుడు అతను హత్యచేసినా ఆశ్చర్యపడవలసిన పనిలేదు."

కోర్టువారు అప్పటివరకూ చెప్పిన సాక్ష్యాధారాలతో సత్యాపతే ఈ హత్య చేశాడని నిర్ధారణకు వచ్చారు. హత్యకు ఉపయోగించిన కత్తిపై అతని వ్రేలిముద్రలే వున్నాయి. సగం కోసం సత్యాపతి ఈ హత్య చేశాడని నమ్మారు.

న్యాయమూర్తి సత్యాపతిని అడిగాడు.

"నీవేమయినా చెప్పవలసినది వుందా?"

"నేను హత్య చేయలేదు."

"అలా అంటే సరిపోదు. వున్న సాక్ష్యాలన్నీ నీకు వ్యతిరేకంగా చెపుతున్నాయి. అలాంటప్పుడు ఏ ఆధారం లేకుండా నేను హత్యచేయలేదంటే శిక్షనుండి తప్పించుకోలేవు. నీవు చెప్పేదానికి సరియైన ఆధారం చూపించాలి!"

"యువరానర్! నేను విన్నవించుకునేది ఒక్కటే. ఈ కేసులో నా తరఫున సాక్షిగా నా మిత్రుడు శ్రావణ్‌ను విచారించునట్లు అనుమతి కోరుతున్నాను."

"ఇట్స్ ఆల్ రైట్" న్యాయమూర్తి అనుమతించాడు.

శ్రావణ్ బోను ఎక్కాడు.

"దేవునిమీద ప్రమాణంచేసి అంతా నిజమే చెపుతాను. అబద్ధం చెప్పను" ప్రమాణం చేయమని అడిగాడు కోర్టు గుమస్తా.

"దేవునిమీద ప్రమాణంచేసి అంతా నిజమే చెపుతాను. అబద్ధం చెప్పను" అన్నాడు శ్రావణ్.

డిఫెన్సు లాయర్ భుజగోవిందం అడిగాడు.

"నీ పేరు?"

"శ్రావణ్!"

"ఈ కేసును గురించి మీకేం తెలుసు?"

"సత్యాపతి అందరూ అనుకుంటున్నట్లు హంతకుడు కాదు. దుర్మార్గుడు కాదు. భార్యతో కీచులాడే మన స్తత్వం కలవాడు కావచ్చునేమోగాని, భార్యను క్రూరంగా హత్యచేసి ఆమె నగలు దొంగిలించి అమ్ము కొని హాయిగా బ్రతకాలనుకునే క్రిమినల్ కాదు.

ఆరోజు రాత్రి యిద్దరూ పదిన్నరవరకూ కీచులాడు కున్నారు. తరువాత యిద్దరూ చెరో బెడ్ మీద పడు కున్నారు. సత్యాపతి పడుకున్న గంటకే గాఢనిద్రలోకి జారుకున్నాడు.

అంతలో ఓ వ్యక్తి ఆ ఇంటిముందుకు వచ్చాడు. తన వద్దనున్న తాళాల గుత్తితో ఇంట్లోకి ప్రవేశించాడు. అతను అంతకుముందు భార్యాభర్తలు నగలకొరకు తగవు లాడుకోవటం చూశాడు. అప్పుడే అతనికి పుణ్యవతి నగలపై కన్నుపడింది.

తలుపులు తెరుచుకొని అతను వారి బెడ్ రూంకి వచ్చాడు. సత్యాపతి ముక్కువద్ద క్లోరోఫామ్ ఉన్న హేండ్ కర్ఛీఫ్ వుంచాడు. అతను కొన్ని సెకండ్లలోనే మత్తులోకి జారుకున్నాడు. అతను పుణ్యవతి వద్దకు వెళ్ళ సాగాడు.

చీమ చిటుక్కుమంటేనే మేలుకుంటుంది పుణ్యవతి. ఎవరో వ్యక్తి తనవద్దకు రావటంచూసి కెవ్వుమని అరవ బోయింది. వెంటనే అతను ఆమె నోరు గట్టిగామూశాడు. ఆమె అతన్నుండి విడిపించుకోవటాని ప్రయత్నించింది. చేతిని గట్టిగా కరిచింది.

అతను వెంటనే ప్యాంటు జేబులోని బటన్ నైఫ్ బయటకుతీసి ఆమె గుండెలలో గుచ్చాడు. రక్తం చిమ్మి అతనిమీద పడింది. ఆమె యింకా గింజుకుంటూనే వున్నది. అతను పిదారు పోట్లు పొడిచాడు. ఆమె అచేతనమయింది. అతను గబగబా నగలను దొంగిలించుకొని ప్యాంటు జేబులో దాచాడు.

తర్వాత సత్యాపతి వద్దకు వచ్చాడు. అతని వస్త్రాలు తాను ధరించి, తన రక్తపు మరకల వస్త్రం అతనికి వేసి, హత్య చేయటానికి వినియోగించిన కత్తిపై తన చేతి వ్రేలిముద్రలు తుడిచి, సత్యాపతి చేతి వ్రేలిముద్రలు పడేలా అతని చేతిలో కత్తి వుంచి, యథాతథంగా తలుపులు వేసి బయటకు వెళ్ళిపోయాడు—"

"ఎవరతను?" ఉత్కంఠతో వింటున్న న్యాయమూర్తి అడక్కుండా వుండలేకపోయాడు.

"ఇదిగో ఈ చిత్రంలో ఉన్న వ్యక్తే హంతకుడు. నగలు దొంగిలించి పుణ్యవతిని చంపాడు" తను వేసిన చిత్రాన్ని న్యాయమూర్తికి అందించాడు.

న్యాయమూర్తి చిత్రాన్ని విచిత్రంగా చూశాడు. ఆయన కొద్దిసేపు అలాగే ఉండిపోయాడు. ఇన్‌స్పెక్టర్ రవికుమార్ ఇచ్చిన ఫోటోలను తీసి చూశాడు. ఆయన్ని మరీ ఆశ్చర్యంలో ముంచిన విషయం ఆ ఫోటోలు ఈ చిత్రం ఒకేలా ఉన్నాయి.

అయితే పుణ్యవతిని చంపుతూ ఓ వ్యక్తి వున్నాడు చిత్రంలో. చంపుతున్న వ్యక్తి చేతికి అనువేళ్ళున్నాయి. ప్రక్కన సత్యాపతి నిద్రపోతున్నాడు బెడ్ మీద పడుకొని. ఆమె ఆ రాత్రి ధరించింది తెల్లచీర అని

న్యాయమూర్తి కూడ గుర్తింపలేకపోయాడు అంతకు ముందు. శ్రావణ్ గీసిన చిత్రంలో తెల్లని రంగు వేసి చీర రంగు తెలియజేశాడు.

వెంటనే ఆమె చీరను తెప్పించి చూశాడు న్యాయమూర్తి. ఆయన ఆశ్చర్యం రెట్టింపయింది. చిత్రంలో ఉన్నట్లే చీర చాలాభాగం తెల్లగా వుంది. మిగతా దంతా ఎర్రగా రక్తసిక్తమై వుంది.

హత్య జరిగి సుమారు నెలరోజులయింది. ఆ గదిని శ్రావణ్ హత్యజరిగిన రోజున చూసినా అంత స్పష్టంగా ప్రతి వస్తువు ఉన్నదున్నట్లు జ్ఞాపకం ఉంచుకొని గీయటం మానవమాత్రులకు అసాధ్యం. హత్య జరిగిన రోజునుండి ఆ యింటికి తాళంవేసి ఉన్నది.

"ఈ వ్యక్తి యిప్పుడు ఎక్కడ ఉన్నాడు?" అడిగాడు న్యాయమూర్తి.

శ్రావణ్ కళ్ళు మూసుకున్నాడు. చూపుడువ్రేలు కనుబొమ్మల మధ్య వుంచి చెప్పసాగాడు.

"అతను కలకత్తా చౌరంగి సెంటర్‌లో నగలను అమ్ముతున్నాడు. "ఆనంద సేన్ జావలరీస్, చౌరంగీ, కలకత్తా—700071" అని అతను వున్న షాపుమీద ఇంగ్లీషులో వ్రాసి వున్నది. అతను సేఠ్‌తో మాట్లాడుతున్నాడు—"

"నీవు చెప్పింది నిజమని నమ్మటం ఎలా?"

"యువరానర్! అతను మరో అరగంటవరకే ఆ షాపులోనే ఉండవచ్చు బేరం కుదరక. మీరు వెంటనే కలకత్తా ప్రభుత్వానికి, హోంమినిష్టర్ గారికి, కమీషనర్ గారికి టెలెక్స్ మెసేజ్ యిప్పించండి! వారు పట్టు

ఉంటారు. నిజం తెలుస్తుంది."

న్యాయమూర్తికి శ్రావణ్ చెప్పిన దానిలో నిజం ఉన్నట్లు అనిపించింది. వెంటనే కేసు మరో రోజుకు ఎడ్జర్న్ చేసి, యస్.పి. గారికి ఫోన్ చేసి చెప్పారు.

యస్.పి.గారు కలకత్తాలోని హోం మినిస్టర్ గారికి నగర కమీషనర్ గారికి టెలెక్స్ మెసేజ్ పంపారు.

కలకత్తా కమీషనర్ హుటాహుటి ఆనంద సేన్ జువలరీస్ పై దాడి జరిపారు.

ఇంటర్ నేషనల్ క్రిమినల్ రాబర్టును పట్టుకున్నారు. రాబర్టు చేతికి ఆరు వేళ్ళు ఉన్నాయి. ఆనంద సేన్ జువలరీస్‌లో పుణ్యవతి వద్ద దొంగిలించిన నగలు సమస్తం వున్నాయి. ఆ నగల వివరణ, కేసులో యిచ్చిన నగల వివరణ ఒక్కటిగానే ఉన్నాయి.

రాబర్టును యింటరాగేట్ చేయగా రాబట్టిన సమాచారం యిది:

రాబర్టుకు హైదరాబాద్‌లో ఓ అనుచరుడు కారంత్ అని వున్నాడు. ఇద్దరూ స్మగ్లింగ్, దొంగతనాలు, చేస్తుంటారు. రాబర్టు కారంత్ వద్దకు అప్పుడప్పుడు వస్తుంటాడు. రాబర్టు ఆ రోజు పుణ్యవతి మెడలో ఉన్న నగలు చూడటం జరిగింది, కళ్ళు చెదిరాయి. ఎలాగయినా వాటిని దొంగిలించాలనే కోరిక కలిగింది. తాను యిప్పట్లో మరలా హైదరాబాదు రాడు. కలకత్తా నుండి పారిస్ వెళ్ళాలని వున్నాడు. కాని తనను రెడ్ హేండెడ్‌గా పట్టుకున్నారు.

"తానే పుణ్యవతిని దారుణంగా చంపి, నగలు అపహరించాను" అని తన నేరం అంగీకరించాడు రాబర్టు.

## 3

"మీ రీ హత్య మీ స్నేహితుడు చేయలేదని యెలా అనుకున్నారు?" లాయర్ భుజగోవిందం ప్రశ్నించాడు శ్రావణ్ ను.

"సత్యాపతిని హత్య జరిగిన తర్వాత కలిశాను. వాడి ముఖంలో దైన్యం కనిపించింది. నా కెందుకో వాడు అమాయకుడని అనిపించింది. నా కున్న శక్తితో వాడి నెలాగయినా రక్షించాలనుకున్నాను. రాత్రల్లా మెడిటేషన్ చేస్తూ నిజం తెలుసుకున్నాను."

"నీలో ఈ శక్తి యెలా వచ్చింది?"

"నాలో వుండే సూక్ష్మ శరీరాలను యాక్టివేట్ చేయటం ద్వారా యీ శక్తి సంపాదించగలిగాను."

"ఈ శక్తి ద్వారా జరగబోయేది చెప్పగలవా?"

"లేదు, కొందరికి కొన్ని మాత్రమే వస్తాయి. అన్నీ రావు."

జడ్జి గారు జడ్జిమెంట్ చెప్పారు. అందులో శ్రావణ్ ను గురించి వివరిస్తూ వ్రాశారు. అతని సాక్ష్యం చట్టానికి వ్యతిరేకమయినా, అలాటివి నమ్మినా, నమ్మకపోయినా రాబర్టు తానే పుణ్యవతిని చంపానని ఒప్పుకున్నాడు కనుక, దొంగిలించిన నగలతో పట్టుబడ్డాడు కనుక, సత్యాపతి నిర్దోషి అని నిర్ణయించి, రాబర్టుకు యావజ్జీవ కారాగార శిక్ష విధించటమైనది.

సత్యాపతి విడుదలయినాడు.

## 4

నిజాం కళాశాల ఆవరణ చాలా కోలాహలంగా వుంది. రంగు రంగుల కాగితాలతో సుందరంగా అలంకరిం

చారు. స్త్రీలు కూర్చోటానికి ఒకప్రక్క అరేంజ్ చేశారు. మరోప్రక్క పురుషులకు అరేంజ్ చేశారు. అప్పటికే యెంతో మంది గుంపులు గుంపులుగా వచ్చారు.

మైకులో మరో పదిహేను నిముషాలలో మన ముఖ్య మంత్రిగారు వస్తారు అని ఎనౌన్స్‌మెంట్ క్షణం క్షణం మారుమ్రోగుతున్నది.

వేదిక చాలా ఎత్తుగా కట్టారు. పెద్ద పెద్ద కుర్చీలు ఐదు మాత్రమే వున్నాయి.

పదిహేను నిముషాలు అన్నది అరగంట గడిచింది. శ్రావణ్ వేదికకు దగ్గరలో కూర్చున్నాడు.

అంతలో ముఖ్యమంత్రిగారు వస్తున్నట్లు కోలాహలం వినిపించింది. జనం జిందాబాద్ ....జిందాబాద్ అనే నినాదాలు చేయసాగారు.

పైలట్ హారన్ కొట్టుకుంటూ వచ్చాడు.

ముఖ్యమంత్రిగారు టాపు లేని జీపులో వస్తున్నారు. దారి పొడువునా జనం చేతులు వూపుతున్నారు. ఎన్నో పూలదండలు ముఖ్యమంత్రిగారిపై వేస్తున్నారు. పూల దండలను ముఖ్యమంత్రిగారు చిన్నపిల్లలపై విసురుతూ అవ్యక్త అనురాగాన్ని తెలియపరుస్తున్నారు.

ముఖ్యమంత్రిగారు వేదికమీదకు వచ్చారు.

జనంలో పెద్ద కోలాహలం చప్పట్లతో ఆ ప్రదేశ మంతా మారుమ్రోగింది. ముఖ్యమంత్రిగారితో పాటు రాష్ట్రమంత్రులు వి.ఐ.పీలు వచ్చారు. వారి వెనుక ఎస్కార్టు తుపాకులతో వచ్చారు.

ముఖ్యమంత్రిగారు వేదికమీద వున్న కుర్చీలో కూర్చు న్నారు. వారి మెడలో యెన్నో మాలలు వేశారు.

నవ్వుతూ చేయి వూపారు. ప్రజలు కురిపించే అనురాగపు జల్లుకు ముఖ్యమంత్రిగారి మనస్సు తేలిపోతున్నది.

వారితో పాటు కొందరు మంత్రులు వేదికను అలంకరించారు.

"ఇప్పుడు మన ప్రియతమ నాయకులు ముఖ్యమంత్రిగారు మాట్లాడుతారు" మైకులో వినిపించింది.

ప్రజలలో మరోమారు కోలాహలం వినిపించింది. ముఖ్యమంత్రిగారు కుర్చీనుండి లేచి మైకు వద్దకు వచ్చారు. వారు మాట్లాడటం మొదలుపెట్టేసరికి ప్రజలు నిశ్శబ్దం అయినారు. లక్షలమంది జనం చెవులు రిక్కించి వినసాగారు.

ముఖ్యమంత్రిగారు తమ ప్రసంగం సరళమైన తెలుగులో సాగిస్తున్నారు. అందరూ వుత్కంఠతో వినసాగారు.

శ్రావణ్‌లో చలనంలేదు. సడన్‌గా నిశ్చలస్థితిలోకి వచ్చాడు. భృకుటి మధ్య చూపుడువ్రేలు పెట్టి ధ్యానంలో మునిగిపోయాడు....పది నిముషాలు గడిచాయి.

అంతే! శ్రావణ్ పిచ్చిపట్టినవాడిలా లేచాడు.

"ఆపండి!" అంటూ పెద్దగా కేక పెట్టాడు.

పైకి లేచినవాడు ముఖ్యమంత్రిగారి వద్దకు పరుగు పెట్టాడు.

అందరి దృష్టి శ్రావణ్ వైపు మరలింది. అతనికి పిచ్చి పట్టిందేమోననుకుంటున్నారు కొందరు. అతను ముఖ్యమంత్రిగారికి ఏదయినా అపకారం చేయటానికి పరుగు పెడుతున్నాడని కొందరు ఆవేశంగా "పట్టుకోండి! పట్టు

కోండి!" అంటూ అరవసాగారు.

ఆ ప్రదేశమంతా గందరగోళంగా తయారయింది. జనం ఒకరినొకరు త్రొక్కుకోవటం, నెట్టుకోవటం, అరుపులతో కాలేజీ ఆవరణ మారుమ్రోగింది.

ముఖ్యమంత్రిగారు తన దగ్గరకు వస్తున్న శ్రావణ్‌ను చూసి స్టన్ అయిపోయి నిలబడ్డారు .... ప్రసంగం ఆపారు.

కొందరు మంత్రులు ముఖ్యమంత్రిగారికి ప్రొటెక్షన్‌గా వారివద్దకు రాసాగారు.

అప్పటివరకూ అప్రమత్తంగా వున్న పోలీసులు తెలివిలోకి వచ్చారు.

శ్రావణ్ అప్పటికే ముఖ్యమంత్రిగారికి అతి సమీపంలోకి వచ్చారు. వారు శ్రావణ్‌ను వింతగా చూశారు.

"నీకేం కావాలి?" ముఖ్యమంత్రిగారు అడిగారు.

శ్రావణ్‌కు అదేమీ పట్టలేదు. ఒక్కసారిగా ఉద్రేకంతో ముఖ్యమంత్రిగారి చేతిలోని మైక్ రిసీవర్ లాగి, రిసీవర్‌ను గబగబా వూడదీయసాగాడు.

అంతలో డి. ఐ. జి. గారు శ్రావణ్‌ను పట్టుకున్నారు.

"సార్! యిందులో టైంబాంబ్ వుంది. దాన్ని ముఖ్యమంత్రిగారిని చంపాలని పెట్టారు కొందరు దుండగులు" అన్నాడు.

"వాట్ ....?" విస్మయంగా అడిగారు ముఖ్యమంత్రిగారు.

"అది కొద్ది క్షణాలలో పేలిపోగలదు. అందరం సమూలంగా చనిపోతాం. నన్ను వదలండి సార్!

దాన్ని తీస్తాను" శ్రావణ్ అరుస్తున్నాడు.

ముఖ్యమంత్రిగారు డి. ఐ. జి. కి సంజ్ఞ చేశారు. డి.ఐ.జి. శ్రావణ్‌ను విడిచిపెట్టారు.

శ్రావణ్ మైక్ రిసీవర్‌ను విప్పి అందులో జాగ్రత్తగా అమర్చిన మినీ టైం బాంబును బయటకు తీశాడు.

దాన్ని దూరంగా శక్తికొద్ది విసిరాడు.

టైంబాంబ్ వారికి ఇరవై గజాల దూరంలో వున్న ఓ బిల్డింగ్ మీద పడింది. వెంటనే "ఢాం" అనే శబ్దం కాలేజి ఆవరణలో మారుమ్రోగింది. ఆ శబ్దానికి అచట వున్న వారి చెవులు చిల్లులు పడ్డాయా అన్నట్లుంది. శబ్దం వినిపించటం బిల్డింగ్ పై కప్పు కూలిపోవటం వెంట వెంటనే జరిగిపోయాయి. కొన్ని సెకండ్ల కాలంలోనే ఆ ప్రాంతం దట్టమైన పొగలతో నిండిపోయింది.

ఐదు నిమిషాల వరకూ ఆ పొగలలో ఏమీ కనిపించ లేదు. ఎవరూ చనిపోలేదు.

ఛీఫ్ మినిస్టర్‌గారి చుట్టూ ఎస్కార్టు చుట్టుముట్టారు. రక్షణ చర్యలు చకచకా సాగిపోయాయి.

పోలీసులు శ్రావణ్‌ను నిర్బంధంలోకి తీసుకున్నారు.

జనం ఒకటే కేకలు, పెద్దగా అరుపులు గందరగోళంగా తయారయింది. కొందరు రాజకీయ నాయకులు యువకులను ప్రోత్సాహపరిచారు. యువకులు ఉద్రేకంతో ప్రతిపక్షాలవారిని తిట్లతోను, డౌన్ డౌన్ అనే అరుపులతో నినాదాలు చేయసాగారు.

'ముఖ్యమంత్రి జిందాబాద్' అంటూ అరుస్తూ కొందరు ముఖ్యమంత్రిగారిని తీసుకుపోయి జీపులో యెక్కించి వారి బంగ్లాకు తరలించారు. ముఖ్యమంత్రిగారి బంగ్లా

ముందు లక్షలమంది ప్రోగయ్యారు.

ముఖ్యమంత్రిగారు బయటకు వచ్చి అందరికీ నమస్కరించి తనకేమీ ప్రమాదం లేదని చెప్పారు. అది వారికి ఉపశమనం కలిగించలేదు. ప్రజలు రెచ్చిపోయి గుంపుగా వెళ్ళి అపొజిషన్ నాయకుల యిళ్ళమీద పడ్డారు. ఫర్నిచర్స ధ్వంసం చేశారు, రాళ్ళు రువ్వారు, అద్దాలు పగుల గొట్టారు.

అన్ని రేడియో స్టేషన్స్ నుండి ముఖ్యమంత్రిగారికి ఏ ప్రమాదమూ సంభవించలేదు, విధ్వంసకాండను ఆపండి, అని ఎనౌన్స్‌మెంట్ పసారం చేశారు.

ముఖ్యమంత్రిగారు స్వయంగా టి. వి.లో చెప్పారు.

అప్పటికి మాబ్ శాంతించింది.

సి.బి.ఐ. వారు రంగంలో ప్రవేశించారు. ముఖ్య మంత్రిగారిని చంపాలని ప్రయత్నించిన ద్రోహులను పట్టుకునే ప్రయత్నాలు తీవ్రంగా చేశారు. టైం బాంబ్ పెట్టిన వ్యక్తి ఆచూకీ యే మాత్రం బయటపడ లేదు.

రాష్ట్రంలో శాంతిభద్రతలు కరువైనాయి అని పత్రి కలవారి గోల. రాష్ట్ర ముఖ్యమంత్రి అసమర్థత తెలియ జేస్తోందని ప్రతిపక్షాల నాయకులు మీటింగ్ లలో చెప్పారు.

తననే రక్షించుకోలేని ముఖ్యమంత్రి రాష్ట్ర ప్రజలను యెలా రక్షిస్తారు....? అని ప్రతిపక్ష నాయకుల ఆరో పణ.

అందుకే ముఖ్యమంత్రిగారు కల్ప్రిట్స్‌ను పట్టు కోవాలని చాలా సీరియస్‌గా పురమాయించారు.

శ్రావణ్‌ను దుండగులు దొరికేవరకు జైలులో వుంచమని ముఖ్యమంత్రి ఆర్డర్ పాస్ చేశారు.

రెండో రోజున ముఖ్యమంత్రిగారికి ఓ లేఖ వచ్చింది. అది వ్రాసింది న్యాయమూర్తి. పుణ్యవతి హత్య కేసు విచారించిన న్యాయమూర్తి వ్రాశారు.

అప్పుడు ముఖ్యమంత్రిగారి దృష్టి శ్రావణ్ మీద పడింది. ముఖ్యమంత్రిగారు శ్రావణ్‌ను విడుదల చేసి తన వద్దకు తీసుకురమ్మని డి.ఐ.జి. గారిని కోరారు.

కొందరు ముఖ్యమంత్రిగారి గుర్తింపు కొరకు యిలాటివి సృష్టిస్తుంటారు. వారంటే ముఖ్యమంత్రిగారికి అసహ్యం. అందుకే శ్రావణ్‌ను జైలులో వుంచారు.

శ్రావణ్ విడుదల అయినాడు.

## 5

శ్రావణ్ ముఖ్యమంత్రిగారి గదిలోకి ప్రవేశించాడు. గది ఎ.సి. చేయబడి వుంది. ఎర్రని సోఫాలు, బ్రౌన్ కార్పెట్, గది యెంతో అందంగా వుంది.

అతనికి గదిలో అడుగు పెట్టేపాటికి కొంత థ్రిల్ కూడ కలిగింది.

ముఖ్యమంత్రిగారు వయస్సులో చాలా చిన్నవాడుగా కనిపిస్తున్నారు. చిన్నవయస్సులో పెద్ద పదవిని అలంకరించారు. శ్రావణ్ రెండు చేతులు జోడించి నమస్కరించాడు. ముఖ్యమంత్రిగారు తల వూపారు.

"మీ పేరు?"

"శ్రావణ్!"

"గుడ్! మిమ్మల్ని జైల్లో వుంచినందుకు విచారిస్తు

న్నాను. ఎవరిని నమ్మాలో, ఎవరిని నమ్మకూడదో తెలి యదు కదా!"

"అవును సార్....! అందుకు నేను బాధపడటం లేదు."

"మంచిది. మీరు మైక్ రిసీవర్ నుండి బాంబును తీసి నన్ను రక్షించారు. మీకు నా కృతజ్ఞతలు."

"థాంక్స్! అది నా డ్యూటీ సార్! మా నాయ కుని రక్షించటమే మా బాధ్యత. నా విధ్యుక్తధర్మాన్ని నేను నెరవేర్చాను."

"మైక్ రిసీవర్‌లో మినీ బాంబ్ పెట్టినవారెవరో యింకా తెలియలేదని సమాచారం వచ్చింది. అది హైలెవల్ కాన్‌స్పిరసిలా వుంది. మీకు అక్కడ బాంబు వున్నట్లు యెలా తెలిసింది?"

"నాకు లీలగా కళ్ళల్లో మెదిలింది. నేను మీ గురించి మీ రక్షణ గురించి ఆలోచిస్తున్నాను. మన రాష్ట్రం, ప్రజలు పురోభివృద్ధి చెందాలంటే మీకే ఆపదా సంభ వించకూడదని అనుకున్నాను. వెంటనే నాకు మీరు మాట్లాడుతున్న మైక్‌లో బాంబు వున్నట్లు కళ్ళముందు కనిపించింది. తక్షణమే మీ వద్దకు పరుగుపెట్టి బాంబ్‌ను తీసివేయగలిగాను."

"మీరిచ్చే వివరణ చాలా విచిత్రంగా వుంది. మీరు చెప్పేది వింటుంటే ఈ కాన్‌స్పిరసిలో మీకూ సంబంధం వున్నదని అనగలరు ఎవరైనా. కాని నేను మిమ్మల్ని నమ్ముతున్నాను మీకేం సంబంధంలేదని.

"కృతజ్ఞుడను. నేను చిన్నతనం నుండి ధ్యానం చేస్తుండేవాడిని. ఒకరోజు ధ్యానం చేస్తుండగా క్రింద

పడిపోయాను. రెండు గంటల వరకు మెలకువ రాలేదు. నాలో ఏదో మార్పు వచ్చినట్లు అనిపించింది. నాలో అతీంద్రియశక్తులు వచ్చినట్లు గుర్తించాను. అప్పటినుండి నేను ధ్యానంలో గతం తాలూకు సంఘటనలు చూడగలను."

"చాలా ఫంటాస్టిక్‌గా వుంది. ఇలాంటి శక్తులున్నట్లు అనుభవ పూర్వకంగా చూడలేదు—పుస్తకాలలో చదవటం మినహా."

"ప్రముఖ మాథమెటీషియన్ శకుంతలాదేవిగారు హ్యూమన్ కంప్యూటర్. ఆమెకు ఆ శక్తి వుంది. అలాగే నాకీ శక్తి వుంది."

"కావచ్చు! సరే, మీరు మీ శక్తిని మరోసారి రుజువు పరచండి! ఆ బాంబును చూడగలిగారు. అలాగే మరో స్టెప్ వెనక్కుపోయి ఎవరు పెట్టారో చెప్పండి. అందువలన మీరు దేశశ్రేయస్సుకు ఉపకరించగలరు."

"యస్! ఆ వ్యక్తిని రేపటిలోగా చిత్రంద్వారా మీకు చూపగలను."

"అలాగే!"

"వెళ్ళి వస్తాను" వినయంగా లేచి నమస్కరించాడు.

మరుసటి రోజు ఓ చిత్రంతో వచ్చాడు శ్రావణ్.

దానిని ముఖ్యమంత్రిగారికి అందించాడు.

అందులో యిరువురి చిత్రాలున్నాయి.

వాటిని చూసి సంభ్రమించిపోయాడు. ఒక వ్యక్తి ఒక దేశానికి ప్రభువు. మరొక వ్యక్తి నగరంలోని ఘరనా

వ్యక్తి. ఆ ప్రభువు ఏజంట్ గా గుర్తించారు మంత్రి గారు.

రెండో వ్యక్తిని వేలుపెట్టి చూపుతూ "ఇతనే మిని బాంబ్ పెట్టాడంటావా?" ముఖ్యమంత్రిగారు అడిగారు.

"అవును సార్! మైకులు కాంట్రాక్టు యిచ్చే వ్యక్తికి తెలియకుండా తన మైక్ ను అతని మైకులతో పెట్టాడు తెలివిగా."

"ఇప్పుడు అతన్ని అరెస్టు చేస్తే తాను చేసిన తప్పు తప్పుకోడు కదూ?"

"చూడండి సార్! అతను వుంటున్న బంగ్లాలో అతని గది క్రింద గదిలో రకరకాల విదేశీ గన్స్, బాంబ్స్ వున్నాయి. ఆ యింటిపై రైడ్ జరిపి వాటిని స్వాధీన పరుచుకొని అతన్ని అరెస్టు చేయించండి!"

"గుడ్ సజెషన్! వెంటనే స్పెషల్ స్క్వాడ్ ను పంపుతాను. ఈ న్యూస్ అధికారులకు కూడా తెలియకుండా సీక్రెట్ గా వుంచటం మంచిది. లీక్ అయినా అవవచ్చు!"

"యస్ సార్!"

"ఇప్పుడే రైడ్ జరిపే ఏర్పాట్లు చేస్తాను."

ఆ వెంటనే ఐదుగురు స్పెషల్ ఆఫీసర్స్ రాజా ఇంటిపై దాడి జరిపారు. హఠాత్తుగా ఇంట్లోకి ప్రవేశించిన వారిని చూసి రాజా స్టన్ అయినాడు.

"మిస్టర్ రాజా! మీరు కదలవద్దు! మీ హౌస్ ను సెర్చి చేయాలి" అన్నాడు వారిలో ఓ ఆఫీసర్.

"నే నెవరనుకుంటున్నారు?"

"మీకెవరైనా మాట అనవసరం."

"ఇంతకూ మీరెవరు?"

వాళ్ళు తమ ఐడెంటిటీ కార్డులు చూపారు.

"నాకు ముఖ్యమంత్రిగారివద్ద పలుకుబడి వున్నదనేది అందరికీ తెలుసు. వారికి ఫోన్ చేస్తాను."

"ముఖ్యమంత్రిగారే మమ్మల్ని రైడ్ చేయమని ఆర్డర్స యిచ్చారు."

రాజాకు లోపలినుండి చలిజ్వరం పుట్టుకువచ్చింది. పారిపోవాలని చుట్టూ చూశాడు. వెంటనే ఒక ఆఫీసర్ పిస్టల్ గురిపెట్టి కదలవద్దని వార్నింగ్ యిచ్చాడు. రాజా చేసేదిలేక సోఫాలో చతికిలబడ్డాడు.

మిగిలిన ఆఫీసర్లు యింట్లోకి వెళ్ళి అన్ని గదులు వెదక సాగారు.

ఆ యింటి అండర్ గ్రౌండ్‌లో ఒక గది ఉంది. అందులో ఎన్నో గన్సు, బాంబ్స, దేశంలో ప్రతిచోటకు వైర్‌లెస్ కనెక్షన్సు ఉన్నాయి. వాటిపై విదేశీముద్ర ఉంది. వాటిని స్వాధీన పరచుకున్నారు.

రాజాను కస్టడీలోకి తీసుకొని ఢిల్లీ తీసుకు పోయారు.

రాజా తన నేరం అంగీకరించక తప్పలేదు.

ఆ విదేశీయునితో అతనికి పది సంవత్సరాలనుండి కనెక్షన్సు వున్నాయి. తన ఏజంట్లను భారతదేశంలో ఏర్పాటు చేయమని నలుమూలలు పంపాడని, అందుకు రాజాకు కరెన్సీ యిచ్చాడని చెప్పాడు రాజా. వారి పని ప్రభుత్వాలను కూల్చటం, రాష్ట్రాలను అల్లకల్లోలంలో వుంచటం.

మరు రోజు అన్ని దినపత్రికలలోను ఆ వార్త వచ్చింది. అది పెద్ద సంచలనమే సృష్టించింది. అది ప్రతి వారినీ స్పందించింది.

శ్రావణ్ పేరు ప్రతి వారు ఉచ్చరింపసాగారు. అతనో చర్చనీయాంశమైనాడు.

అప్పటివరకూ శ్రావణ్ శక్తిని నమ్మనివారు యిప్పుడు నమ్ముతున్నారు.

ముఖ్యమంత్రిగారు శ్రావణ్ కు ఓ బహుమతి యిచ్చి సత్కరించాడు. ప్రభుత్వంలో ఓ మంచి ఉద్యోగం కూడా యిచ్చాడు. జీతం నెలకు రెండువేలు.

# 7

శ్రావణ్ కు సెక్రటేరియేట్ లో అపాయింట్ మెంట్ వచ్చింది.

శ్రావణ్ ఓ పెద్ద పోర్షన్ అద్దెకు తీసుకున్నాడు. నెలకు ఐదువందలరూపాయుల అద్దె. ఆ పోర్షన్ కు ఇంకా అద్దె యెక్కువే యిస్తారు. కాని ముఖ్యమంత్రిగారి పి.ఎ. రికమెండేషన్ తో వచ్చింది. కనుక ఐదువందలకే ఇచ్చారు ఇంటి యజమాని.

అప్పటికీ శ్రావణ్ భార్య సుమతి అన్నది.

"ఏమండీ! ఐదువందల రూపాయలు అద్దె యింటికి ఖర్చు పెడతారా?"

అతను నవ్వాడు.

"అంత పెద్ద పోర్షన్ మనకు అవసరం సుమతీ! ఎందుకంటే మనం విజిటర్స్ కోసం రెండు గదులు కేటాయించవలసి వున్నది."

"ఏమో—ఖర్చు పెట్టుకుంటే కొండలయినా కరిగి పోతాయంటారు పెద్దలు."

"సుమతీ! మనం యింటికి ఐదువందలు పెట్టినా బాధ పడవలసిన పనిలేదు. అంతగా చాలవు అనుకున్న వాడు జీతం పెంచమందాం!"

ఆమె మౌనం వహించింది.

శ్రావణ్ ఉదయం పదిగంటలకు ఆఫీసుకు వెళతాడు. సాయంకాలం ఎనిమిది గంటలకు వస్తాడు.

శ్రావణ్ కు ఈ మధ్య విజిటర్స్ పెరిగారు. అతను వారికొరకు ఉదయం రెండుగంటలు వెచ్చిస్తాడు. అతని వద్దకు వచ్చేవారిలో సామాన్యులు మొదలు మంత్రుల వరకూ, పెద్ద ఆఫీసర్లు బిజినెస్ పీపుల్సు కూడ వున్నారు. వారు వెళుతూ డబ్బు యివ్వాలని ప్రయత్నించేవారు. కాని అతను డబ్బు తీసుకునేవాడు కాదు. ఆ విషయంలో అతను చాలా స్ట్రిక్ట్.

సుమతికి అదో సెంటిమెంట్. డబ్బు తీసుకోవటం ఆమెకు యిష్టంలేదు. ఆ మాట రోజుకు ఒకసారైనా అంటుండేది శ్రావణ్ తో.

"రోజులు మామూలుగా గడిచిపోతున్నాయి. ఆరు నెలలు యిట్టే తిరిగిపోయాయి.

సెక్రటేరియేట్ లో అతనికి తెలియనివారు లేరు. ఈ ఆరునెలలలో అతన్ని బాగా ఆకట్టుకున్న వ్యక్తి సీతాదేవి.

ఆమె అందమైనది. వయస్సు యెక్కువే కాని చాలా చిన్నదిలా అగుపిస్తుంది. ఆమె ఓ నియోజకవర్గంనుండి యం.యల్.ఎ. గా ఎన్నిక అయింది. భర్త ఆనంద్ కి

మంచి బిజినెస్ మాగ్నెట్ అని పేరుంది.

ఆమెను చూస్తే తరగని ఆస్తిపరురాలు అనుకోక మానరు. ఎప్పుడు ఫారిన్ సెంట్ వాసనతో టిప్ టాప్ గా వుంటుంది. బ్లూ మారుతీ కారును ఒంటరిగా డ్రైవ్ చేసుకుంటూ వస్తుంది.

ఆమె సెక్రటేరియేట్ లో అందరికీ తెలుసు.

ఆమె వద్దకు పనులు చేయించుకోటానికి యెంతోమంది వస్తుంటారు.

ఆమె దృష్టి శ్రావణ్ మీద పడింది. అతనితో పరిచయం పెంచుకోవాలని వుబలాటపడేది.

ఆ రోజు సాయంకాలం ఆఫీసు పని పూర్తి చేసుకొని బయటకు వచ్చాడు శ్రావణ్. సిటీబస్ కోసం నిలబడ్డాడు బస్ స్టాప్ వద్ద.

"శ్రావణ్!" శ్రావ్యంగా పిలిచింది సీతాదేవి.

"నమస్కారం మేడమ్!" అన్నాడతను వినయంగా.

"ఇంటికేనా?"

"అవును మేడమ్!"

"ఐవిల్ గివ్ యు లిఫ్ట్! కమాన్!"

"ఎందుకు మేడమ్ మీకు శ్రమ. నేను సిటీ బస్ లో వెళతాను."

"నో! ఈ రోజు నీవు నా కారులో రావాలి. మా ఇంట్లో టీ తీసుకొని వెళుదువుగాని. మా యిల్లు చూసినట్లుగా ఉంటుంది కూడ."

అతను యిబ్బందిగానే తప్పుకున్నాడు.

ఆమె కారు ఎక్కింది. డ్రైవర్ లేడు. ఆమే డ్రైవర్ సీట్లో కూర్చున్నది. శ్రావణ్ ఆమె ప్రక్కన కూర్చు న్నాడు.

కారు కదిలింది.

కొద్ది క్షణాలలో కారు రెండంతస్తుల భవనంలోకి దూసుకుపోయి ఆగింది. భవనం అత్యంతాధునికంగా కట్ట బడి చూడముచ్చటగా ఉంది.

అతను సోఫాలో ఒక మూలకు ఒదిగి కూర్చు న్నాడు.

ఇంట్లో ఎవ్వరూ లేనట్లు నిశ్శబ్దంగా ఉంది. ఒక్క ముసలి నౌకరు మినహా.

కూల్ డ్రింక్ తెచ్చి శ్రావణ్ ముందుంచి వెళ్ళాడు నౌకరు.

సీతాదేవి డ్రస్ ఛేంజ్ చేసుకోటానికి గాబోలు లోపలకు పోయింది.

ఆ ఇంటిలోని ఫర్నిచర్స్ వారి ధనాన్ని అంచనా వేస్తున్నాడు. కూల్ డ్రింక్ తాగాడు.

అంతలో సీతాదేవి చీర మార్చుకొని వచ్చింది.

"శ్రావణ్!" అన్నది.

ఆమెను అప్పుడు దగ్గరగా చూశాడు. ఆమె అతని కన్నా చాలా పెద్దది. బయటకు వచ్చేటప్పుడు మేకప్‌తో వస్తుంది. వయస్సు తెలియదు. ఇప్పుడు మామూలుగా వుంది.

"మేడమ్! నేను వెళతాను."

"అప్పుడే! యిలా వచ్చి అలా వెళతానంటే ఎలా?

వచ్చిన వాడివి పదినిమిషాలు ఉండు! నాకూ తృప్తిగా ఉంటుంది."

అతనికి తప్పలేదు.

"బోర్ గా ఉందా? మా ఇల్లు చూద్దువురా!"

ఆమెను అనుసరించాడు.

ఇంద్ర భవనంలా ఉంది. అన్ని గదులు చూపించింది. ఆమె నవ్వుతూ మాట్లాడుతుంటే అతనికి అదోలా ఉండేది. డబ్బుతో తులతూగుతున్నది.

"మేడమ్! ఆనంద్ గారూ లేరా?"

"లేరు. ఢిల్లీ బిజినెస్ పనిమీద వెళ్ళారు."

ఇద్దరూ మేడమీదకు వెళ్ళారు.

విశాలమైన వరండా—ప్రక్కన బెడ్ రూం కిచన్ రూం మాత్రమే ఉన్నాయి.

"ఇవి కాశ్మీర్ నుండి తెప్పించిన కేన్ చైర్స్" అంటూ అక్కడ ఉన్న కుర్చీలను చూపింది. అవి అందంగా ఉన్నాయి.

వాటిలో చతికిలబడ్డాడు.

"శ్రావణ్! నీలో ఉన్న శక్తి చాలా గొప్పది, సామాన్యులకు ఆ శక్తిని పొందటం సాధ్యం కాదు."

"………"

"దాన్ని మనం సరియైన మార్గాన వినియోగిస్తే మనం ఈ లోకాన్ని జయించవచ్చు!"

"సీతాదేవిగారూ! వెళతాను."

"అప్పుడేనా?"

"యింటివద్ద సుమతి యెదురుచూస్తుంటుంది."

"సరే పద! మిమ్మల్ని మీ యింటివద్ద వదిలి

వస్తాను."

"నేను వెళ్ళగలను."

"నో! నేను మిమ్మల్ని డ్రాప్ చేసి మరీ వస్తాను."

అతను కారులో దిగటం సుమతి చూసింది.

ఆమె ముఖంలో రంగులు మారాయి.

సీతాదేవి కారు బాక్ చేసుకుంటుంటే శ్రావణ్ చేయి ఎత్తాడు టా టా చెపుతున్నట్లు.

కారు కనుమరుగయింది.

సీతాదేవి గంభీరంగా నవ్వుతున్నది.

'చీఫ్ మినిస్టర్! ఒకనాటికయినా నిన్ను దెబ్బ తీస్తాను' అనుకున్నది మనసులో.

ఆమె మదిలో గతం తాలూకు సంఘటనలు లీలగా కదలాడాయి—

సీతాదేవి, మూర్తి క్లాసుమేట్సు. ఇద్దరికీ స్కూల్లో పరిచయము. వారు ఎక్కడా తప్పలేదు. ఒకరంటే ఒకరు పోటీపడి పాస్ అవుతూ వచ్చారు. యూనివర్సిటీలో యం.ఎ. పాలిటిక్స్‌లో చేరారు. మూర్తి మధ్య తరగతి నుండి వచ్చాడు. సీతాదేవి అఫీసర్ ఏకైక సంతానం.

మూర్తి అప్పటి నుండి యూనియన్ లీడర్‌గా పేరు తెచ్చుకున్నాడు. అన్యాయాలను సహించేవాడు కాదు. న్యాయంకోసం ప్రతిరోజూ ఘర్షణపడేవాడు. యెన్నో సార్లు జైలుకు వెళ్లాడు.

మూర్తి అంటే సీతాదేవికి యిష్టం. అతన్ని పెళ్ళి చేసుకోవాలని తహతహ లాడేది. కాని యింతవరకూ తన మనసులోని కోరికను వెళ్ళడించలేదు.

యం.ఎ. పూర్తయింది యిద్దరికి.

సీతాదేవి తండ్రికి ఒక రోజు హార్ట్‌ఎటాక్ వచ్చింది.

ప్రాణం యెప్పుడు పోతుందో చెప్పటం కష్టం. హార్టు ఎటాక్ ఎప్పుడైనా తీసుకపోవచ్చు. అందుకే సీతాదేవికి పెళ్ళి చేయాలని తొందర పెట్టసాగాడు.

సీతాదేవి మూర్తివద్దకు వచ్చింది.

"మూర్తీ! యిన్నాళ్ళూ నీతో చెప్పకుండా దాచాను. నిన్ను ప్రేమిస్తున్నాను. మా నాన్న నా పెళ్ళికి తొందర పెడుతున్నాడు. మన మిద్దరం పెళ్ళి చేసుకుందాం!"

మూర్తి ఆశ్చర్యపోయాడు.

"సీతా! కోరి కోరి నీవు నన్ను కావాలనుకుంటు న్నావా? నా బ్రతుకు ప్రజాసేవకే అంకితం. వారి సమస్యలు తీర్చటానికే నేను నా బ్రతుకు ధారపోయాలనుకుంటున్నాను. నన్ను లేకుండా చేయాలని యెందరో ప్రయత్నిస్తున్నారు. ఇప్పటికి 20 సార్లు నామీద లేని కేసులు సృష్టించి జైలుపాలు చేశారు. ప్రజలను దోచుకుంటూ పెరిగిపోతున్న యీ పారసైట్సు అంతం చూడా లనుకుంటున్నాను.

నేను యిప్పుడు దారితెన్ను లేని స్థితిలో వున్నాను. నేను పెళ్ళి చేసుకోదలుచుకోలేదు. పరిస్థితులు అనుకూలిస్తే చేసుకుంటానేమో? అప్పటికి ఈ వయస్సు జారి పోవచ్చు! నన్ను నమ్ముకొని నీ బ్రతుకును బండలు చేసుకోకు. నన్ను మర్చిపో!"

సీతాదేవి అవాక్కయింది.

అతనిలో నిష్కళంకమైన ప్రజాసేవకుడు కనిపించటం లేదు. తన మాట తిరస్కరించిన అహంకారి కనిపించాడు.

"ఇదే మీ నిర్ణయమా? ప్రజాసేవ పేరిట నిన్ను అర్థిస్తున్న నన్ను కాలదన్నటం మీకు మంచిది కాదు?"

"నేను నా నిర్ణయాలు ఎవరికోసం మార్చుకోను" ఖచ్చితంగా చెప్పాడు.

ఆమె హృదయం భగ్గుమన్నది. నాగుపాము బుసలు కొట్టినట్టు బుసలుకొట్టింది.

తర్వాత ఆనంద్‌తో ఆమె వివాహం జరిగిపోయింది.

మూర్తి పెళ్ళి చేసుకోలేదు. బ్రహ్మచారిగానే వుండిపోయాడు. అప్పటి నుండి ఆమె రాజకీయాలలోకి రంగ ప్రవేశం చేసింది. ప్రతి విషయానికీ మూర్తితో పోటీ పడేది.

ఎలక్షన్లు వచ్చాయి.

కొన్ని లక్షలు ఖర్చుచేసి యం. యల్. ఎ. కాగలిగింది. కాని నిస్వార్థ ప్రజాసేవకే యం. యల్. ఎ.లు పట్టం కట్టారు. ఇద్దరూ ఒకే పార్టీ. మూర్తి ముఖ్యమంత్రిగా ఎన్నుకోబడ్డాడు.

ఆమె ప్రలోభాలకు వారు లొంగలేదు.

ముఖ్యమంత్రిగారు సీతాదేవికి మంత్రి పదవి యిచ్చారు పాత పగలు ప్రక్కకు నెట్టి.

మంత్రి పదవి వచ్చినా ఆమె దృక్పథంలో మార్పు లేదు. డబ్బు సంపాదించి ముఖ్యమంత్రి పదవిని చేజి

క్కించుకోవాలనుకున్నది. తాను యం. యల్. ఎ. కావటానికి ఖర్చు చేసిన డబ్బును మంత్రి పదవితో సంపాదించాలనుకున్నది. లంచాలు తీసుకోవటం మొదలు పెట్టింది.

లంచాలు తీసుకోవటం ఓ జబ్బు. అది నయం కానటువంటి దీర్ఘరోగం.

ఆమె లంచాలు తీసుకుంటోందని ముఖ్యమంత్రిగారి దృష్టికి వచ్చింది.

ఉన్నట్టుండి ఓ ముహూర్తాన పదవికి రిజైన్ చేయి లేనిచో పదవి నుండి తొలగింపవలసి వస్తుందని అన్నారు.

ముఖ్యమంత్రిగారి మాటలు ఈటెల్లా గుచ్చుకున్నాయి.

పదవికి నీళ్ళు వదులుకోవలసి వచ్చేపాటికి ఏడుపు వచ్చింది. బావురుమన్నది.

“నీవు యింకా ఆ పదవిలో కొనసాగితే నీవు దుఃఖిస్తున్నట్లు ప్రజలు దుఃఖింపవలసి వస్తుంది. ప్రజలకు ముఖ్యమంత్రిగా ఆ పరిస్థితి రానివ్వను. రిజైన్ చేయి!” అన్నారు.

ఇష్టం లేకపోయినా పదవికి రాజీనామా యిచ్చింది.

అప్పటి నుండి ముఖ్యమంత్రిగారిపై లోలోన రగిలి పోతున్నది. అవకాశం కొరకు వేచివున్నది. ముఖ్యమంత్రి కావాలనే కోరిక బలంగా పాతుకపోయి వుంది.

శ్రావణ్ ఆమెకు ఆశాకిరణమైనాడు.

సీతాదేవి అప్పటినుండి యేదోక టైములో అతన్ని కలిసేది. తీయని మాటలతో కాలం వెళ్ళబుచ్చేది. మొదట ఆమె సన్నిధి యిబ్బందిగా వున్నా రాను రాను హాయిగా వున్నది. ఆమె కనిపించని రోజు అదోలా వుండేది.

ఓ రోజు ఇద్దరూ కారులో వస్తున్నారు.

"శ్రావణ్!"

"ఏమిటి?"

"నీవు నాకో మాట యివ్వాలి?"

"ఏమిటో చెప్పండి!"

"ముందు మాటయివ్వు, తర్వాత చెపుతాను."

"అలాగే! చెప్పండి!"

"చేతిలో చేయి వెయ్యి!"

అతను ఆమె చేతిలో చేయివేశాడు.

"చెప్పు!"

"ఇప్పుడు కాదు, తర్వాత చెపుతాను."

అతనికి నవ్వు వచ్చింది. ఆడవాళ్ళు సెంటిమెంటల్ ఫూల్స్ అనుకున్నాడు.

ఇద్దరూ ఆమె యింటికి వచ్చారు.

"అమ్మగారూ!" అంటూ యెదురుగా వచ్చాడు నౌకర్.

"ఆనంద్ గారు లండన్ వెళ్ళారు. రెండురోజులకు గాని రానని చెప్పమన్నారు" అన్నాడు అతను తాళాల గుత్తి ఆమెకు యిస్తూ.

ఆమె కళ్ళు మెరిశాయి.

"సరే! నీవు వెళ్ళు!"

అతను వెళ్ళాడు.

"శ్రావణ్! నీవు ఈ రోజు యిక్కడే వుండు!"

"సీతాదేవిగారూ! నేను వెళతాను!"

"నో! నేను ఒంటరిగా వుండలేను. ప్లీజ్....!" అన్నది.

అతను యింకేమీ మాట్లాడలేదు.

హీటర్‌తో నీళ్ళు వెచ్చచేసింది.

అతను హాయిగా స్నానం చేశాడు. భోజనం వడ్డించింది.

అతనికి ఓ బెడ్‌రూమ్ చూపి పడుకోమన్నది.

ఆమె మరో బెడ్‌రూమ్‌కు పోయింది.

అతను బెడ్‌మీదకు వాలిపోయాడు. కళ్ళు మూతలు పడసాగాయి.

వెంటనే గాఢనిద్రలోకి జారుకున్నాడు.

శ్రావణ్‌కు మెలకువ వచ్చేసరికి అతని శరీరాన్ని కరుచుకొని మరొకరున్నారు.

ఉలిక్కిపడి కళ్ళు తెరిచాడు.

మత్తు వదిలిపోయింది.

జీవితంలో పర స్త్రీ స్పర్శ ఎరుగనివాడు.

ఓ యువతి వివస్త్రగా అతన్ని పెనవేసుకొని వుంది.

అతను ఆశ్చర్యంతో తానెక్కడ వున్నానా అని పరిశీలనగా చూశాడు. తల తిరిగినంత పనయింది.

శరీరంలోని అణువణువు బాధతో కొట్టుకులాడుతున్నాయి. ఆమె సీతాదేవి పంపగా వచ్చిన లలితాదేవి.

సీతాదేవి ఆమెను యిలాటి పనులకు వినియోగిస్తూంటుంది....

అతను నగ్నంగా ఆమె కౌగిలిలో వున్నాడు.

ఆమె నల్లని బాబ్డ్ హేర్ అతని చెంపలకు తగులుతోంది. "లలితాదేవిగారూ!" అన్నాడు.

అతని నోటిని ఆమె ఎర్రని పెదవులతో మూసివేసింది.

"ఉష్!" అన్నది మత్తుగా.

## 9

"సీతాదేవిగారూ!" ఆశ్చర్యంగా అడిగాడు.

అతని ఎదురుగా రెండు గ్లాసులలో విస్కీ పోసి సోడా కలిపివుంది. అందులో ఐస్ ముక్కలు కదలాడుతున్నాయి.

ఆమె పకపకా నవ్వింది.

"ఎందుకలా నవ్వుతున్నారు?"

"నీ అమాయకత్వానికి" ఆమె తెరలు తెరలుగా నవ్వసాగింది.

అతను అయోమయంగా చూశాడు.

"తాగు!"

"ఇదేమిటి?"

"విస్కీ. ఎప్పుడూ టేస్టు చేయలేదా?"

"లేదు."

"వాట్? అందుకే నవ్వు వస్తోంది."

"............"

"నీ కంటే పల్లెటూరి వాళ్ళే నయం!" అన్నది

తిరిగి.

"అంటే?"

"రాజధాని నగరంలో వుంటూ విస్కీ త్రాగటం యిదే మొదటిసారి అనటం ఆశ్చర్యంగా వుంది."

"నాకు అలవాటు లేదు."

"ఒక్కసారి కూడ త్రాగంది అలవాటు ఎలా అవుతుంది? ఇప్పుడు త్రాగు!"

"త్రాగను!"

"నా కోరకు త్రాగు. ఇది అంతగా మత్తు కలిగించదు. కళ్ళు అలా వాలిపోతాయి. అంతే! అంతా మనకు తెలుస్తుంది."

అతను త్రాగాడు.

త్రాగకూడదనుకుంటూనే అతని ప్రమేయం లేనట్లు మరో గ్లాసు పూర్తిచేశాడు.

ఇప్పుడు అతనికి నిషా తలకెక్కింది.

తాను కూర్చున్న సోఫా అలా భూమిలోకి లాక్కుపోతున్నట్లు అనుభూతి కలుగుతోంది. ఆ అనుభవం క్రొత్తగా వున్నా యెంతో హాయిగా వుంది. అతని మాటలు తడబడుతున్నాయి.

సీతాదేవి అతనితోపాటే త్రాగుతున్నది. ఆమె ఎన్ని గ్లాసులు త్రాగినా ఎప్పటిలాగే వుంది. మాటలలో స్పష్టత, కళ్ళలో చిలిపిదనం చెక్కుచెదర లేదు.

"శ్రావణ్! నీవంటే నాకెంతో యిష్టం."

"అవును. నాకూ నీవంటే యిష్టమే!"

"నీ కోరకు యేమైనా చేయటానికి సిద్ధమే. నీ సంతోషమే నా సంతోషం!"

"నీవు చాలా మంచిదానివి."

"జస్టు ఎ మినిట్!" ఆమె ఫోన్ వద్దకు పోయి యెవరికో ఫోన్ చేసి, మరలా వచ్చి అతని యెదురుగా కూర్చున్నది.

"ఎవరికి ఫోన్ చేశావు?"

"కొద్ది సేపట్లో నీకే తెలుస్తుంది. సరే! నీకెలా వుంది? కూర్చోలేకపోతే బెడ్ మీద పడుకో!"

"నాకూ పడుకోవాలనిపిస్తోంది. నీవు కరెక్టుగా వూహించావు."

సీతాదేవి చిన్నగా నవ్వుకుంటూ అతన్ని సమీపించింది. ఆమె అతని భుజంమీద చేయి వేసింది. అతన్ని నడిపించుకుంటూ బెడ్ రూమ్‌లోకి తీసుకు పోయింది.

"కొద్దిసేపు అలా పడుకోండి!" ఆమె బయటకు వచ్చింది.

పది నిముషాలు గడిచాయి. అంతలో నలుగురు యువతులు నవ్వుతూ త్రుళ్ళుతూ అతని గదిలోకి వచ్చారు.

సీతాదేవి గ్లాసులో ద్రవం పోసుకోవటం కూడా అలో ఖాళీ చేస్తోన్నది. ఆమె కళ్ళు యెర్రగా జ్యోతుల్లా వున్నాయి. ఆమె గజిబిజి ఆలోచనలతో బుర్ర వేడెక్కింది. ముఖ్యమంత్రిగారిపై పగ సాధించాలి.

శ్రావణ్‌కు ఆ యువతులు అస్పష్టంగా కనిపిస్తున్నారు. వారు యేం చేస్తున్నారో తెలియటంలేదు.

అతన్ని పూర్తి వివస్త్రుడను చేశారు.

అతని బంగారు రంగులో మెరిసే శరీరాన్ని సున్నితంగా నొక్కుతున్నారు.

ఇలాటి సుఖం ఒకటి వుంటుందని అతనికి ఆ క్షణం లోనే తెలిసింది.

వారిని కూడ అతను విశ్వస్తులను చేశాడు. వారు అడ్డు పెట్టలేదు.

అతనికి ఆ రాత్రి నిద్ర రాలేదు.

* * *

"రాత్రి మీరు త్రాగారు కదూ?" ఉదయం మామూలుగా యింటికి వచ్చిన భర్తను నిలదీసింది సుమతి.

అతను మౌనం వహించాడు.

"నిజం చెప్పండి! రాత్రి మీరు త్రాగారు!"

"నీ కలా తెలుసు?"

"నేను మీ భార్యనండీ! మీరెలా మాట్లాడుతారో నాకు తెలుసు. ఒక్క రాత్రిలో వచ్చిన మార్పు ఎందుకు వచ్చిందో? ఆ మాత్రం గ్రహించలేనా?"

"నీదంతా వూహ సుమతి! రాత్రి నాకు ఒంట్లో బాగా లేదు. ఫ్రెండు యింటిలో పడుకున్నాను."

"మీ మాటలలో నిజం లేదని తెలుస్తూనే వుంది."

"నేను చెప్పేది నిజం సుమతీ!"

"ఏమండీ! ఇంకా యెందుకు బుకాయిస్తారు. మీ అలవాట్లు, ప్రవర్తన, నీతినియమాలకు కట్టుబడి సామాన్య జీవితం గడపటంలో ఆనందం పొందేవారు. కాని ఇప్పుడు మీలో చాలా మార్పు చూస్తున్నాను."

అతను యేమీ మాట్లాడకుండా లోపలకు వెళ్ళాడు.

ఆమె ఆశ్చర్యంతో అతన్ని చూస్తూండిపోయింది.

ఆమె యేనాడూ అతని ప్రవర్తన గురించి అడిగి ఎరుగదు. ఇదే మొదటిసారి. ఇన్నాళ్ళు తానో గొప్పవాడుగా వూహించి మాట్లాడేది. కాని ఈ రోజు ఓ అపరాధిగా మాట్లాడింది. చెంపదెబ్బ తగిలినట్లు ఫీలయ్యాడు.

ఆ రోజు అతనికి యింట్లో వుండాలనిపించలేదు. వెంటనే బయటకు వెళ్ళాడు.

నాలుగురోజులు గడిచాయి.

శ్రావణ్ పగలు ఆఫీసు మానివేశాడు. పగలల్లా నీతాదేవితో కబుర్లు చెప్పుకుంటూ కాలం గడిపేవాడు.

రాత్రిళ్ళు ఇంటికి వచ్చిన శ్రావణ్‌తో సుమతి సరిగ్గా మాట్లాడేదికాదు. ఎడ ముఖం పెడ ముఖంగా వుండేది. అతను కావాలని పలకరించినా ఆప్యాయంగా మాట్లాడేది కాదు. ఆమె ప్రవర్తన అతనికి బాధగా వుండేది.

ఓ రోజు అన్నది.

"నేను మా నాన్నగారి వద్దకు వెళ్ళాలనుకుంటున్నాను."

"ఎందుకు?"

"నాకు యిక్కడ బాగా లేదు."

"ఏం బాగాలేదు?"

"ఏమో చెప్పలేను. ఈ యింట్లో సరిగా వుండలేక

పోతున్నాను. రాత్రిళ్ళు సరిగా నిద్రపట్టటంలేదు. ఎవరో నన్ను తరుముతున్నట్లు పీడకలలు వస్తున్నాయి. కారణం యేమిటో తెలియదు. భయం."

"సుమతీ! లేనిపోనివి ఊహించుకొని మనస్సు పాడు చేసుకోకు! నీవు బాధపడుతూ నన్ను బాధ పెట్టకు!"

"నన్ను పొమ్మంటారా? వద్దంటావా?"

"వద్దు!"

"నన్ను వెళ్ళనివ్వండి!"

"పదిరోజుల తర్వాత వెళుదువులే!"

ఆమె ఏమీ మాట్లాడలేదు. కొద్దిసేపు ఆగి అన్నది.

"పట్టుదల, ఆత్మస్థైర్యంతో ఎంత గొప్పవారైనా కాగలదు. కాని ఒక్కొక్కసారి ఎలా దిగజారుతున్నాడో కూడ తెలియదు. తర్వాత బాధపడినా ప్రయోజన ఉండదు."

ఆమె ఎవరిని గురించి చెపుతున్నదో అతనికి అర్థం కాలేదు. ఆమె వద్దనుండి లేచి బయటకు వెళ్ళాడు. పది రోజుల తర్వాత ఆమె ఊరికి వెళ్ళింది.

# 10

డబ్బు, సుఖం, మగువ అతని కాళ్ళ వద్దకు వచ్చాయి. ఖరీదైన హోటళ్ళలో గడపటం, కార్లల్లో తిరగడం, అందమైన సుందరాంగుల కౌగిళ్ళల్లో నలిగిపోవటం సుఖానికి అర్థంగా భావించాడు. అతని యింట్లో యిప్పుడు లేని వస్తువంటూ లేదు.

నీలాదేవి ఒకరోజు అన్నది.

"ప్రకాష్! నీవు మానవాతీత శక్తులు కలవాడివి. నీ శక్తిని మనం ఉపయోగిద్దాం! ఈ దేశంలో మనంతటి వాళ్ళు లేరని నిరూపిద్దాం!"

"సీతాదేవిగారూ!"

"మీరు నాకు ఒకసారి మాట యిచ్చారు. మీరు నేను చెప్పినట్లు చేయాలి!"

"అవును. నాకు గుర్తుంది. నీకు సహాయం ఎప్పుడూ ఉంటుంది."

"ఇది మనకు సరియైన తరుణం. ఇప్పుడు మనం తెలివిగా ప్రవర్తిస్తే అధికార పీఠం మన వశం అవుతుంది. మీరు ఓ మినిస్టర్ కాగలరు."

"ఏమిటి నీవనేది?" తబ్బిబ్బయ్యాడు. తనకు మినిస్టర్ అయ్యే యోగ్యత ఉందా?

"ఇప్పుడు ముఖ్యమంత్రిగారిపై యం.యల్.ఎ.లు అసంతృప్తితో ఉన్నారు. ముఖ్యమంత్రిగారు పెట్టిన సామాన్యుడి 'తిండి—బట్ట' విధానంపై ధ్వజం ఎత్తాలని వున్నారు. వారిని ఈ తరుణంలో కొనగలిగితే ఆ పీఠం మన వశం అవుతుంది.

"భారతదేశంలో సామాన్యుడి ఓటు ఖరీదు చేయగలుగుతున్నామని అనుకుంటున్నారు ప్రతి రాజకీయ నాయకుడు. కాని సామాన్యుడు తమ ప్రియతమ నాయకులను గెలిపించుకుంటూనే వున్నారు. కాని యం.యల్.ఎ.లు సామాన్యుడికన్నా హీనంగా మరోవైపున అమ్ముడు పోతున్నారు.

సామాన్యుల ఓట్లు సంపాదించి మనం అధికారంలోకి రాలేము. కాని యం.యల్.ఎ.లను కొనగలం. అలాంటి

వారి సంఖ్య సగంకన్నా యెక్కువ వుంది. వారికి డబ్బు ఎర చూపితే మన శిబిరంలోకి గంతువేస్తారు. ఒక యం.యల్.ఎ. తన పదవీ కాలంలో పదిలక్షలు సంపాదించలేడు ఈమధ్య మంత్రి పదవిలో వున్నంతకాలం. మనం ఒక్కో యం.యల్.ఎ.కి పదిలక్షలు యిస్తామంటే మన జండా నీడకు పరుగుపెడతారు.

అలా మనం రెండువందల మందిని కొనగలిగితే ప్రభుత్వం మన వశం అవుతుంది. ఇదంతా రహస్యంగా చేయవలసిన పని. ఏమాత్రం బయటకు పొక్కినా మనల్ని క్షమించరు ముఖ్యమంత్రిగారు."

అతనికి నోటమాట రాలేదు.

సీతాదేవి విశ్వరూపం యిప్పుడు అర్థం అయింది.

అతని వాణి మూగబోయింది.

అతని ఆలోచనా తరంగిణి తీగెలా సాగింది. మంత్రి పదవిలో వున్న గౌరవం వేరే వ్యక్తికిరాదు. సీటు కళ్ళ ముందు కదలాడింది.

"ఏమంటావ్?"

"నేను నీకు మాట యిచ్చాను. కట్టుబడి ఉంటాను. నీకు ఎదురు చెప్పను. నా సహకారం యెప్పుడూ వుండనే ఉంటుంది. అయితే అంతమందిని కొనగలగాలంటే కొన్ని కోట్లు కావాలి. అంత డబ్బు వుందా?"

"మన సమస్య డబ్బే! నా వద్ద ఉంటే ఒక కోటి రూపాయలు ఉంటుంది. అది ఎసెట్సు రూపంలో. ఆ డబ్బు ఎందుకూ చాలదు. అంత డబ్బు సమకూరే ఉపాయం నీవు చెప్పవలసి వుంది. నీ శక్తిని డబ్బు సంపాదించటానికి వినియోగించుదాం."

"ఎలా?"

"ఈ నగరంలో అంత డబ్బున్నవాళ్ళు కొద్దిమంది మాత్రమే ఉంటారు. గత పదికోటాలలో ఎవరైనా అంత డబ్బు తెచ్చి యింట్లో పెట్టారో చెప్పు! వారి యింటిని ఓకోజా ప్లాన్ గా దోచుకుందాం!"

"డబ్బు సుమారు రెండు కోట్లు ఉండాలి."

"అవును అంతకు తక్కువ అయితే శ్రమ వృథా అవుతుంది."

"ఆల్ రైట్! నేను ఆలోచిస్తాను."

"ఆలోచనలు కట్టిపెట్టి పనిలో లీనమైపో!"

"అలాగే! ఈ రాత్రికే ధ్యానంలో వుంటాను."

"విష్ యూ ఆల్ సక్సెస్!"

"వెళ్ళివస్తాను."

"ఓ.కే!" అన్నది.

శ్రావణ్ ఆలోచిస్తూ వెళ్ళాడు. మంత్రిగా పూలమాలలు వేయించుకోవాలి. ప్రజలచే అడుగులకు మడుగులొత్తించుకోవాలి.

సీతాదేవి కళ్ళు తారల్లా వెలుగుతున్నాయి. కళ్ళ ముందు ముఖ్యమంత్రి 'సీటు' పెండులంలా వూగుతున్నది. అది తన సొంతం కాబోతున్నది.

టైం దగ్గర పడబోతున్నది.

అదృష్టం ధైర్యవంతులనే వరిస్తుంది. జీవితంలో ఆ మాత్రం ఎడ్వెంచర్ చేయకపోతే ఎలా?

# 11

నగరంలో డబ్బున్న వ్యక్తులలో సేట్ చాంద్ జీ ఒకరు. అతని ఆస్తుల విలువ ఎన్ని కోట్లు వుంటాయో

అతనికే తెలియను. భారతదేశ ప్రముఖులలో ఒకడు.

ఇక్కడనుండి ముత్యాలు, రత్నాలు ఎగుమతి చేసే వ్యాపారం. అదిగాక నూనెమిల్లులు, కాగితం పరిశ్రమలు, ఇతర దేశాలలో వాచ్ కంపెనీలలో భాగం, యింకా ఎన్నో బిజినెస్‌లలో షేర్లు ఉన్నాయి.

శ్రావణ్ తన శక్తిని కేంద్రీకరించాడు. సేట్‌చాంద్ జీని గురించి కొన్ని నిగూఢ రహస్యాలు తెలుసుకున్నాడు.

ఉదయమే సీతాదేవి యింటికి వెళ్లాడు.

"శ్రావణ్! రా! కూర్చో!"

"సీతాదేవీ! యీ చిత్రం చూడండి!" ఓ గీసిన చిత్రం యిచ్చాడు. ఆమె ఆ చిత్రాన్ని చూసింది.

"సీతాదేవీ! ఈ చిత్రంలో ఉన్న వ్యక్తి ప్రపంచానికే నోటెడ్ పర్సనాలిటి సేట్ చాంద్‌జీ. అతను రెండు రోజుల క్రిందట స్విస్ బ్యాంకునుండి మూడు కోట్లు తీసుకువచ్చాడు. ఆ డబ్బును తన పడకగది మంచంక్రింద భూమిలో సీక్రెట్‌గా దాచి వుంచాడు. డబ్బును డిటెక్టర్స్ కూడ క్యాచ్ చేయని విధంగా సైంటిఫిక్‌గా తయారుచేసిన సేఫ్‌లో దాచివుంచాడు. ఆ సేఫ్‌కు ఒక రకమైన ఫైబర్‌తో తయారుచేసిన లేయర్ వుంటుంది. అందువలన డిటెక్టర్స్ అచట పని చేయవు. ఆ డబ్బును మనం సంపాదించాలి. ఆ చిత్రమే ఆ డబ్బున్న గది."

"శ్రావణ్ సూపర్బ్!" చిన్నగా అరిచింది సంతోషం పట్టలేక.

"ఏమిటా ఆవేశం!"

"యస్! నిజమే ఆవేశం అనర్థాలకు మూలం. మనం ఏమి చేయాలో తర్వాత నేను చెప్తాను. ముందు మనకు ఓ సోర్సు అంటూ దొరికింది. రెండు మూడు రోజులు సేట్ చాంద్ జీని స్టడీ చేయాలి. ఆ తర్వాత ప్లాన్ తయారు చేయాలి."

"బాగానే వుంది. ఇందులో మరొకరి హెల్ప్ తీసుకొని, అతని పడకగది మీదకు అర్థరాత్రి పంపుదామా?"

"నో! అదే పొరపాటు! అప్పుడు యీజీగా పట్టుబడతాం. ఈ రోజులలో అంత నమ్మకస్తులు దొరకరు."

"అయితే ఏమిటి మార్గం?"

"మనమే అన్ని పనులు చేయాలి!" అన్నది.

ఆమె సేట్ చాంద్ జీ విషయాలు సేకరించింది.

వారికి అందిన సమాచారం ప్రకారం సేట్ చాంద్ జీ రోజూ జింఖానా క్లబ్ కు వెళతాడు. బాగా తాగుతాడు. అది అతనికి రిలాక్సేషన్. తర్వాత ఇంటి ముఖం పడతాడు. అప్పటికి అర్థరాత్రి పన్నెండు గంటలు ఒంటి గంట అవుతుంది.

# 12

సేట్ చాంద్ జీ ఆ రోజు పీకలవరకూ తాగాడు. అతను ఎంత తాగినా మత్తురాదు, కళ్ళు మూతలు పడవు. వివేకం నశించదు. మామూలుగానే ఉంటాడు.

అప్పుడు టైం పన్నెండున్నర అయింది.

క్లబ్బు నుండి యింటికి బయలుదేరాడు.

డ్రైవర్ జానకీరాం వినయంగా శాల్యూట్ చేశాడు.

"గాడీలావ్! అర్జెంట్!" అన్నాడు డ్రైవర్‌ను.

"అలాగే సాబ్!" మరోసారి యజమానికి శాల్యూట్ చేసి కారు పార్కు చేసిన చోటకు వెళ్ళాడు.

అచట ఎన్నో కార్లు పార్కు చేయబడ్డాయి.

జానకీరాం రోల్సురాయిస్ డోర్ తెరిచి అందులో డ్రైవింగ్ సీట్లో కూర్చున్నాడు.

అతని తలమీద గట్టిగా ఓ దెబ్బ పడింది. కళ్ళు గిర్రున తిరిగాయి. వూహించని చావు దెబ్బ. మరో దెబ్బ పడింది. జానకీరాం చిన్నగా అరిచాడు. కారు తలుపులు వేసివుండటాన అతని అరుపు బయటకు వినిపించలేదు.

దెబ్బమీద దెబ్బ అతనికి స్పృహ తప్పించింది.

వెనుకనుండి సీతాదేవి, శ్రావణ్ పైకి లేచారు. ఇప్పుడు వాళ్ళిద్దరూ మారువేషాలలో ఉన్నారు.

డ్రైవర్‌ను బయటకు లాగారు. ముక్కువద్ద క్లోరోఫాం పెట్టారు. నోటికి ప్లాస్టర్ అంటించారు. చేతులు వెనక్కు విరిచి కట్టారు. అతన్ని ప్రక్కనే ఉన్న అంబాసిడర్ డిక్కీలో పడుకోబెట్టారు. అతనికి మరలా స్పృహ రావాలంటే కనీసం నాలుగైదు గంటలు పడుతుంది. అప్పటికి తెల్లవారుతుంది. ఆపాటికి తమ పని పూర్తవుతుంది. డిక్కీ డోర్ వేసి కేకేశారు.

ఇద్దరూ హాయిగా ఊపిరితీసుకున్నారు.

అప్పటికి పదిహేను నిమిషాలు దొర్లాయి.

సేట్ చాంద్ జీ అసహనంగా ట్రిబుల్ ఫైవ్ సిగరెట్లు తగలేస్తున్నాడు. అతనికి టైం ఎంతో విలువైనది. డబ్బు ఖర్చయినా బాధపడడు. పదిహేను నిముషాలంటే పదిహేను లక్షలుగా భావిస్తాడు.

డ్రైవర్ మీద కోపం వచ్చింది.

"బాస్టర్డ్" సిగరెట్ అప్పుడే వెలిగించి ఒక్కటే పీలుపు పీల్చాడు. డ్రైవర్ మీద ఉన్న కోపంతో సిగరెట్ ను దూరంగా విసిరాడు.

"వీడికి ఈ రోజు ఏమొచ్చింది? ఎప్పుడూ యింత ఆలస్యం చేయడు. వీడికి ఈ రోజుతో ఉద్యోగం కట్. ఇన్ సిన్సియర్ ఫెలోన్ను క్షమించకూడదు. రాస్కెల్!"

చాంద్ జీ విసవిస నడుచుకుంటూ రోల్స్ రాయిస్ వద్దకు వచ్చాడు. కారువద్ద డ్రైవర్ లేడు. ఆశ్చర్యం కలిగింది. డోర్ తెరిచి ఉంది. డ్రైవర్ లేడు. "ఏమయ్యాడూ!" అనుకున్నాడు.

"జానకీరాం!" గట్టిగా పిలిచాడు.

నో రెస్పాన్సు! కారులో తలదూర్చి లైట్ వేయ బోయాడు.

అంతే! వెనకనుండి గట్టిగా ఒక తన్ను తన్నాడు శ్రావణ్. ఆ దెబ్బకు కారులోకి వచ్చి పడ్డాడు.

చాంద్ జీ తృళ్ళిపడ్డాడు. కారులో బోర్లా పడ్డాడు. నోట మాటరాలేదు.

"మిస్టర్! చాంద్ జీ! ముందు కారు ఫ్రంట్ సీటులో కూర్చోండి! మిమ్మల్నేం చేయం? మా మాట కాదని అరిచినా గొడవ చేసినా ఈ పిస్టల్ తో మీ శరీరంతో

ఆడుకోగలం" వెనుక వీపుకు పైన గుచ్చుకొంటోంది.

చెట్టంత మనిషి వణికిపోవటం మొదలు పెట్టాడు.

"ఎవరు మీరు? మీకేం కావాలి? డబ్బా?" బిక్క ముఖం వేసి అడిగాడు.

"కాదు, ముందు మీ యింటికి వెళదాం! మీతో పర్సనల్ గా మాట్లాడాలి."

"దేన్ని గురించి?"

"ఇక్కడ చెప్పం!"

"రహస్యమా?"

"అవును."

"ఫరవాలేదు చెప్పండి! ఇక్కడ యెవ్వరూ లేరు!"

"ఇది నీ పరువుప్రతిష్టలకు సంబంధించిన విషయం. అందుకే యిది సరియైన ప్లేస్ కాదన్నాం;"

సేట్ చాంద్ జీకి వీరు అతని యింటిని మాట్లాడటానికి యెంచుకున్నారంటే తాను సీక్రెట్ గా దాచిన డబ్బు కొరకు అనే అనుమానం కలగలేదు. తాను అచట డబ్బు దాచటం తనకు తప్ప మరొకరికి తెలియదు. కనీసం అతని భార్య, కుమారునికి కూడా తెలియదు. నిజంగానే ఏదో రహస్యం వుందనుకున్నాడు. తన పరువుప్రతిష్టకు ముడి పడి వుందంటున్నారు. తన కుమారుడు కాని, కుమార్తెలు కాని ప్రేమ వ్యవహారంలో చిక్కుకొని వున్నారేమో?....

"ఇచట యెవ్వరూ లేరుగా?"

"సేట్ జీ! యిక్కడ కాదదన్నాం. మరలా అడుగుతున్నారు. మాకు మీతో తీరిగ్గా మాట్లాడే

ఓపిక లేదు. ముందు పదండి! కాదని ఎదురు తిరిగితే చావండి!"

"అంతమాట యెందుకు పదండి!" అన్నాడు.

"మీరు ముందు కూర్చోండి! ఆమె డ్రైవ్ చేస్తుంది. నేను వెనుక సీట్లో కూర్చొంటాను. ఈ పిస్టల్ మా రక్షణ కోసం. మీరు పిచ్చి పిచ్చి వేషాలు వేయకుండా వుండటానికే! మిమ్మల్ని అనవసరంగా చంపము!"

"అలాగే....!" అంటూ ఫ్రంటు సీటులో కూర్చు న్నాడు.

సీతాదేవి కారు స్టార్టు చేసింది. ముందు ఆమె. ఆమె ప్రక్కన సేట్ జీ వున్నాడు. వెనుక శ్రావణ్ పిస్టల్ తో వున్నాడు.

సేట్ చాంద్ జీ భవనం ముందు ఘూర్ఖా సేట్ జీని చూసి శాల్యూట్ చేశాడు.

కారు భవనంలోనికి పోయి ఆగింది.

"దిగు!" చిన్నగా అన్నాడు శ్రావణ్.

సేట్ జీ దిగాడు. అతనితో పాటే యిరువురూ దిగారు.

"మిస్టర్ చాంద్ జీ! ఇది నీ యిల్లు అని పిచ్చి పిచ్చి వేషాలు వేయవద్దు! నీ ప్రాణాలకు ముప్పు తెచ్చుకోవద్దు! మమ్మల్ని మీ ఫ్రెండ్సులా పరిచయం చేయి మీ వాళ్ళకు!" అన్నాడు.

సేట్ జీ తల ఆడించాడు.

సేట్ జీతో పాటు సీతాదేవి, శ్రావణ్ యింట్లోకి వెళ్ళారు.

అర్ధరాత్రి ఒకటిగంట కావటాన యిల్లు నిశ్శబ్దంగా

వుంది. నౌకర్లు కూడా లేరు. చాంద్ జీ సంతానం మేడ మీద తమ గదులలో పడుకున్నారు.

డైనింగ్ హాలులో ముసలి నౌకరు ఒకడు పడుకొని వున్నాడు.

కాలింగ్ బెల్ కొట్టాడు.

ముసలి నౌకరు తలుపులు తెరిచాడు.

"అయ్యగారూ! భోజనం?" అడిగాడు.

"వద్దు! నీవు వెళ్ళు!"

"సేట్ జీ! మీ పడకగదికి పదండి!" అన్నాడు శ్రావణ్. సేట్ జీ బెడ్రూంవైపు దారితీశాడు.

సేట్ జీ తలుపుపై శబ్దం చేశాడు.

కొద్ది సేపటికి తలుపులు తెరుచుకున్నాయి.

సేట్ జీ భార్య పడుకున్నది, మేలుకొని తలుపులు తెరిచింది. ఎ.సి. చేయటాన ఆ గది చల్లగా హాయిగా వుంది.

ఎదురుగా ముగ్గురిని చూసి తొట్రుపాటు పడింది. సేట్ జీ యేనాడూ యెవ్వరినీ తన బెడ్ రూంకు తీసుక రాడు. కానీ యీనాడు వీళ్ళతో వచ్చాడు. ఆమె ఆశ్చర్యపడింది.

"తుమ్ ఊపర్ చలో!" అన్నాడు. ఆమె పవిట తలపై కప్పుకున్నది నిండుగా. ఆమె తల వంచుకొని పైకి వెళ్ళింది.

ముగ్గురూ గదిలోకి వెళ్ళారు. తలుపులు వేశారు.

"చెప్పు భాయ్! ఎవరు మీరు? నన్నెందుకిలా భయ పెడుతున్నారు?"

"మేం ఎవరమనేది నీతో చెప్పలేం! నీతో మాకు

అత్యవసర పని వుండి వచ్చాం!"

"సరే! చెప్పండి! నా పరువుప్రతిష్టలకు సంబంధించిన విషయం అన్నారు. ఏమిటది?" డెస్క్ మీద కూర్చుంటూ అన్నాడు.

"ష్! అది మిమ్మల్ని నమ్మించటానికి అన్నమాట. చల్ల కొచ్చి ముంత దాచటం ఎందుకు? మేము వచ్చింది డబ్బు కొరకు. నీవద్ద నున్న డబ్బు కావాలి: దాన్ని బయటపెట్టు!" పిస్టల్ గురి పెట్టాడు.

అతను వణికిపోయాడు.

"డబ్బా! మోసం, దగా" అరిచాడు.

"నీవు ఎలా అనుకున్నా ఫరవాలేదు. మాకు డబ్బు కావాలి."

"ఇది ఘోరం. మీరు ఎవరు? నన్ను నమ్మించి నా గదికి వచ్చారు. ఇప్పుడే పోలీసులకు ఫోన్ చేస్తాను."

"వారు వచ్చి నీ శవాన్ని పోస్టుమార్టంకి పంపటానికా?" పిస్టల్‌తో పొట్టలో పొడిచాడు గట్టిగా.

"డబ్బు ఇవ్వకపోతే చంపుతారా?"

"నిర్దాక్షిణ్యంగా!"

"అరే భాయ్! ఇది పడకగది. ఇక్కడ డబ్బెందుకుంటుంది? డబ్బు ఐరన్ సేఫ్‌లో వుంది. ఐరన్ సేఫ్ వేరే గదిలో వుంది."

"సేట్ జీ! మేము అంత అమాయకులం కాదు, సేఫ్ వున్న గదికి రావటానికి. సేఫ్ తెరిస్తే అలారం మ్రోగుతుంది. మా ఫోటోలు ఆటోమాటిక్ ఫోటో సిస్టం ద్వారా పడిపోతాయి. చుట్టూ కరెంట్ పాస్ అవు

తుంది. కోరి కష్టాలు తెచ్చుకోము. ఆ డబ్బు మాకు అక్కరలేదు."

"మరి యెలా భాయ్! సేఫ్‌లో డబ్బు వద్దు అంటున్నావు. డబ్బు కావాలంటున్నావు. ఇచట డబ్బేది? నా పర్సులో రెండు వేలో, మూడు వేలో వున్నాయి. అవి తీసుకోండి యిస్తాను. నన్ను వదిలివేయండి!"

"నీ పర్సులో వున్న డబ్బుకు ఆశపడేవారమైతే యింతదూరం రావలసిన పనిలేదు. మాకు నీ బెడ్‌రూంలో కార్పెట్ క్రింద భూమిలో దాచిన డబ్బు కావాలి, మూడుకోట్లు!"

సేట్‌జీకి మూర్ఛ వచ్చినంత పనయింది. ఇద్దరినీ తేరిపార చూశాడు. వీరు సామాన్యులు కారనుకున్నాడు. తాను పెట్టిన డబ్బు ఎంతో చెపుతున్నారు. సేట్‌జీ శరీరంలో కంపనం పుట్టింది.

"భాయ్! మూడుకోట్లా?" నోరు తెరిచాడు.

"యస్, సేట్‌జీ! అవి తీయి!"

"అంత డబ్బు నా దగ్గర ఎందుకుంటుంది భాయ్? నా వ్యాపారం టర్నోవర్ కూడ అంత వుండదు."

"సేట్‌జీ! వృధా మాటలతో కాలహరణ చేయవద్దు. టర్నోవర్ కన్నా రెండు రెట్లు బ్లాక్ మనీ వుంటుంది. నా ఆస్తి రెండు కోట్లు అంటే ఇరవై కోట్లు అని అర్థం. బెడ్ క్రింద పెట్టిన డబ్బు నీవు స్విస్ బ్యాంకులోంచి తెచ్చింది. దాన్ని బయటకు తీయి!"

సేట్‌జీ మ్రానులా చలనరహితమైనాడు.

శ్రావణ్ అతనివద్దకు వచ్చాడు. సేట్‌జీ మంచంమీద

నుండి కదిలేలా లేదు. నిశ్వాసాలు దొర్లుతున్నాయి. ముఖంలో ఏడుపు ఛాయలు కనిపిస్తున్నాయి.

శ్రావణ్ అతన్ని మంచంమీద నుండి క్రిందకు తోశాడు. సేట్ జీ ముందుకు పడ్డాడు. రెండు మంచాలను ప్రక్కకు జరిపాడు. మంచాల క్రింద ఖాళీ ఏర్పడింది. మధ్య భాగంలో వేరే చిన్న కార్పెట్ పరిచి వుంది.

"ఇది యెలా తెరుచుకుంటుంది సేట్ జీ!"

"............ "

"మాట్లాడు" సేట్ జీ డొక్కలో పిస్టల్ తో పొడిచాడు. సేట్ జీ నోరు విప్పటంలేదు.

"ఇలా కాదు" పిస్టల్ కాలుకు గురిచూసి కాల్చాడు. 'ఢాం' అనే శబ్దం వచ్చింది. గుండు కాలును చిన్న గాయం చేసింది. నెత్తురు బయటకు వచ్చింది. అది సౌండ్ ప్రూఫ్ కావటాన శబ్దం బయటకు వినిపించలేదు.

సేట్ జీ వణికిపోయాడు.

సేట్ జీ మంచం దగ్గరకు వెళ్ళి అడుగున చేయి పెట్టి ఓ బటన్ నొక్కాడు. సేట్ జీ జపాన్ లో వున్న ఓ ఫ్రెండ్ ద్వారా ఆ పరికరం అమర్చాడు.

అరకు వున్న మూత ప్రక్కకు జరిగింది.

శ్రావణ్ కార్పెట్ తొలగించాడు.

మనిషి పట్టే ఖాళీ యేర్పడింది. సేట్ జీని అందులోకి తోశాడు.

సేట్ జీ బావురుమని ఏడ్చాడు.

శ్రావణ్ తర్వాత అందులోకి దిగాడు.

వారు మూడు మెట్లు క్రిందకు దిగారు. అచట విశాలమైన గది వుంది. గదిలో ఐరన్ సేఫ్ వుంది. అచట చిన్న లైటు వెలుగుతోంది. అది ఆటోమాటిక్‌గా వెలిగే లైటు.

"తెరువు!" అన్నాడు.

సేట్‌జీ చిన్న పిల్లవాడిలా యేడవటం మొదలు పెట్టాడు.

ఆ సేఫ్ తెరుచుకోవాలంటే సేట్‌జీ వద్ద నున్న కీ ద్వారానే తెరుచుకుంటుంది.

సేట్‌జీని ఆపాదమస్తకం వెదికాడు. కనిపించ లేదు....

శ్రావణ్ వికృతంగా నవ్వాడు

"సేట్‌జీ! యింతవరకూ వచ్చి యిప్పుడు మొండికేస్తే జరిగేదేమిటో ఆ మాత్రం వూహించే వుంటావనుకుంటాను. తొందరగా పని కానియ్!"

"నేను తెరవలేను భాయ్!" సేట్‌జీ పెద్దగా ఏడ్వసాగాడు.

"ఏయ్! ఆపు!" అరిచాడు.

సేట్‌జీ ఏడుపు ఆగలేదు. ఎక్కువ అయింది.

"ఆపు!" అంటూ కాలితో తన్నాడు.

అంత శరీరం క్రింద పడి మరోసారి దొర్లింది.

"తెరువు!"

"నేను తెరవలేను."

"తెరవలేవూ? ఎలా తెరవవో చూస్తాను" పిస్టల్ మరోసారి పేలింది. గుండు భుజంలోకి దూసుకపోయింది. రక్తం బయటకు చిమ్మింది.

"అమ్మో!" అంటూ సేట్ జీ భుజం పట్టుకున్నాడు. అతను గోడకు చేరగిలపడ్డాడు. బయటకు వచ్చే రక్తాన్ని రాకుండా పట్టుకొని దుఃఖిస్తున్నాడు.

"సేట్ జీ! మేము రాక్షసులం. నిర్దాక్షిణ్యంగా చంపగలం. మా రాక్షసత్వం రుచి చూశావుగా! నీ ప్రాణాలు తీయాలని మాకు లేదు. ప్రాణాలు చాలా విలువైనవి. వాటిని ఈ డబ్బు కొరకు ఖర్చు చేసుకోవద్దు."

"... ........"

"సేట్! తెరువు!" ఉగ్రుడయినాడు.

సేట్ జీ రోదన ఎక్కువైంది.

శ్రావణ్ చేతిలోని పిస్టల్ కు మరోసారి పని కలిగించాడు. ఈసారి తొడలో గుండు దూరింది.

"బాబోయ్! నన్ను చంపకండి, చంపకండి!" సేట్ జీ బాధగా అరవటం మొదలుపెట్టాడు.

సేట్ జీకి ప్రత్యక్ష నరకం కనిపిస్తుంది. గది చాలా వరకు ఎర్రని రక్తంతో తడిసింది.

"సేట్ జీ! యిప్పటికయినా మించిపోయింది లేదు సేఫ్ తెరిచి ప్రాణాలు కాపాడుకో!"

సేట్ జీ కంఠం మరీ యెక్కువ అయింది. మైండ్ మొద్దుబారిపోయింది. శ్రావణ్ కు, సీతాదేవికి దీనంగా రెండు చేతులు యెత్తి నమస్కరించాడు. సేట్ జీ కళ్ళకు అతను ప్రాణాలను హరించే ఆక్టోపస్ లా కనిపించసాగాడు. రాక్షసత్వం కరడుకట్టిన కాఠిన్యం నిలువునా పోతపోసినట్లున్నాడు శ్రావణ్. అతన్ని చూసి భయవిహ్వలుడైనాడు. శ్రావణ్ లో మానవత్వం వెలికితీయా

అనే ప్రయత్నంతో నమస్కరించాడు.

శ్రావణ్ కోపం కట్టలు తెంచుకున్నది. ఈసారి పిస్టల్ గుండెలకు గురిపెట్టాడు.

"నీ హృదయపు అంచులను ముద్దాడుతుంది పిస్టల్ గుండు సేట్ జీ!"

"వద్దు! చంపవద్దు!"

"అయితే చెప్పినట్లు చేయ్! సేఫ్ తెరువు!"

సేట్ జీ తెరిచే ప్రయత్నం చేయలేదు. రక్తం స్రవిస్తున్న భుజం పట్టుకోవటం, తొడ పట్టుకోవటం దుఃఖించటం చేస్తున్నాడు.

శ్రావణ్ కు సహనం నశింపసాగింది. సేట్ జీ చేస్తున్న ఆలస్యానికి కోపం వస్తోంది. సహనం నశిస్తుంది. సేట్ జీని కాలుతో గట్టిగా తన్నాడు. సేట్ జీ ప్రక్కకు పడ్డాడు. అతన్ను కూడ సేట్ జీలో ఏ మార్పూ తేలేదు. సేట్ జీ తనను కానట్లున్నాడు.

ఏం చేయాలి?

"సేట్ జీ! పది అంకెలు లెక్కపెడతాను. పది పూర్తయ్యేలోపల తెరిచినట్లయితే సరి! లేకపోతే నీ ప్రాణాలకు నా పూచీ లేదు."

"............"

"ఒకటి...."

"............"

"రెండు...."

"............"

"మూడు...."

సేట్ జీ వులకడు పలకడు.

"మూడు.... నాలుగు.... ఐదు...."

అంత డబ్బు చేజారిపోతుందనే దిగులు, బాధ ముఖంలో కనిపిస్తోన్నాయి.

"సేట్ జీ! ఎందుకలా గింజుకుంటావు? ఇంత డబ్బు నీవు న్యాయంగా సంపాదించావా చెప్పు! లేదు. నీ తెలివి అనే యమపాశంను అమాయకులమీద విసిరావు. ప్రాణాలు పోయేవాడు కొట్టుకున్నట్లు కొట్టుకొని నీకు డబ్బు ఇచ్చారు. అలా సంపాదించిన డబ్బు ఇవ్వటానికి ఎందుకలా బాధపడతావు?" అన్నాడు.

ఇప్పటికే సగం ప్రాణాలు పోయాయి. సేట్ జీ ముఖంమీద చేతులు పెట్టుకున్నాడు. రక్తం ముఖమంతా పులుముకున్నది. ముఖమంతా వికృతంగా వుంది.

"ఆరు.... ఏడు.... ఎనిమిది?"

సేట్ జీ యేడవటం మినహా సేఫ్ డోర్ తెరిచేలా లేదు.

".... .... ...."

"సేట్ జీ! అంకెలు ఇంకా రెండే వున్నాయి. నేను ఆ తర్వాత ఒక్క సెకండు కూడా ఆగను. త్వరగా తీయ్!"

".... .... ...."

సేట్ జీ కళ్ళు దీనంగా అతన్ని చూస్తున్నాయి. నిస్స హాయంగా వున్నాడు.

"తొమ్మిది.... ...."

".... .... ...."

"తీయవా? యిక ఉపేక్షింపను...."

".... ...."

"పది...."

శ్రావణ్ ఒక అడుగు ముందుకు వేశాడు.

"భాయ్! మీకు ఒక కోటి రూపాయలు ఇస్తాను. తీసుకుపోండి! నన్ను బ్రతకనివ్వండి!"

"సేట్ జీ! నీ కిచ్చిన గడువు పూర్తయింది. నీతో కండిషన్ పెట్టాను. ఆలోపు మాట్లాడలేదు. ఇప్పుడు నేను నీ ప్రాణాలకు సెక్యూరిటీ ఇవ్వలేను."

అతని చేతిలోని పిస్టల్ క్రూరంగా గర్జించింది. సేట్ జీ గుండెలను చీల్చుకుంటూ పోయింది గుండు. సేట్ జీ గుండెల నుండి ట్యూబు నుండి బయటకు చిమ్మినట్టు రక్తం వచ్చింది.

సేట్ జీ గది అదిరిపోయేట్లు అరిచి క్రిందపడ్డాడు. ప్రాణాలు పోగొట్టుకోటానికైనా సిద్ధపడ్డాడు కాని సేఫ్ తెరవటానికి ముందుకు రాలేదు.

"శ్రావణ్! అతన్ని చంపావా? ఇప్పుడెలా?"

అతను మరోసారి నవ్వాడు. అంతలోనే అతను గంభీరంగా మారిపోయాడు. సేట్ జేబులు పాంటు జేబులు వెదకసాగాడు. జేబులలో ఏ 'కీ' లేదు. అతని ముఖమంతా స్వేదబిందువులతో నిండి వుంది.

పట్టుదలగా వెదకసాగాడు. చివరకు అతని కళ్ళు మెరిశాయి. పాంటు క్రింద వున్న అండర్ వేర్ కు చుట్టి ఉందో వెండి మొలత్రాడు. దానికి వ్రేలాడుతున్నది ఓ 'కీ'.

శ్రావణ్ ఆ కీ తీసుకున్నాడు.

సేఫ్ వెంటనే వచ్చింది.

సేఫ్ లో రెండు సూట్ కేసులు వున్నాయి. వాటిని

బయటకు తీశాడు. ఓ సూట్ కేసు తెరిచాడు. కళ్ళు జిగేల్ మన్నాయి. నోట్లకట్టలు ప్రత్యక్షమైనాయి. అతని కళ్ళు ఆనంద డోలికల్లో తేలిపోయాయి. సూట్ కేసులు మూశాడు.

పిస్టల్ పై వున్న తన వ్రేలిముద్రలు తుడిచాడు. పిస్టల్ అచటనే పడవేశాడు. సూట్ కేసులు పట్టుకొన్నాడు.

"కమాన్! క్విక్!" అన్నాడు.

సీతాదేవి గుండెలు కొన్ని వందలమైళ్ళ వేగంతో కొట్టుకుంటున్నాయి. గోటితో పోతుంది అనుకున్నది గొడ్డలి ఉపయోగించవలసి వచ్చింది. మనస్సంతా గందరగోళంగా వుంది. కొన్ని కోట్లు స్వంతం అయినాయి. అలాంటప్పుడు కలిగే ఆనందం ముందు ఈ మెంటల్ ఎగొని ఎంత?

ఇద్దరు మెట్లు ఎక్కి పైకి వచ్చారు.

చెరి ఒకరి చేతిలో ఓ సూట్ కేసు వుంది.

బెడ్ రూం యెప్పటిలాగే వుంది.

మంచాల వద్దకు వచ్చారు. బటన్ నొక్కాడు. అర కున్న మూత పడిపోయింది. కార్పెట్ దాని మీద ఎప్పటిలా పరిచాడు. మంచాలను ఒకటిగా దగ్గరకు జరిపాడు.

బెడ్ రూం తలుపులు తెరిచి బయటకు వచ్చారు యిద్దరూ.

ఎవ్వరూ లేరు. ముసలి నౌకరు కునికిపాట్లు పడుతూ హాలులో వున్నాడు.

అతన్ని గమనించకుండా హాలుదాటారు. తర్వాత అ

యింటి గుమ్మం దాటారు. బయట సేట్ జీ రోల్స్ రాయిస్ వుంది.

కారు ఫ్రంట్ డోర్ తెరిచి సూట్ కేసులు లోపల తోశారు. ఇద్దరు కారులో కూర్చున్నారు. డ్రైవింగ్ సీట్లోకి వచ్చింది సీతాదేవి. వెంటనే కారు స్టార్టు అయింది. కారు బయట గేటు వద్దకు వచ్చింది. ఘూర్ఖా గేటు తెరిచాడు. కారు బయటకు దూసుకు పోయింది.

ఘూర్ఖా వెనుకనుండి వారికి శాల్యూట్ చేశాడు.

కారులోనే తమ మారువేషాలను తీసేశారు.

కారు క్లబ్బు ఆవరణలోకి వచ్చింది. సేట్ జీ ఎప్పుడూ ఉంచే స్థలంలో కారును ఉంచింది సీతాదేవి. ఇద్దరూ కారు దిగారు. సీతాదేవి కారు కీని కారులోనే విసిరింది.

బయటకు వచ్చి టాక్సీ ఎక్కారు. సూట్ కేసులు చేతులలోనే ఉన్నాయి. ఇద్దరకూ మనసులు కుదుట పడ్డాయి.

# 13

మరురోజు సాయంకాలానికి సేట్ చాంద్ జీ కనిపించటంలేదని అతని భార్య లకమన్ ప్యారి రిపోర్టు యిచ్చింది.

చాంద్ జీ పట్టణంలోని ప్రముఖులలో ఒకడు. 'అర్థరాత్రి యిరువురితో కలిసి యింటికి వచ్చాడు. మరలా బయటకు వెళ్లాడు. అంతే! మరలా కనిపించలేదు' అని రిపోర్టు యిచ్చింది అతని భార్య. ఘూర్ఖా కారుపోతున్నప్పుడు అందులో ఎందరు వున్నారో చూడలేదు.

పోలీస్ డిపార్టుమెంట్ మొత్తం స్పందించింది.

క్షణాలలో ఆ న్యూస్ నగరం అంతటా వ్యాపించింది. పోలీసులు నగరం అంతటా గాలించారు. వారికి సేట్ జీ ఆచూకీ దొరకలేదు. అన్ని పేపర్లు ఆ న్యూస్ ప్రకటించాయి. పోలీసులు గాలింపు చర్యలు తీవ్రం చేశారు. ప్రయోజనం శూన్యం. లక్ష్మన్ ప్యారి తన ఆవేదన వ్యక్తం చేసింది డి.ఐ.జి.గారి వద్ద.

"రెండు, మూడు రోజులు ఓపికపట్టండి తప్పక తెలుసుకుంటాం!" అన్నారు డి.ఐ.జి.గారు.

"సార్! నాకేదో భయంగా వుంది. వారు దొరుకుతారా?"

"తప్పక మేడమ్!"

"సార్! మీరు ఏమీ అనుకోనంటే మీకో చిన్న మనవి. మీరు సేట్ జీ విషయంలో శ్రావణ్ ను కలవకూడదూ?"

"శ్రావణా?"

"అవును. అతన్ని గురించి నాతో చాలామంది చెప్పారు?''

"ఏమని మేడమ్?"

"అతను మీకు సేట్ జీ ఆచూకి యివ్వగలడు."

"అతనెవరు? అతనికెలా తెలుసు?"

"శ్రావణ్ కు కొన్ని మానవాతీత శక్తులున్నాయి. అతను మీకు సేట్ జీ ఆచూకి యివ్వగలడు. ఇప్పటికి కొన్ని నిజం అయినాయి."

"హీ....హీ...." ఆయన నవ్వాడు. "అంటే! మీకు మా మీద నమ్మకం లేదన్న మాట."

"మీరు ఎలా అనుకున్నా నాకేం బాధ లేదు. వాడి సేట్ కి ఆచూకీ కావాలి. అది మీకన్నా అతనివలన నే తెలుస్తుందని నా ఉద్దేశ్యం!"

"మేడమ్! మీరు కావాలని మా డిపార్టుమెంటును అవమానపరుస్తున్నారు. మేము అతన్ని కలవము. కావలిస్తే మీరే కలవండి!"

"ఇలా అంటున్నానని బాధపడకండి! నా అదుర్దా అలాంటిది. మీమీద నమ్మకం లేక కాదు. అతన్ని కలిసినందువలన మీకు వచ్చే నష్టం ఏమీ లేదు. కలవనందువలన నన్ను బాధ పెట్టిన వారవుతారు."

"దట్స్ ఆల్! మీకోసం కలుస్తాం! అయినా నేను కాదు మా ఇన్‌స్పెక్టర్ శర్మ."

"థాంక్స్!" అన్నది.

ఆమె డి.ఐ.జి.గారి వద్దనుండి సెలవు తీసుకున్నది. డి.ఐ.జి.గారు ఎస్.పి.గారితో చెప్పారు.

డి.ఐ.జి. గారికి యస్.పి.గారికి శ్రావణ్‌ను కలవటం చాలా అవమానకరంగా వుంది. వారికి వారి ప్రతిభపై యెంతో విశ్వాసం. వారి సర్వీసులలో యెంతోమంది యింటర్ నేషనల్ క్రిమినల్స్‌ను పట్టుకోగలిగారు. ఎన్నో సార్లు చావునుండి బయటపడగలిగారు. ఇప్పటికి మూడు సార్లు రాష్ట్రపతి అవార్డు పొందారు.

అంతటి ప్రతిభగలవారు ఈ చిన్న కేసు విషయంలో శ్రావణ్ సహాయం పొందటమా? నిజంగా యిది ఊహింపని విషయం. శ్రావణ్‌ను కలవటం వారికి ఇష్టం లేదు.

రెండు రోజులు గడిచాయి.

ప్రయోజనం శూన్యం. సేట్ జీ భార్య ప్రతి గంటకు ఒకసారి ఫోన్ చేస్తుంది.

యస్.పి. గారికి తల తిరుగుతుంది.

ఇన్‌స్పెక్టర్ శర్మను పిలిచారు.

శర్మ వినయంగా నమస్కరించాడు.

"శర్మగారూ! మీరు వెంటనే శ్రావణ్‌ను కలవండి! సేట్ చాంద్ జీ ఎక్కడ వున్నాడో చెప్పమనండి!"

శర్మ ఆశ్చర్యపోయాడు. శర్మకు బాబాలన్నా స్వామీజీలన్నా గౌరవం. ఇలాంటి మానవాతీత శక్తులుంటాయంటే నమ్మేవారిలో ప్రథముడు. తనకు తెలిసినంత వరకూ యస్.పి.గారు వారికి విలువ నివ్వడు. భుక్తి కోసం వారు చెప్పే మాటలని కొట్టిపారవేస్తాడు. అలాంటి యస్.పి.గారు తనను శ్రావణ్ వద్దకు వెళ్ళి రమ్మని అంటున్నాడంటే అతను ఆశ్చర్యపడకుండా ఉండలేకపోతున్నాడు.

"అలాగే కలుసుకుంటాను సార్! చూడండి సార్! మీలో ఈ నాడు మార్పు వచ్చింది. అందుకు సంతోషం. శ్రావణ్ మనకు బాగా ఉపకరిస్తాడు సార్!"

"శర్మా! శాస్త్ర నోటికి కళ్ళెంవేసి చెప్పిన పని చెయ్యి" విసుగ్గా అన్నాడు.

"మూడీ పెలో!" అనుకుంటూ శాల్యూట్ చేసి బయటపడ్డాడు.

అందరు పైకి దేముడు లేదంటారు. ఇంటికిపోయి

కొబ్బరికాయలమీద కొబ్బరికాయలు కొడతారు అను కున్నాడు.

# 14

"శ్రావణ్ గారూ! నమస్కారం" రెండు చేతులెత్తి నమస్కరించాడు శర్మ.

"నమస్కారం!" ప్రతి నమస్కారం చేశాడు.

"నాకు మీరంటే గౌరవం. ఒక్కమాటలో చెప్పా లంటే భక్తి. మీరు గొప్పవారని నాకు తెలుసు. నేను చాలా కాలంనుండి యీ ఇన్‌స్పెక్టర్‌గానే పడి వున్నాను."

"మీరు వచ్చిన పని?"

"అదా....? చెప్తాను సార్! మీకు అంతా తెలుసు. చూడండి. క్షణంలో నేను వచ్చిన పని కనిపెట్టారు. ఈ మధ్య సేట్ చాంద్ జీ కనిపించకుండా పోయాడు. అతని భార్య లకమన్ ప్యారీకి మీమీద విశ్వాసం. ఆమె మిమ్మల్ని కలవమన్నది. సేట్‌జీ ఆచూకి చెప్పగలవారు మీరేనని యస్. పి. గారు కూడా అన్నారు."

ఆతను ఆలోచనలో పడ్డాడు.

"దీన్ని గురించి అంతగా ఆలోచింపవలసిన పనిలేదు సార్! చెట్టంత మనిషి ఎక్కడికిపోతాడు. సేట్‌జీకి డబ్బుపై వ్యామోహం యెక్కువ బిజినెస్ పనిమీద అమెరికాకో, లండన్‌కో, వెళ్ళి ఉంటాడు. ఈ రోజు కాకపోతే మరు రోజు ఇంటికి వస్తాడు. రాక చస్తాడా?"

"మీరు రేపు రండి!" అన్నాడు శ్రావణ్.

"అలాగే! సేట్ జీ ఆమాకీ అంత యింపార్టెంట్ కాదు సార్! కాని నా విషయం మీరు చెప్పాలి!"

"మీరు రేపు రండి!"

"అలాగే! నేను చాలా సంవత్సరాలనుండి యిదే పోస్టులో పడివున్నాను."

"మీరు రేపు రండి!" మరలా అన్నాడు.

"చిత్తం సార్!" అని నా టైం బాగా లేదు అని అనుకుంటూ బయటకు వచ్చాడు.

శర్మ వెళ్ళిన తర్వాత శ్రావణ్ ఆలోచనలోపడ్డాడు. సేట్ చాంద్ జీని చంపక తప్పలేదు. ఈ హత్యానేరం నుండి బయటపడాలి. ఇన్‌స్పెక్టర్ శర్మ తనవద్దకే రావటం ఒకందుకు మంచిదే! సీతాదేవి నంబర్‌కు రింగ్ చేశాడు.

"హలో!" అన్నాడు.

"నేను సీతాదేవిని మాట్లాడుతుంట. మీ రెవరు?"

"సీతాదేవీ!"

"నీవా శ్రావణ్! ఏమిటిలా ఫోన్ చేశావు?"

శ్రావణ్ శర్మ వచ్చి వెళ్ళిన విషయం చెప్పాడు.

"శ్రావణ్! వెదకబోయిన తీగె కాళ్ళకు తగిలిందట. నేను కొన్ని నిముషాలలో నీ వద్దకు వస్తాను. ఓ ప్లాన్ చెబుతాను. అలా చేయటం శ్రేయస్కరం."

"వెంటనే వస్తావు కదూ?"

"ష్యూర్! పదినిముషాలలో నీ ముందుంటాను" ఫోన్ పెట్టింది.

సీతాదేవి వెంటనే బయలుదేరి శ్రావణ్ వద్దకు వచ్చింది. శ్రావణ్ ఆమె కొరకే ఎదురు చూస్తూ

న్నాడు.

"రా! సీతాదేవీ!"

"శ్రావణ్!" ఆమె వచ్చి అతని కెదురుగా కూర్చున్నది.

"ఇప్పుడేం చేయటం?" అడిగాడు.

"శ్రావణ్! ఇన్‌స్పెక్టర్ నీ శక్తిపై నమ్మకం కలిగి వుండటం మనకు మంచిదే! సేట్ చాంద్ జీని చంపినది మనమే అని పోలీసులే కాదు ఆ దేవుడు కూడ తెలుసుకోలేడు. ఘూర్ఖా గాని, సేట్ జీ భార్యగాని మనల్ని సరిగా చూడలేదు.

నీవు ఈ రాత్రి సేట్ జీని చంపింది అతని తమ్ముడు మణిరాం, అతని భార్య మనోహారిభాయి అని వారి బొమ్మలను సేట్ జీని చంపుతున్నట్లు గీచి యివ్వు! డబ్బు కొరకు సేట్ జీని చంపింది వారేనని లోకం నమ్ముతుంది. పోలీసులు కేసు పెడతారు."

"యస్! బాగానే ఉంది. కాని వారిని నేను చూడలేదు."

"వారు ఒకసారి నా వద్దకు వచ్చారు. ఒకసారి ఓ పార్టీలో నాతో కలిశారు. వారి ఫోటోలు నా వద్ద వున్నాయి."

"వాటిని నాకివ్వు."

"అలాగే! జాగ్రత్త! వారి ముఖాలు జాగ్రత్తగా గీయి. సేట్ జీ తమ్ముని భార్య పెదవులమీద కొట్టవచ్చినట్లు ఓ పుట్టుమచ్చ వుంది."

"అయ్యో నాకా జాగ్రత్తలు చెప్పవలసిన పని లేదు."

"వెళ్ళొస్తాను. ఈ కేసు పూర్తయేవరకు మనం కలుసుకోవద్దు! నేను నీవద్దకు రాను."

"నీ ఇష్టం."

ఆమె వెళ్ళిపోయింది.

ఆ రోజు సాయంకాలం సీతాదేవి సేట్ జీ తమ్ముడు మణిరాం, మనోహరిబాయిలతో వున్న వివిధ పోజుల ఫోటోలు శ్రావణ్ కు అందజేసింది.

సేట్ జీని మణిరాం హత్య చేసినట్లు, ప్రక్కన మనోహరిబాయి వున్నట్లు చిత్రం గీయాలి.

ఆ రాత్రి ధ్యానంలో కూర్చోలేదు.

ఆలోచిస్తూ పన్నెండు గంటలవరకూ గడిపాడు. తర్వాత చిత్రం గీయటానికి ఉద్యుక్తుడైవాడు.

చిత్రం తయారయింది.

చిత్రంలో సేట్ జీని అతని తమ్ముడు మణిరాం చంపుతున్నట్లు గీశాడు. ప్రక్కన మనోహరిబాయి వున్నట్లు ఆమెను గీశాడు. చిత్రం బ్రహ్మాండంగా వుంది. సేట్ జీ పడకగది క్రింద వున్న సీక్రెట్ గది కూడా రియల్ గా ఎలా వుందో చిత్రంలో కూడ అలాగే వుంది.

మరురోజు దాన్ని ఇన్ స్పెక్టర్ శర్మకు యివ్వాలి.

శ్రావణ్ ఒకసారి చిత్రాన్ని చూశాడు. సీతాదేవి యిచ్చిన ఫోటోలను చూశాడు. రెండింటిలో వున్న వ్యక్తులు ఒక్కలాగే వున్నారు. చిత్రంలో మణిరాం, అతని భార్య ఫోటోలో ఉన్నట్లే వున్నారు. తృప్తిగా నవ్వుకున్నాడు.

చిత్రాన్ని డ్రాయర్ లో వుంచాడు.

మరురోజు ఇన్‌స్పెక్టర్ శర్మ వచ్చాడు.

"నమస్కారం సార్!" అన్నాడు.

"నమస్కారం!"

"సార్! సేట్ జీ నేను అనుకున్నట్లు అమెరికా వెళ్ళారా?"

"ఇన్‌స్పెక్టర్ గారూ! ఈ చిత్రం మీ యస్.పి.గారికివ్వండి!" సొరుగునుండి రాత్రి గీసిన చిత్రం తీసి యిచ్చాడు.

"నాకు తెలుసు సార్! మీలో గొప్పశక్తులున్నాయి" అంటూ చిత్రాన్ని తీసుకున్నాడు.

ఇన్‌స్పెక్టర్ చిత్రం చూసాడు.

నెత్తిపై పిడుగుపడ్డట్లు అదిరిపడ్డాడు.

"సార్! ఇది...." అతని నోటమాట రాలేదు.

"యస్ ఇన్‌స్పెక్టర్. సేట్ జీ తమ్ముడే హంతకుడు. డబ్బుకొరకు హత్య చేసాడు. అతని ప్రక్కనున్నది అతని భార్య!"

"సార్..."

"వెళ్ళండి! వెళ్ళి మీ యస్.పి.గారికి చూపండి! వారిద్దరినీ అరెస్టు చేయుమనండి!"

ఇన్‌స్పెక్టర్ శర్మ చైతన్య రహితంగా లేచాడు. దయ్యం పట్టినవాడిలా శ్రావణ్‌ను చూసి, పరుగున బయటకు వచ్చాడు. పోలీస్ జీపులో ఎలా కూర్చున్నాడో అతనికే తెలియదు.

"యస్.పి. బంగ్లా!" అన్నాడు డ్రైవర్‌తో.

డ్రైవర్ జీపును బంగ్లావైపు పోనిచ్చాడు.

యస్.పి.గారు బంగ్లాలో తీరిగ్గా కూర్చుని ఉన్నాడు.

"సార్!" అంటూ వచ్చాడు శర్మ.

"వ్వాట్ శర్మగారూ! ఏమిటా చెమటలు? టేక్ రెస్టు, నెమ్మదిగా చెప్పండి!"

"ఇదిగో సార్! ఈ చిత్రం చూడండి! ఎంతో భయంకరంగా వుంది" చిత్రం యస్.పి.గారి ముందు పెట్టాడు.

యస్.పి.గారు ఆ చిత్రంలోని వ్యక్తులను చూసి దిగ్భ్రాంతి చెందారు. ఇదెలా సాధ్యం?

కొన్ని క్షణాలవరకూ నోటమాటరాలేదు.

## 15

మరురోజు పేపర్లలో నేట్ జీ హత్యను చిత్రంతో సహా మొదటి పేజీలో ప్రచురించారు పత్రికలవారు. ఆ వార్త నిజంగా సంచలనమే సృష్టించింది. ప్రతి ఒక్కరూ చదివి ఆశ్చర్యంతో మ్రాన్పడిపోయారు.

డబ్బుపై వ్యామోహం, అధికారం చేజిక్కించుకోవాలనే ఆరాటం, సుఖాలను పొందాలనే తపన అందుకు ఘోరాలను చేయటం ఎంతటి గొప్పవాడినైనా క్రిందకు పడదోస్తుంది. పదవులు అధిరోహించాలనే అభిలాష ఉండటం మంచిదే! అందుకు ప్రజాసేవ, ప్రజల మన్ననలను పొందటం మార్గంకాని, మానవాతీతశక్తులతో హత్యచేసి, డబ్బు దోచుకొని యం.యల్.ఎ.లను కొనాలనుకోవటం మార్గం కారాదు. రాజకీయ నాయకులు స్వామీజీలను ఆశ్రయించటం నేడు పరిపాటి అయింది.

జీవం ఈ ప్రపంచంలో వుద్భవించిన వద్దనుండి మానవుని పుట్టుక, మనుగడ, మరణం అన్నీ విచిత్రంగా కనిపిస్తాయి. సైన్సు నానాటికి అభివృద్ధి చెందుతుంది. మానవుడు సర్వసుఖాలు అతని కాళ్ళవద్దకు వచ్చేలా

సృష్టించుకుంటున్నాడు. కాని భగవంతుని సృష్టిని చాలెంజ్ చేయలేకపోతున్నాడు. శ్రీరాముడు కూడ మామూలు మనిషే అని చదువుతున్నా, రాముని దేవునిగా మార్చిన గుణాలు నీతిగా మనుగడ సాగించటం, అతని లోని సోదర ప్రేమ, ఆలుమగల ఆదర్శం, అవినీతిని అణచటంలో కాఠిన్యం అలవర్చుకోలేక పోతున్నాడు. అనామకునిగా రాలిపోతున్నాడు.

ప్రపంచంలో కొందరు గొప్పవారుగా అవటానికి నిరంతరం శ్రమిస్తూనే వుంటున్నారు. ఒక్కోసారి ఆ కాంక్ష ప్రకోపించి అల్పులుగా, అధఃపాతాళానికి జారిపోతున్నారు.

శ్రావణ్ కు కొన్ని శక్తులు వచ్చాయి. శ్రావణ్ ఆ శక్తులను యితరులకు మేలుచేయటానికి, అన్యాయాలను ఎదుర్కొనటానికి బాగానే ఉపకరించాయి. సీతాదేవికి దాసుడై పదవి పొందాలనే కోరికతో డబ్బు సంపాదిద్దామని సేట్ జీని హత్యచేయడానికి పాల్పడ్డాడు. ఆ శక్తులు అతనికి ఎదురు తిరిగాయి. శ్రావణ్ తనను తాను మోసగించుకోగలిగాడు. అతని శక్తులు మోసగించలేదు. ఆ శక్తులు నిష్కళంకంగా మనుగడ సాగిస్తేనే ఉపకరిస్తాయని తెలుసుకోలేకపోయాడు.

చిత్రంలో యస్.పి.గారికి, ఇన్ స్పెక్టర్ శర్మకు కనిపించింది శ్రావణ్ సేట్ జీని హత్యచేయటం. ప్రక్కన సీతాదేవి వుంది.

యస్.పి.గారు హుటాహుటిన వెళ్ళి సేట్ జీ పడకగది క్రిందవున్న సీక్రెట్ గదిని పగులగొట్టి సేట్ జీ

శవాన్ని బయటకు తీశాడు.

శ్రావణ్ ఇంటిమీదకు దాడిచేశారు.

శ్రావణ్ ఇంటిలో క్యాష్‌తో నిండుగా ఉన్న ఒక సూట్ కేసును స్వాధీనం చేసుకున్నారు.

శ్రావణ్‌ను కస్టడీలో తీసుకున్నారు. ఇంటరాగేషన్‌లో సీతాదేవి విషయం బయటపడింది. ఆమె ఇంటిపై కూడ దాడిచేశారు. అక్కడ రెండో సూట్ కేస్ దొరికింది. ఆమెను అరెస్టుచేశారు.

కోర్టువారు శ్రావణ్‌కు ఉరిశిక్ష విధించారు.

సీతాదేవికి యావజ్జీవ ఖైదుగా శిక్ష విధించారు.

ముఖ్యమంత్రిగారు శ్రావణ్, సీతాదేవి కలిసి తనపై పన్నిన కుట్రకు బాధపడ్డారు.

—:అయిపోయింది:—

సీరియల్ -

# ఎడారి కోయిల

## బొమ్మిడి అచ్చారావు

(గత సంచిక తరువాయి)

గది సువాసనలతో మత్తెక్కిస్తోంది. నాలుగైదు రకాల టాయిలెట్ సబ్బులు టబ్‌మీద పెట్టి వున్నాయి.

రాజుల స్నానాల గదులు ఇలా వుంటాయన్నమాట! అనుకున్నాడు అబ్బురంగా. ఫైవ్ స్టార్ హోటల్స్‌లోని బాత్‌రూమ్స్ కూడా ఈ బాత్‌రూం ముందు దిగదుడుపే అనిపించింది — వాటితో బాగా పరిచయమున్న సిద్ధార్థ.

అయితే ఈ రాజవంశీకులు సబ్బుల్ని ఉపయోగించటంకూడా అబ్బురంగానే ఉన్నదనిపించింది. మళ్ళీ అంతలోనే ఆధునిక కాలంనాటి రాజకుటుంబం కదా, యిప్పటి పద్ధతుల్నే అనుసరిస్తూ ఉంటారు. అనుకుని సరిపెట్టుకున్నాడు.

మల్లెపూలకన్న తెల్లగా వున్న నాలుగు తుండ్లు అక్కడున్న వంకీకి తగిలించి, "స్నానం కానివ్వు"

అన్నది ప్రమద్వర చిరునవ్వుతో.

సిద్ధార్థ తనూ నవ్వి, "మరి నువ్వికవెళ్తే.........!" అన్నాడు.

"ఏం, నేనిక్కడ యిలా నిల్చుని వుండగా చెయ్యలేవా? నీకేదైనా అవసరపడితే చూడాలి కదా!?" అన్నది.

"అబ్బే, ఏమీ అవసరముండదు—అన్నీ ఇక్కడే అమర్చి పెట్టావు కదా!" అన్నాడు బిడియంగా సిద్ధార్థ.

ప్రమద్వర అతన్ని సమీపించి రెండు చేతుల్తోను అతని గుండెలమీద సున్నితంగా మోది, వెనక్కి, టబ్ లోపలికి నెట్టింది నవ్వుతూ.

బాలెన్స్ తప్పి టబ్‌లో పడిపోయాడు సిద్ధార్థ. నీళ్ళు చింది ప్రమద్వర కూడా సగానికి పైగా తడిసిపోయింది. ఆమె అందాలు తడిచీరలో నుంచి ప్రస్ఫుటంగా కనిపించి అతని నరాల్ని వీణతీగల్లా మీటాయి.

బలవంతాన చూపు తిప్పుకుని, "ప్లీజ్, నువ్వు వెళ్తే నా పని పూర్తిచేసుకుని వస్తాను" అన్నాడు.

టబ్ దగ్గరగా వంగి నిల్చుని అతని కళ్ళల్లోకి చూస్తూ "నేను నిన్నేమీ దోచుకోనులే! కానివ్వు" అన్నది.

పన్నీరు అతని శరీర మలినాన్ని చాలావరకు అప్పటికే తొలగించి ఒంటికి హాయిగా చల్లగా తగుల్తూ అతన్ని ఏవో ఊర్ధ్వలోకాలకు తీసుకుపోతుంటే, ఒంగున్న ఆ సుందరి తన సహజ సౌందర్యంతో అతనికి కనువిందు చేస్తూంటే, ఆ క్షణాలు శాశ్వతంగా వుంటే యెంత

శావుండునని పించింది సిద్ధార్థ యువ హృదయానికి!

తనక్కడుంటే అతనలా బిగుసుకుపోయి ఉండిపోతాడని గ్రహించి, సమ్మోహనంగా ఓ చూపు అతనిమీద ప్రసరించి, స్నానాల గదినుంచి బయటకు నడిచింది ప్రమద్వర.

ఎన్ని గంటలసేపు అతనలా టబ్బులో ఈదుతూ స్నానం చేశాడో అతనికే తెలీదు. ఎంతసేపు చేసినా తనివితీరలేదు. సంవత్సరాలు తరబడి స్నానం చెయ్యని వాడిలాగా, నీటికి మొహం వాచిన వాడిలా, నాలుగు టబ్బుల్లోను హాయిగా స్నానంచేసి పైకి వచ్చాడు సిద్ధార్థ.

మల్లెపూవులాంటి ఓ తుండుతో తుడుచుకుని మరో దాన్ని నడుముకు చుట్టుకుని బయటికొస్తూ తను విప్పిన దుస్తుల్ని ఓరకంట చూశాడు సిద్ధార్థ. అవి జీర్ణమైపోయిన ఓ రోగిష్టి గుడ్డల్లా కనిపించి ఒళ్ళు కంపరమెత్తింది.

ఎడమచేత్తో ఆ గుడ్డల్ని ఎత్తిపట్టి స్నానాల గదికి పైనున్న వెంటిలేటర్ గుండా అవతలకు తోసేశాడు సిద్ధార్థ.

అప్పుడతని మనసు హాయిగా నిశ్వసించింది. శరీరం గాల్లో తేలిపోతున్నట్టు ఏవో దివ్యలోకాల్లో విహరిస్తున్నట్టు అనుభూతి కలిగింది.

అతను స్నానాల గదినుంచి బయటకు వచ్చేసరికి అక్కడ ప్రమద్వర సిద్ధంగా నిల్చుని వున్నది.

తడిసిపోయిన దుస్తుల్ని విడిచిపెట్టి వేరే దుస్తులు ధరించింది. ఇప్పుడామె చీర కట్టుకుని లేదు. మోకాళ్ళ

కింద వరకు మాత్రం నైట్ గౌన్ను ధరించి వుంది. గులాబి రంగు గల ఆ గౌను, ఆమె గులాబిరంగు ఒంటికి అద్భుతంగా మేచ్ అయింది.

ఎక్కడ వుండాల్సిన ఎత్తుపల్లాలు అక్కడ అఖండంగా అమరిపోయిన ఆమె శరీరం—నిష్ణాతుడైన శిల్పి అహోరాత్రాలు కష్టపడి మలచిన అసామాన్య కళాఖండంలా ఉంది.

ప్రమద్వర మీదినుంచి ఓ పట్టాన చూపు మరల్చుకోలేకపోయాడు సిద్ధార్థ.

ఆమె అలవోకగా చేతినందించి అతన్ని మునివేళ్ళతో పట్టుకొన్నది. అక్కడ వెల్తురు అంతగా లేదు. అసలే అతి తక్కువ వెల్తురు నందిస్తున్న దీపాలు, ఆ దీప కాంతి అక్కడ చాలా పలచగా పరచుకోవటంతో చీకటిగా ఉంది.

ప్రమద్వర కేవలం ఓ తుండుగుడ్డ నడుముకి చుట్టుకుని మరొకదాన్ని భుజాలమీదుగా కప్పుకుని ముప్పాతిక వంతు నగ్నంగా వున్న అతని దృఢమైన శరీరంవైపు కన్నార్పకుండా చూస్తోంది.

తలమీదుగా, అందంగా పెరిగిన గడ్డాన్ని తడుపుతూ గుండెలమీదికి జారుతున్న పన్నీటి బిందువులు ఆమె కళ్ళకు ముత్యాల్లా కనిపిస్తూన్నాయి. అతని అందమైన ముఖానికి ఆ చిరుగడ్డం గొప్ప అందాన్నిచ్చి మెరుగులు దిద్దింది.

ఆమె తననంత సూటిగా, నిస్సంకోచంగా చూస్తూంటే సిగ్గేసింది సిద్ధార్థకు.

"నా గుడ్డలు...." అంటూ బిడియంతో ఆ పేశాడు అర్థాంతరంగా.

అర్థవంతంగా అతని వైపుచూసి, "ఇలాగే బావు న్నావు" అన్నది.

"అయితే నాకు దుస్తులు లేవా?" అన్నాడు కొంటెగా.

"నన్ను చుట్టుకో!" అందామె

త్రుళ్ళిపడి చూశాడామె వంక.

"పోనీ, నేనే నిన్ను చుట్టుకోనా?" రెండు చేతులూ అతని భుజాల చుట్టూ పోనిచ్చి చటుక్కున మీదికి లాక్కుంది ప్రమద్వర.

"నో, నో! వద్దు, వద్దు" అన్నాడు ఖంగారుగా.

ఆమె కిలకిల నవ్వి అతన్ని వదిలిపెట్టింది.

"అవును, ఇక్కడొద్దు" అన్నది.

ముందుకు కదిలింది రాయించలా. వెన్నంటి బెరుకుగా నడిచాడు.

ఇదివరకటి గదిలోకి ప్రవేశించారు ఇద్దరూ.

లోపలికి ప్రవేశిస్తూనే ఆ గదిలో జరిగిన మార్పులు చూసి నివ్వెరపోయాడు సిద్ధార్థ.

గదినిండా మల్లె జాజి సంపెంగల మాలలు తోరణాలుగా వేలాడుతున్నాయి. బెడ్ మీద పాలవెన్నెల్లాంటి తెల్లటి దుప్పటి పరచి, దానిమీద గులాబీలు, విరజాజులు, మల్లెలు చల్లబడి వున్నాయి. అగురొత్తుల ధూపంతో ఆ గది గుబాళించిపోతోంది.

మత్తుగా చూశాడామె వంక.

ఆమె అంతకన్న మత్తుగా పరవశంగా చూస్తోందతని వంక. ఆమె చూపుల్లో ఆర్తి, ఆరాధన, అనురక్తి అన్నీ అలుముకుని అతని మనసుని తాకు

టున్నాయి.

ఆమె చేయిచాచి అతన్నందుకున్నది. భుజంమీది తుండు నేల జారిపోయింది. అనాచ్ఛాదితమైన అతని విశాల భుజాలు, సువిశాలమైన ఛాతీ ఆమె కళ్ళకు విందుచేశాయి.

అతని నడుమ్మీద ఆమె చెయ్యి పడింది.

చటుక్కున ఆమె చేతిమీద తన చేతిని వేసి పక్కకు తొలగించి, "తప్పు!" అన్నాడు సిద్ధార్థ.

"నువ్వంటే అనురక్తి పెంచుకున్నాను. నిన్ను నా ప్రాణేశ్వరుడిగా భావిస్తున్నాను. నన్ను వరించి నా యవ్వనాన్ని సార్థకం చెయ్యి. మన్మథ సామ్రాజ్యాన్ని ఇద్దరం యథేచ్ఛగా ఏలుకుందాం, రా!" అంటూ తను పక్కమీద వాలిపోతూ బలంగా అతన్ని మీదికి లాక్కుంది ప్రమద్వర.

సిద్ధార్థ పక్కమీద పడిన వెంటనే స్ప్రింగులా లేచి నిలబడి, "వద్దు రాకుమారీ! నీవంటి రాచబిడ్డ నాలాంటి సామాన్యుడ్ని వరించటం లోకవిరుద్ధం! దయచేసి నీ ఉద్దేశ్యాన్ని మార్చుకో. నా దారిన నన్ను పోనివ్వు" అన్నాడు.

ప్రమద్వర చిరునవ్వుతో అతన్ని చూస్తూ, "నేను రాకుమారిని కాదు. రాజ్యాలు పోయాయి. కేవలం ఆలనాటి వైభవంలో వెయ్యో వంతుకూడా మిగల్లేదు. నేను కూడా ఇప్పుడు సామాన్యురాలినే!" అన్నది.

"కాదు, అలా ఎన్నటికీ కాదు. నువ్వు రాచవంశానికి చెందిన క్షత్రియ కన్యవు. నే నతి సామాన్య పౌరుడ్ని."

"నీతో నిజం చెప్తున్నాను. రాజ్యాలు, రాచరికాలు పోయి చాలా ఏళ్ళయింది. మా తండ్రిగారిప్పుడు సామాన్యమైన కుటుంబీకులు. రాజభరణాలు కూడా రద్దుచేయబడ్డాయి. కొన్నాళ్ళు జమీందారీలున్నాయి. ఇప్పుడవి కూడా పోయాయి. మేము మహల్లో నివసిస్తున్న సామాన్యులం."

"కాదు....కాదని మీ పరివార జనం, మీ రాచ భవనాలు రుజువు చేస్తున్నాయి. అంతెందుకు మీ స్నానాల గదిలోని పన్నీటి జలకాలు మీ వైభవానికి తిరుగులేని సాక్ష్యాలు! నువ్వు నన్ను మభ్యపెట్టాం అని ప్రయత్నించకు. మీది సామాన్య కుటుంబం కాదు, అతి సంపన్నమైన జమీందారీ కుటుంబం అవునా?"

"ఓహ్, ఎంత చెప్పినా నువ్వు నమ్మటంలేదు....సరే, మా వంశం గురించి, మా వైభవాల గురించి కాసేపు మరచిపో. నేను వయసులో వున్న స్త్రీని. నువ్వు వయసున్న అందగాడివి, మగాడివి, నా దృష్టిలో మొనగాడివి. అది చాలు మనిద్దరిమధ్య అనుబంధం పెనవేసుకోవటానికి. ఈ అపురూపమైన రాత్రిని వ్యర్థం చేసి నాకు మనోవ్యథ కలిగించకు, రా.." అంటూ ఈసారి బలంగా అతన్ని పక్కమీదకు గుంజింది ప్రమద్వర.

అదురుబాటుగా నిల్చున్న సిద్ధార్థ సరిగా ఆమె గుండెలమీద పడిపోయాడు. ఆమె చేతులు అతన్ని నాగుబాముల్లా పెనవేసుకుని తనమీదకు అదుముతున్నాయి. ఆమె సుతిమెత్తని అందాలు అతని కర్కశమైన గుండెలకి బలంగా ఒత్తుకున్నాయి.

ప్రమద్వర ఆర్తిగా, కాంక్షగా అతని పెదాలందు కొని కొరికింది.

"అబ్బా!" అన్నాడతను, తెగిన పెదిమను తడివి చూసుకుంటూ.

ఆమె చేతులు అతని నడుమ్మీద ఆచ్ఛాదనను కూడా తొలగించబోతుంటే "ఊఁ, ఏమిటీ అల్లరి?" అన్నాడు బలంగా, తుండు జారిపోకుండా పట్టుకుంటూ.

"ఇక్కడ నువ్వు, నేను తప్ప మరెవరున్నారు ప్రియా! నా దగ్గరెందుకు సిగ్గు? ఎందుకలా సంకోచిస్తావు? నేనందంగా లేనా? నీ మనసును రంజింపచేయలేక పోయిందా నా లావణ్యం? నీ మొగతనాన్ని రెచ్చగొట్ట లేకపోయిందా నా సౌకుమార్యం?"

ఆమె అతన్ని నలిపేస్తోంది. అంతకంతకీ అతన్ని బలంగా హత్తుకుంటోంది.

సిద్ధార్థలోని మగాడు విజృంభిస్తున్నాడు. అంతవరకు నిద్రాణంగా వున్న కోర్కె జూలు దులుపుకుని లేచిన సింహంలా కదను తొక్కటానికి సిద్ధంగా వుంది.

సరిగ్గా అప్పుడే ఉరుముకన్న గంభీరంగా ఓ గర్జన వినిపించింది—

"ప్రమద్వరా..." అంటూ.

ఆ గదిగోడలు పగుళ్ళు తీసివుంటాయా గర్జనకు.

ప్రమద్వరతోబాటు సిద్ధార్థకూడా పక్కలో బాంబు పడ్డట్లు అదిరిపడ్డాడు. అస్తవ్యస్తంగా వున్న తుండును సరిగ్గా సర్దుకుని కుంచించుకుపోతూ గుమ్మంవైపు తల తిప్పి చూశాడు.

గుమ్మం పొడవునా సాగిన ఆ భీకర రౌద్రాకారాన్ని

చూడగానే అతనిపై ప్రాణాలు పైనే ఎగిరి పోయాయి.

"ఏమిటీ విచ్చలవిడితనం? రాచపుట్టుక పుట్టి అత్యంత వైభవంగా పెరిగి, మచ్చలేని మన వంశ ప్రతిష్టను, గౌరవాన్ని మంటకలిపి, ఇంతటి నీచానికి దిగజారతావా? ఇప్పుడే మీ ఇద్దర్ని ఒకే వేటుకి తెగేసి, నా వంశానికి పట్టిన గ్రహణాన్ని తొలగిస్తాను" అంటూ ఛర్రున ఒర నుండి కత్తిని దూశా డాయన.

దాదాపు ఆరడుగుల పొడవులో పోతపోసిన విగ్రహంలావున్న ఆ వ్యక్తి చేత కత్తిని ధరించిన ప్రళయకాల రుద్రుడిలా వున్నాడు.

ప్రమద్వర, సిద్ధార్థల గుండెలవిసిపోయాయి ఆ దృశ్యం చూసి.

మరుక్షణం సిద్ధార్థ తల మొండెంనించి వేరు పడేదే. అంతలోనే ప్రమద్వర అతనికి అడ్డుగా వచ్చి చేతులు జోడించి-

"తండ్రీ నన్ను క్షమించండి. మీ అభీష్టానికి వ్యతిరేకంగా, మీకు ముందుగా ఇతన్ని పరిచయం చేయకుండా హద్దుమీరబోయినందుకు సిగ్గుపడుతున్నాను. మిమ్మల్ని మొక్కుతున్నాను. నా ప్రార్థన ఆలకించండి" అన్నది.

"ఛీ ఛీమీ వినదలచుకోలేదు. మీ యిద్దర్నీ ఈ క్షణమే నరికి మీ రక్తంతో నా వంశ అప్రతిష్ఠను కడిగేసుకుంటాను........" వీరావేశంతో ఊగిపోతున్నా డాయన.

"తండ్రీ! తప్పుచేసింది నేను. నన్ను నరకండి, చంపండి! కాని, ఇతను అమాయకుడు—నేను తీసుక

శత్రువే మన కోటలో ప్రవేశించాడు. అతన్ని ప్రేరేపించింది కూడా నేనే! మీరు విధించే శిక్షను పూర్తిగా నేనే అనుభవించాలి. అతన్ని క్షమించి నన్ను నరికి నా పాపాన్ని ప్రక్షాళన చెయ్యండి.

"లేదా... మా ఇద్దరికీ పెళ్ళి జరిపించండి. మీ వంశ మర్యాద నిలబడటమేగాక నేను కోరుకున్న వరుడితో నా పెళ్ళి జరుగుతుంది. నా కోరిక ఈడేరుతుంది. ఏం చేసినా, అది తమ ఇష్టం. తమ దయకోరకు ప్రార్థిస్తున్నాను" చేతులు జోడించి కన్నీటితో వేడుకున్నది ప్రమద్వర.

"ఈ సంగతి నువ్వు వీడితో హద్దుమీరకముందు చెప్పివుంటే మాకు కనికరం కలిగి ఉండేదేమో! కాని ఇప్పటికే ఆలస్యమయింది. ఇష్టదైవాన్ని తల్చుకో!" అంటూ కత్తి ఎత్తాడాయన.

నిర్భయంగా కళ్ళు మూసుకుని నిశ్చలంగా నిల్చుంది ప్రమద్వర.

మరుక్షణం ప్రమద్వర తండ్రి చేతనున్న ఖడ్గం ఆమె తలను మొండేన్నుంచి వేరుచేసింది.

గుండెలను బద్దలుచేసే ఆ భీకర దృశ్యం చూడగానే సిద్ధార్థ ప్రళయ భయంకరంగా అరిచాడు.

"ప్రమద్వ....రా...." అంటూ ఆక్రోశించింది అతని హృదయం.

ఆ ఉత్తర క్షణమే కత్తి సూటిగా సిద్ధార్థ కంఠాన్ని తాకింది.

"వద్దు, వద్దు....నన్ను చంపొద్దు" అంటూ ఆర్తనాదం చేశాడు సిద్ధార్థ.

• • •

"వద్దు, వద్దు....నన్ను చంపొద్దు" అంటూ అరుస్తూనే వున్నాడు సిద్ధార్థ.

అతనికి చటుక్కున మెలకువ వచ్చింది.

కళ్ళు తెరవబోయాడు కాని కనుకొలకుల్లో ఇంకా చిక్కుకుని ఉన్న ఇసక అట్టకట్టి అతన్ని కళ్ళు తెరవనీయలేదు.

తనిప్పు డెక్కడున్నాడు? తనకేం జరిగింది? తను బతికే వున్నాడా? తన తల మొండెంనించి వేరు కాలేదా?

సంభ్రమంగా తల తడుముకున్నాడు. తన తల మొండెంనించి వేరు కాలేదు; భద్రంగానే వుంది.

అయితే జరిగిందంతా కలా?! ఎంత భయంకరమైన కల! తను అదంతా నిజమేనని భ్రమించాడు.

ఇప్పుడు ఈ లోకంలోకి వచ్చాడా, ఇంకా కల కొనసాగుతూనే వుందా?!

గిచ్చి చూసుకున్నాడు. నొప్పి తెలిసింది. నిజమే, ఇదిమాత్రం కలకాదు.

అయితే తనిప్పుడెక్కడున్నాడు? నేల తడుము న్నాడు. పచ్చిక తగిలింది చేతికి.

కళ్ళు మళ్ళీ తెరవటానికి ప్రయత్నించాడు. సాధ్యం కాలేదు—కళ్ళముందు అంతా అంధకారం. భరించలేని అంధకారం!

మోచేతి దగ్గరున్న వట్టు చేత్తో కళ్ళమీది ఇసుకని తుడుచుకున్నాడు. కొద్దిగా కళ్ళు తెరవగలిగాడు. కను రెప్పలమీదినుంచి జారిన ఇసక రేణువులు కంటిపాపను తాకి భగ్గుమన్నాయి కళ్ళు.

అప్రయత్నంగా మళ్ళీ మూసుకున్నాడు. లాభంలేదు,

నీళ్ళతో కడుక్కుంటేనేగాని, కళ్ళు తెరవలేదు.

నీళ్ళు!?....నీళ్ళెలా వస్తాయి?

ఎడారిలో నీళ్ళా?!

అవును, ఎడారి అయితే ఇసక మేటలుండాలిగాని పచ్చికబయళ్ళెలా వుంటాయి? తనిప్పుడు పచ్చికమీద పడివున్నాడేమిటి?

అతనికి జరిగిందంతా ఒకటొకటి గుర్తు వచ్చాయి.

తను, కోయిల ఒంటెలమీద ఘోర్క్ బందిపోట్ల ప్రాకారాన్ని చేరుకునే సమయంలో విపరీతమైన గాలి వీచటం, ఇసక తుఫాన్ చెలరేగటం, అమాంతం తను గాల్లో లేచిపోవటం, ఎటో గాలివాటుకు తేలిపోవటం- అన్నీ గుర్తు వచ్చాయి.

ఎడారినుంచి తనీ పచ్చికబయలు మీదకు చేరుకోవటానికి కారణం ఆ ఇసక తుఫాన్! అవును, అంత ఉధృతమైన ఝంఝామారుతాన్ని తాను పుట్టి బుద్ధెరిగాక చూళ్ళేదు.

తనింకా బతికే ఉండటం నిజంగా అపూర్వమైన విషయం! గాల్లో తేలిపోయినప్పుడు కాకపోయినా నేల మీద పడిపోయినప్పుడైనా తన శరీరం తుత్తునియలై తను ప్రాణాలు వదిలేసి వుండాల్సిందే!

కాని, అదృష్టం తనని వెన్నంటి వుంది. అందుకే ఏ రాతిబండకో కొట్టుకుని చావకుండా తను పచ్చికమీదకి విసిరివేయబడ్డాడు. ఒత్తుగా తివాచీలా పెరిగివున్న మెత్తటి గడ్డి, పరుపులా తనని ఒళ్ళో చేర్చుకుని ఊపిరి పోసింది.

తను కళ్ళు తెరిచింది ప్రకృతిమాత ఒడిలో—

ప్రమద్వర ఒడిలో కాదు!

ప్రమద్వర గుర్తుకురాగానే అతని ఒళ్ళు జలదరించింది. అది కేవలం కలమాత్రమేనని సరిపెట్టుకోలేక పోతున్నాడు. తన శరీరం ఇంకా వొణుకుతూనే వుంది.

వీరభద్రుడిలా రౌద్రాకారం ధరించి చేత పాడవాటి కరవాలం ధరించి ప్రమద్వర తల నరికిన ఆ భీకరాకారం యెంత మరచిపోదామన్నా మరపురావటంలేదు. ఎంత భయంకరమైన కల!

ప్రమద్వర రూపం కూడా తన మనస్సుకి పూర్తిగా హత్తుకుపోయింది. ఆ సుందర రూపం తన కళ్ళెదుట లాస్యం చేస్తూన్నట్టే వుంది. ఆ అనుభూతి తన మనసు నిండా తన్మయత్వంతో, పులకరింతలతో పలకరిస్తూనట్టే వుంది.

ఏది నిజం? ఏది కల? నిజంలాంటి కలా? కలలాంటి నిజమా?

అతి ప్రయత్నంమీద కొద్దిగా కళ్ళు తెరిచాడు సిద్ధార్ధ ఇసకని తొలగిస్తూ. కళ్ళు నలపకుండా వేళ్ళతో కనురెప్పల్ని విడదీస్తూ చివరికి పూర్తిగా కళ్ళు తెరిచాడు!

కాస్సేపటివరకు కళ్ళెదుట ఏమీ కనిపించలేదు. గాఢాంధకారం! తను గుడ్డివాడయిపోలేదు కదా అన్న ఆలోచన వచ్చి నిలువెల్లా ఒణికిపోయాడు.

నో, నో! అలా ఎన్నటికీ జరగదు. తను గుడ్డివాడుగా బతకలేడు. అంతకన్న ప్రాణం పోవటమే హాయి!

అయితే తన కళ్ళు బాగానే పనిచేస్తూన్నాయని, అది రాత్రి సమయం కావటంవల్ల, అంతటా చీకటి ఆవరించుకుని తనకేమీ కనిపించటంలేదని అతని మెదడు గ్రహించ

టానికి మరో రెండు నిమిషాలు పట్టింది.

ఆకాశంలో చంద్రుడు లేడు! కేవలం చుక్కల కాంతి మాత్రమే అతి తక్కువగా భూమ్మీద ప్రసరించి, పరీక్షగా చూస్తే నే గాని ముందున్నదేమిటో అర్థంకాని పరిస్థితిని కల్పించింది.

కనుచూపు మేరలో అంతా పచ్చికబయలుమాత్రమే కనిపించిందతనికి.

అంతేకాదు. ఆకాశం మేఘావృతమైన నిజాన్ని కూడా అప్పుడే గ్రహించాడు. తన ఒంటికి చల్లగా తాకుతున్న గాలి స్పర్శను బట్టి అతి స్వల్ప వ్యవధిలో నే కుంభవృష్టి కురవవచ్చునని కూడా అతనికి స్ఫురించింది.

అతనికి కోయిల గుర్తొచ్చింది. అవును, తనతో బాటు తుఫాన్ తాకిడికి గురైన కోయిల ఏమయ్యింది? తనలాగే ఈ పచ్చిక బయల్లో ఎక్కడికో విసిరెయ్యబడిందా? అయితే ఈ చుట్టుపక్కల ఎక్కడో తనలాగే స్పృహ కోల్పోయిన స్థితిలో పడుందా?

ఏమో.... పాతకాలి! ఆమె కూడా ఈ పరిసర ప్రాంతాల వుండొచ్చు.

లేచి నిలబడబోయి ముందుకు తూలాడు సిద్ధార్థ. అవయవాలు సహకరించటం లేదు. చెమటతోను, మట్టితోను అట్టకట్టిపోయిన దుస్తులు తోలు ముక్కల్లా శరీరానికి వేలాడుతుంటే హీనంకాని వాసన ముక్కుకు తగులుతుంటే తనమీద తనకే మరోసారి అసహ్యమేసింది.

అంత క్రితం కల్లోని అనుభూతి మళ్ళీ గుర్తొచ్చింది. పన్నీటి తొట్టెల్లో తనివిదీరా జలకాలాడటం, మల్లెపూవు లాంటి తుండుతో తుడుచుకోవటం, విశాలమైన స్నానాల గది, రాజభవనాలు, ఉద్యానవనం, ఆకాశాన్నంటే

కోట ముఖద్వారం, బలమైన ఉక్కు తలుపులు, కోట బురుజాలు అన్నీ గుర్తొచ్చాయి. అవన్నీ కళ్ళముందు సజీవంగా కదుల్తుంటే అది కల అని సరిపెట్టుకోలేక పోతున్నాడు.

కుడిభుజం, కదుల్తున్నప్పుడు ఇంకా నొప్పిగానేవుంది. గాయం పచ్చిగానేవుంది. కాకపోతే కాస్త మాను పట్టింది—కోయిల పిండిన పసరు పుణ్యమా అని.

ముందు ఆమెను వెతకాలి. ఆమె సజీవంగా వుండాలని భగవంతుని కోరుకున్నాడు. ఆమె తన తండ్రికి జరిగిన అన్యాయానికి ప్రతీకారం తీర్చుకునే వరకు బతికే వుండాలి. అవును, బతికేవుండాలి; ఉంటుంది!

ఆకసిలో ఎక్కడో ఆశ, మినుకుమంటోంది. ప్రయత్నంమీద ముందు కడుగువేశాడు. కడుపులో ఆకలి కరకర మంటోంది. దాహం రాత్రిమూలాన కొంత ఉపశమించినట్టే వుందిగాని నాలుక పిడచకట్టుకుపోయి గొంతు పొడారిపోయి ఏదోలావుంది.

వెండి పళ్ళేలలోని రుచికరమైన భోజనపదార్థాలు, పళ్ళు గుర్తొచ్చాయి. కల్లోనైనా సుష్టుగా భోంచేసి, తనివి దీరా స్నానం చేశాడు. ఆత్మానందం దక్కింది.

వాచీ చూసుకున్నాడు అప్రయత్నంగా. వాచీడయల్ మీది గ్లాసు బద్దలయింది. ముళ్ళు నిశ్చలంగా ఒకేచోట వున్నాయి, ఏడు గంటల పదినిమిషాలు చూపిస్తూ.

అంటే ఇసక తుఫాన్ వచ్చిన కాసేపటికి డయల్ గ్లాసు చిట్లిపోయి మిషనుకి గట్టి దెబ్బతగిలి వాచీ ఆగిపోయుండాలి.

టపటపమంటూ రెండు నీటిబొట్లు అతనిమీద రాలాయి.

ఉలిక్కిపడి పైకి చూశాడు.

మబ్బులు దట్టంగా కమ్ముకుంటున్నాయి. వర్షం వచ్చే ట్టుంది. చుక్కలు కూడా మబ్బుల చాటున దాక్కిపోయి భూమికి వెలుగును పంచటానికి నిరాకరించాయి.

అంతా అగమ్యంగా, గందరగోళంగా అనిపించింది సిద్ధార్థకి.

ఎక్కడా తలదాచుకోవటానికి ఆశ్రయం కనిపించటం లేదు. అంతా పచ్చిక! పిచ్చిమొక్కలు, పొదలతో దట్టంగా పెరిగిన గడ్డి తప్ప మరేం కనిపించటంలేదు.

ఓపక్క ముందుకి సాగుతూ నే కోయిల కోసం వెయ్యి కళ్ళతో వెతుకుతున్నాడు సిద్ధార్థ.

కాని కోయిల ఎక్కడా కనిపించలేదు.

ఆమెకు తనకన్న ముందుగానే స్పృహ వచ్చి వుండాలి! తనని వెతుక్కుంటూ ఆమె మరోదారి పట్టిందేమో! ఏమో!?....

ఆశ నిరాశలమధ్య ఊగిసలాడుతూ ముందుకి కదులు న్నాడు సీడలా. భుజాన ఉండాల్సిన విల్లుగాని, వీపుకి కట్టుకున్న అంబులపొదిగాని లేవు. కత్తి కూడా లేదు.

తనిప్పుడు నిరాశ్రయుడేకాదు, నిరాయుధుడుకూడా! ఏదైనా అవాంతరం ఎదురైతే ఎదుర్కోవటానికి ఏమీ లేదు.

టపటపమంటూ చినుకులు మొదలై మరి కాసేపట్లో వర్షం ఉధృతమవుతున్న సూచనలు కనిపించాయి. వర్షం పెద్దదయ్యేలోపల తనకో గూడు దొరుకుతుందనే ఆశ అడుగంటిపోయింది.

విశాలమైన ఆ మైదానంలో గూడెలా వుంటుంది? కనీసం కొండ బండలున్న ప్రాంతమైతే ఏ రాతి గుహో

ఆశ్రయమిచ్చి వుండేది. ఏ అడివో అయితే చెట్టు తొర్ర గాని, గుబురు కొమ్మలుగాని ఆశ్రయమిచ్చేవేమో!

కాని, ఈ పచ్చిక బయలు ఏమిస్తుంది, గడ్డితప్ప!

అయితే, అతని అంచనాలని తలకిందులు చేస్తూ దూరంగా ఏదో కట్టడం కనిపించింది సిద్ధార్థకు.

చీకటికి బాగా అలవాటపడ్డ కళ్ళను చిట్లించి చూశాడు!

అవును, అక్కడేదో గోడలాంటి నిర్మాణం కనిపిస్తోంది. ఏదో భవనంలాగానే వుంది.

మైదానంలో కట్టడమా? నిజంగా అద్భుతమే!

సిద్ధార్థ అడుగులు చురుగ్గా పడ్డాయి. వర్షపు చినుకులు కూడా చురుకుగానే పడుతున్నాయి. కాసేపట్లోనే కుండపోతగా కురవటం మొదలెట్టింది.

వానలో తప్పగా తడిసిపోతూ, పచ్చికలో కూరుకుపోతున్న కాళ్ళను ఎత్తివేస్తూ ఆ కట్టడంవైపు సాగిపోయాడు సిద్ధార్థ.

సరిగా పది నిమిషాల్లో అక్కడికి చేరుకున్నాడు. అప్పటికే వర్షం గాలితో ఉధృతమై, ఆకాశం చిల్లులు పడిందా అన్న భ్రాంతిని కలిగిస్తూ ఏకధాటిగా కురుస్తోంది.

ఉరుములు, మెరుపులు తోడయ్యాయి.

మెరుపు వెలుగులో ఆ కట్టడం స్పష్టంగా చూడగలిగాడు సిద్ధార్థ. అతను వులిక్కిపడ్డాడు.

ఎత్తయిన కోటగోడలు, బురుజులు, ఆకాశాన్నంటే బ్రహ్మాండమైన కోట ముఖద్వారం, ఉక్కు తలుపులు ఆ తలుపుల్ని ఇముడ్చుకున్న రాతిగోడను చూడగానే తను కల్లో చూసిన కోట గుర్తొచ్చింది సిద్ధార్థకు!

అవును, సందేహంలేదు. ఇదే కోట, ఇలాంటి తలుపులే! ఇక్కడే ప్రమద్వర ఒళ్లోనే తను కళ్ళు తెరిచాడు.

కాని, ఇదెలా సంభవం? తను స్పృహలేని స్థితిలో కల్లో చూసిన కోట ఇప్పుడు కళ్ళు తెరిచాక నిజంగానే కళ్ళముందు సాక్షాత్కరించటం ఎలా జరిగింది? ముందు గానే తనీ కోటను కల్లో ఎలా చూడగలిగాడు?

ఎక్కడో పిడుగు పడింది.

ఉలిక్కిపడ్డాడు సిద్ధార్థ. అతని వెన్నున ఏదో జర జర పాకిన అనుభూతి. ఒళ్ళు జలదరించింది. వెంట్రుకలు నిక్కబొడుచుకున్నాయి.

పోడారిపోయిన గొంతునుంచి సన్నటి మూలుగులాంటి శబ్దం బయటికొచ్చింది.

మరోసారి మెరుపు మెరిసింది! ఇప్పుడు మరింత స్పష్టంగా కనిపించింది కోట!

అదే కోట, అవే తలుపులు!

గిచ్చి చూసుకున్నాడు. నొప్పి పుట్టింది. అవును, కలకాదు, ఇది మాత్రం నిజం, నిజంగా నిజమే!

నిశ్చేష్టుడై అలాగే నిల్చుండిపోయాడు సిద్ధార్థ.

* * *

కాసేపటికి తేరుకుని పరిసరాల్ని పరిశీలించాడు సిద్ధార్థ.

అతని గుండె లయబద్ధంగా కొట్టుకుంటోంది. ఏదో జరగబోతోంది, అని మాత్రం అతని మనసుకి తెలుస్తోంది. ఏమిటది?

వర్షం మరీ మరీ హెచ్చి ఓ ప్రళయం రాబోతున్న ప్రమాదాన్ని సూచిస్తోంది.

సిద్ధార్థ అంతదాకా నీటికోసం తపించిపోయాడు, ఇప్పుడు అదే నీరు ప్రాణాంతకంగా తయారవుతోంది.

ఎంతలో ఎంత మార్పు! అతనికిప్పుడు దాహం వెయ్యటం లేదు. గొంతు సాఫీగా అయిపోయింది.

తడిసిన ఒళ్ళు చలికి గజగజలాడుతోంది. అంతదాకా వేడిమికి వేగిపోయి కాలిపోయిన శరీరం చల్లబడిపోయింది. చెమటతో మట్టితో అట్టకట్టుకుపోయిన ఒళ్ళు వర్షం నీటితో ప్రక్షాళనమయి పోయింది.

అయితే కట్టెదుట కనిపిస్తూన్న దృశ్యం మాత్రం మనసులో గుబులు పుట్టిస్తోంది. లోపలికి వెళ్ళటంవల్ల ఏదైనా ప్రమాదం సంభవిస్తుందా అనే సందేహాన్ని కలిగిస్తోంది.

కాని ఏదోక ఆశ్రయం. తలదాచుకోవటానికి నీడ తప్పనిసరి కావటం, వర్షంనుంచి రక్షించుకోవలసిన అవసరం అతన్ని ముందుకు నెట్టాయి.

దగ్గరగా వెళ్ళి చూసిన సిద్ధార్థ గోడలు ముఖద్వారం శిథిలావస్థలో వుండటం గమనించి విస్తుపోయాడు.

రాతిగోడలు కావటంవల్ల దృఢంగా కనిపిస్తున్నాయి గాని చాలా ఏళ్ళ కిందటి కోట కావటంవల్ల మెతక వాసన—అదోరకమైన గబ్బిలాల కంపు—వస్తోంది.

తలుపులు మూసిలేవు. అవి ఉక్కు. తలుపులు కాదు—చెక్క తలుపులే! అవి కూడా చెదలు తినేసి రూపురేఖలు నశించిపోయి నామ మాత్రంగా కనిపిస్తున్నాయి.

తలుపులు తెరిచివున్న ద్వారం నుంచి లోపలి దృశ్యం అస్పష్టంగా కనిపిస్తోంది.

గడపదాటబోతూండగా బుస్సుమన్న ఛీత్కారం ఒళ్ళు గగుర్పొడిచేలా వినిపించింది. చటుక్కున ఆగిపోయాడు సిద్ధార్థ.

ఏదో విషసర్పం జర జర పాకుతూ లోపలకు వెళ్ళి

పోయింది.

గుండె ఓ క్షణం ఆగి కొట్టుకున్నది.

తనిప్పుడు నిరాయుధుడు! కనీసం ఇలాంటి విషసర్పాల్ని ఎదుర్కోవటానికిగాని, తనను తను రక్షించుకోవటానికిగాని ఓ కర్ర కూడా లేని పరిస్థితి. దయనీయమైన స్థితి.

అక్కడ కూడా ధారాళంగా వర్షం పడుతూనేవుంది. పైన ఎలాంటి ఆచ్ఛాదనా లేదు.

గడపదాటి లోని కడుగుపెట్టాడు సిద్ధార్థ. దాటేటప్పుడు కాలుఎత్తి వెయ్యాల్సి వచ్చింది. చాలా ఎత్తయిన గడప అది!

లోపల కొంతమేర ఎండిపోయిన చెట్లు, మొక్కలు, కనిపించాయి. గడ్డి బాగా గుబ్బుగా పెరిగివుంది. ఏవేవో పిచ్చిమొక్కలు దట్టంగా పెరిగి అడ్డదిడ్డంగా పడున్నాయి.

అక్కడ ఎన్నాళ్ళుగానో ఎవరూ మసలటం లేదని అక్కడి వాతావరణం చూస్తుంటే ఎవరైనా గ్రహించవచ్చు.

సిద్ధార్థ మనసులో తనకొచ్చిన కల సినిమారీలులా తిరుగుతోంది. తను, ప్రమద్వర ఈ తోటలోనించే ముందుకు వెళ్ళారు. తను చూసిన ఉద్యానవనం ఎంత మనోహరంగావుంది; ఎంత కన్నుల పండుగ కలిగించింది, ఎంత వైభవోపేతంగా కనిపించింది!?

ఇదేమిటి ఈ పిచ్చి మొక్కలతో నానా బీభత్సంగా వుంది_అనుకున్నాడు.

ఆ తోట దాటినవెంటనే ఓ మహాలు కనిపించింది. ఇప్పుడది ఠీవిగా ఆకాశంలోకి గర్వంగా ఎదిగిన రాచ

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 5 వ తేదీలోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాది పాటు పత్రిక లేదా సప్లిమెంట్ బహుమతిగా పంపుతాము.

## "హోమ్ డెలివరీ"

'హోమ్ డెలివరీ' సభ్యులకు 'అపరాధ పరిశోధన' పత్రిక మరియు సప్లిమెంట్ కాపీలు వాటి అసలు ధరకే అందజేయబడతాయి. అంతేకాదు - వారికి పత్రికలను ప్రతి నెలా రిజిష్టరు లేదా బుక్ పోస్ట్‌లో పంపుతాము.

ప్రతి 6 నెలలకు ఒకసారి అంటే - జనవరి మరియు జూలై నెలల పత్రికలు మాత్రం V. P. ద్వారా పంపబడతాయి. దానికి మీరు అర్థ సంవత్సర చందా రు. 90/-లు చెల్లించవలసి వుంటుంది. పోస్టు ఖర్చులన్నీ మేమే భరిస్తాము.

'హోమ్ డెలివరీ' వల్ల పత్రికలు మీకు మరింత త్వరితంగా, గ్యారంటీగా అందుతాయి. ఇంకా నెలనెలా, రెండేసి నెలలకు V. P. ద్వారా తెప్పించుకునే సౌకర్యంకూడా వుంది.

మరి - మీరు చేయవలసిందల్లా వెంటనే రు. 10/-లు పంపి శాశ్వతంగా 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరటమే.

పూర్తి వివరాలకై 'అపన' చూడండి!

భవనంలా లేదు; గోడలు ఓ పక్క పడిపోతూ ఒకనాటి వైభవాన్ని తలపింప చేస్తూన్న అవశేషంలా వుంది.

లోపలికి అడుగు పెడుతూ తుళ్ళిపడ్డాడు సిద్ధార్థ.

ఎవరిదో మంజీరనాదం వినిపిస్తోంది. ఘల్లు ఘల్లున నడుస్తూన్న శబ్దం! అతని వెన్నున ఏదో పాకినట్టనిపించింది. అది కేవలం కొద్ది క్షణాలు మాత్రమే! మళ్ళీ మామూలుగా అయిపోయాడు.

గదంతా చిమ్మచీకటి అలముకొనివుంది. ఉండి వుండి మెరుస్తున్న మెరుపుల్లో ఆ గదిని పూర్తిగా చూడాలని విఫల ప్రయత్నం చేస్తున్నాడు.

ఇప్పుడు తనకి వర్షంనించి రక్షణ లభించింది. సంతోషించాల్సిన అంశమేమిటంటే పైకప్పు సాంతం కూలిపోలేదు. ఓ పక్క తడుస్తూన్నా చాలా భాగం పొడిగానే వుంది.

తెల్లవారే వరకు తనిక్కడ క్షేమంగా గడిపెయ్యగలిగితే చాలు; తర్వాత బయటపడి ఏదో దారి వెతుక్కోవచ్చు.

అయితే తను ఎడారి పూర్తిగా దాటి వచ్చేసినట్టేనా? ఎడారిలో వర్షం పడదుకదా! ఇదేదో జనావాస ప్రాంతానికి దగ్గరలోవున్న పాడుబడిన కోట! అంటే గతంలో ఈ ప్రాంతాన్ని పరిపాలించిన రాజుగారి హవేలీ అన్నమాట ఇది.

పెద్ద ఉరుము ఉరిమింది. దాంతోబాటు విడవకుండా ఓ నిమిషంపాటు మెరుపులు మెరిశాయి.

ఆ మెరుపులో గోడకున్న తైలవర్ణ చిత్రమొకటి అతని దృష్టిపథంలో పడింది.

దాన్ని చూస్తూనే అదిరిపడ్డాడు సిద్ధార్థ! అపురూప

సౌందర్యమూర్తి అయిన స్త్రీమూర్తి చిత్రమది!

ఆ స్త్రీమూర్తి ఎవరో కాదు—ప్రమద్వర.

అవును, అసలు పేరు అదో కాదో తనకు తెలీదుగాని, తనకు కలలో కనపడ్డ రాకుమారి చిత్రమే అది! మూర్తీభవించిన ఆమే ఈమె!

అంత చలిలోను అతని ఒళ్ళంతా స్వేదంతో తడిసి పోయింది. వర్షం నీటితో తడిసిన ఒళ్ళు చెమటలు కక్కుతోంది.

తను చూస్తున్నది మరో కల కాదు గదా!

కాదని ప్రత్యక్షంగా తెలుస్తూనేవుంది. ఇదంతా కాకతాళీయమా, లేక ఏదో అదృశ్యశక్తి ఇదంతా నడిపిస్తోందా? ఎక్కడో ఎడారిలో మగ్గిపోతున్న తనని సునాయాసంగా తుఫాన్ రూపంలో గాలి మోసుకుపోయి ఇక్కడ పడేయ్యటం నమ్మకాని కందని నిజం!

అలాగే, తను తర్వాత చూడబోయే శిధిలమైన కోట తనకి కొన్ని గంటలముందు స్పృహలేని స్థితిలో కలలో సజీవంగా కనిపించటం, ఇదికూడా నమ్మలేని మరో నిజం!

ఒకప్పటి ఈ రాజభవనంలో సంచరించిన రాజకుటుంబిని తనకు కల్లో ఎలా కనిపించింది? అదే అంతుబట్టని విషయం.

తైలవర్ణ చిత్రంమీదినుంచి దృష్టిని మరోవైపు సారించాడు సిద్దార్ధ. ఆ గదిని చేర్చి ఇంకా చాలా గదులున్నట్లు గమనించాడు. ప్రతి అంశం స్వప్నంలో చూసినదే.

తను బతికి బయటపడితే ఈ అపురూపమైన అనుభూతిని, అనుభవాన్ని దివ్యతో పంచుకోవాలి! .... నో, నో! దివ్యతో జీవితాన్ని పంచుకోలేని

తను ఈ అనుభవాన్నెలా పంచుకోగలడు?

తనలోనే అపురూపంగా దాచుకోవాలి!

మళ్ళీ యెక్కడినుంచో అడుగుల సవ్వడి వినిపించింది. అదే మంజీరాల ధ్వని! చెవులు రిక్కించి విన్నాడు. క్రమంగా ఆ శబ్దం దూరమైపోయింది.

మరోసారి మెరుపు మెరిసింది.

ఆ మెరుపు వెలుగులో నడవారంతటి పొడవాటి హాల్లో యెవరో నడుస్తూ వెళుతున్నట్లు లీలగా కనిపించిం దతనికి.

గుండె ఆగి మళ్ళీ కొట్టుకున్నది.

సిద్ధార్థలో మొండిధైర్యం ప్రవేశించింది. మెల్లగా అడుగులో అడుగు వేస్తూ ఆ దిక్కుగా వెళ్ళాడు.

అంతటా భయంకరమైన నిశ్శబ్దం. చీమచిటుక్కుమన్నా వినిపించేంత నిశ్శబ్దం. బయట హోరున కురుస్తూన్న వాన సవ్వడి అక్కడకు లీలామాత్రంగా వినిపిస్తోంది. అది సౌండ్ ప్రూఫ్ చెయ్యబడ్డ భవనంలా అనిపించింది సిద్ధార్థకు.

వరసగా నాలుగు గదులు దాటాక చివరి గది— అయిదవదీ అయిన ఆ గది ముందాగాడు సిద్ధార్థ.

లోపల మంచం కనిపిస్తోంది. మంచం శిథిలావస్థలో వున్నట్టు మెరుపు కాంతిలో గుర్తించాడు.

మళ్ళీ అతని మనసులో కలవరం! ఇదే గదిలో ప్రమద్వర తనని పక్కమీదికి లాక్కుని.... అవును, ఇదే గది! ఇక్కడే ప్రమద్వరని ఆమె తండ్రి కరవాలంతో....

పక్కన ఏదో శబ్దమయ్యింది.

చటుక్కున తలతిప్పి చూశాడు సిద్ధార్థ. ఏదో చల్లటి వస్తువు తనని తాకుతూ ఆ గదిలోకి వెళ్తూన్నట్లు స్పష్టంగా గుర్తించాడు. (ఇంకా వుంది)

